శ్రీరస్తు

# ఆంధ్రసూత్రభాష్యము

## అధ్యాయము 3.

---

ఇది

శ్రీమచ్ఛంకర భగవత్పాదకృతియగు

శ్రీమచ్ఛారీరకమీమాంసాభాష్యమున

కాంధ్రీకరణముగా


శ్రీ పీఠికాపుర మండలాధీశ్వరులగు

శ్రీ శ్రీ శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి

సూర్యారావుబహదరు ప్రభువుగారియాజ్ఞ ననుసరించి

వారి యాశ్రితుఁడగు

పురాణపండ మల్లయ్యశాస్త్రిచే

రచింపఁబడినది



మొదటికూర్పు 1000 ప్రతులు

చెన్నపురి

యాంధ్రపత్రికాకార్యాలయమున

ముద్రితము

---

1921

# ఆంధ్రసూత్రభాష్యము

## అధ్యాయము 3.

---

## అధికరణానుక్రమణిక


| | | |
|---|---|---|
| | | పుటసంఖ్య |
| | పాదము ౧. | |
| 1 | తదంతరప్రతిపత్త్యధికరణము | 1 |
| 2 | కృతాత్యయాధికరణము | 25 |
| 3 | అనిష్టాదికార్యధికరణము | 42 |
| 4 | సాభావ్యాపత్త్యధికరణము | 56 |
| 5 | నాతిచిరాధికరణము | 59 |
| 6 | అన్యాధిష్ఠితాధికరణము | 61 |
| | పాదము ౨. | |
| 1 | సంధ్యాధికరణము | 70 |
| 2 | తదభావాధికరణము | 90 |
| 3 | కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము | 103 |
| 4 | ముగ్ధాధికరణము | 109 |
| 5 | ఉభయలింగాధికరణము | 114 |
| 6 | ప్రకృతైతావత్త్వాధికరణము | 146 |
| 7 | పరాధికరణము | 166 |
| 8 | ఫలాధికరణము | 180 |
| | పాదము 3. | |
| 1 | సర్వవేదాంతప్రత్యయాధికరణము | 188 |
| 2 | ఉపసంహారాధికరణము | 202 |

| | | పుటసంఖ్య |
|---|---|---|
| 3 | అన్యథాత్వాధికరణము | 204 |
| 4 | వ్యాప్త్యధికరణము | 215 |
| 5 | సర్వాభేదాధికరణము | 220 |
| 6 | ఆనందాద్యధికరణము | 224 |
| 7 | ఆధ్యానాధికరణము | 230 |
| 8 | ఆత్మగృహీత్యధికరణము | 234 |
| 9 | కార్యాఖ్యానాధికరము | 247 |
| 10 | సమానాధికరణము | 253 |
| 11 | సంబంధాధికరణము | 257 |
| 12 | సంభృత్యధికరణము | 262 |
| 13 | పురుషవిద్యాధికరణము | 266 |
| 14 | వేధాద్యధికరణము | 271 |
| 15 | హాన్యధికరణము | 277 |
| 16 | సాంపరాయాధికరణము | 288 |
| 17 | గతేరర్థవత్త్వాధికరణము | 292 |
| 18 | అనియమాధికరణము | 295 |
| 19 | యావదధికారాధికరణము | 300 |
| 20 | అక్షరధ్యధికరణము | 309 |
| 21 | ఇయదామననాధికరణము | 313 |
| 22 | అంతరాభూతగ్రామాధికరణము | 317 |
| 23 | వ్యతిహారాధికరణము | 321 |
| 24 | సైవహిసత్యాధికరణము | 324 |
| 25 | కామాద్యధికరణము | 328 |

| | | | | పుటసంఖ్య |
|---|---|---|---|---|
| 29 | ఆదరాధికరణమ్ము | ... | ... | 332 |
| 27 | తన్నిర్ధారణానియమాధికరణము | . | ... | 340 |
| 28 | ప్రదానాధికరణము | .... | ... | 347 |
| 29 | లింగభూయస్త్వాధికరణము | ... | ... | 355 |
| 30 | శరీరేభావాధికరణము | ... | ... | 373 |
| 31 | అంగావబద్ధాధికరణము | ... | ... | 380 |
| 32 | భూమజ్యాయస్త్వాధికరణము | ... | ... | 386 |
| 33 | శబ్దాదిభేదాధికరణము | ... | ... | 391 |
| 34 | వికల్పాధికరణము | ... | ... | 393 |
| 35 | కామ్యాధికరణము (యథాకామాధికరణము) | ... | ... | 398 |
| 36 | యథాశ్రయభావాధికరణము | | ... | 400 |

పాదము ४.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | పురుషార్థాధికరణము | ... | ... | 408 |
| 2 | పరామర్శాధికరణము | ... | ... | 435 |
| 3 | స్తుతిమాత్రాధికరణము | ... | ... | 449 |
| 4 | పారిప్లవార్థాధికరణము | ... | ... | 453 |
| 5 | అగ్నీంధనాద్యధికరణము | ... | ... | 456 |
| 6 | సర్వాపేక్షాధికరణము | ... | ... | 458 |
| 7 | సర్వాన్నానుమత్యధికరణము | ... | ... | 465 |
| 8 | విహితత్వాధికరణము | ... | ... | 472 |
| 9 | అంతరాత్వద్దృష్ట్యధికరణము (అంతరాధికరణము) | ... | ... | 478 |

పుటసంఖ్య.

10 తద్భూతాధికరణము ... ... 482
11 ఆధికారికాధికరణము ... ... 485
12 స్మృత్యాచారాధికరణము ... ... 490
(బహిస్తూభయథాధికరణము)
13 స్వామ్యధికరణము ... ... 491
14 సహకార్యంతరవిధ్యధికరణము ... ... 496
15 అనావిష్కారాధికరణము ... ... 506
16 ఐహికాధికరణము ... ... 509
17 ముక్తిఫలాధికరణము ... ... 514



# ఆంధ్రసూత్రభాష్యము

## అధ్యాయము 3.

---

## విషయసూచిక


| విషయము. | సూత్ర సంఖ్య. | అధికరణ సంఖ్య. | పుట సంఖ్య. |
|---|---|---|---|
| **పాదము ౧.** | | | |
| భావిశరీరమునకు బీజము లగు భూతసూక్ష్మములతోఁ గూడి యే జీవుఁ డీలోకమునుండి పోవు నని నిరూపించుట. | 1- 7 | 1 | 1 |
| కర్మాంతరములచే సానుశయుఁ డగు జీవునకు లోకాంతరమునుండి యాగమనము. | 8-11 | 2 | 25 |
| పాపులకు యమలోకగమనము. | 12 21 | 3 | 42 |
| లోకాంతరమునుండి యవరోహించు జీవునకు వియదాదిసామ్యనిరూపణము. | 22 | 4 | 56 |
| స్వర్గమునుండి యవరోహించునపుడు స్వర్గవృష్టిపృథివీపురుషయోషిత్తులందుఁ గ్రమముగా జన్మించు జీవునకు స్వర్గవృష్ట్యాదులందలి జన్మమునఁ ద్వరయు నితరములందలి జన్మమున విలంబము నని నిరూపించుట. | 23 | 5 | 59 |
| స్వర్గమునుండి యవరోహించునపుడు జీవునకు సస్యాదులందు సంశ్లేషమే కాని ముఖ్య జన్మము లేదని నిరూపించుట. | 24-27 | 6 | 6[illegible] |
| **పాదము ౨.** | | | |
| స్వప్నసృష్టికి మిథ్యాత్వకథనము. | 1- 6 | 1 | 70 |
| సుప్తిస్థాన మగు హార్దబ్రహ్మమునకు జీవునకు నేకత్వస్థాపనము. | 7- 8 | 2 | 90 |

| విషయము. | సూత్ర సంఖ్య. | అధికరణ సంఖ్య. | పుట సంఖ్య. |
|---|---|---|---|
| సుషుప్తియందున్న జీవునకే బ్రహ్మమునుండి యుద్బోధము గాని వేఱొకనికిఁ గాదని నిరూపించుట. | 9 | 3 | 108 |
| మూర్ఛకు జాగ్రదాద్యవస్థలకంటె భిన్నత్వ నిరూపణము. | 10 | 4 | 109 |
| బ్రహ్మమునకు నీరూపభావము వేదాంత సమ్మత మని చెప్పుట. | 11-21 | 5 | 114 |
| బ్రహ్మము నిషేధ్యాతీతమై నను సత్య మని స్థాపించుట. | 22-30 | 6 | 146 |
| బ్రహ్మముకంటె నితరమగుదాని కవస్తుత్వ స్థాపనము. | 31-37 | 7 | 163 |
| కర్మఫలోత్పత్తికీశ్వరుఁడె కర్త గాని యపూర్వము గాదని స్థాపించుట. | 38-41 | 8 | 180 |
| పాదము 3. | | | |
| ఛాందోగ్య బృహదారణ్యక శ్రుత్యుక్తము లగు పంచాగ్నివిద్యలకు రెండింటికిని విధ్యనుష్ఠానఫలసామ్యముచే నేకత్వనిరూపణము. | 1- 4 | 1 | 188 |
| గుణోపసంహారమునకుఁ గర్తవ్యత్వము. | 5 | 2 | 202 |
| ఛాందోగ్య బృహదారణ్యశాఖలందలి యుద్గీథోపాసనములకు భేదకథనము. | 6- 8 | 3 | 204 |
| బ్రహ్మదృష్టిహేతుత్వసామ్యముచే నక్షరోద్గీథములకేకత్వసంపాదనము. | | 4 | 215 |
| వసిష్ఠత్వాదిగుణముల కుపసంహార్యత్వము. | 10 | 5 | 220 |
| బ్రహ్మగుణము లగు నానందాదులు ప్రతిపత్తిఫలము లగుట నెల్లశాఖల సమానములు గనుకను వ్యవస్థాపకవిధ్యభావము వలనను వాని కుపసంహార్యత్వనిరూపణము. | 11-18 | 6 | 224 |

| విషయము. | సూత్ర సంఖ్య. | అధికరణ సంఖ్య. | పుట సంఖ్య. |
|---|---|---|---|
| పురుషజ్ఞానము సంసారకారణ మగు నజ్ఞానమునకు నివర్తక మగుటవలన నతఁడే వేద్యుఁడని నిరూపించుట. | 14-15 | 7 | 230 |
| ఆత్మశబ్దవాచ్యత్వ మీశ్వరునకేకాని విరాట్టునకు లేదని చెప్పుట. | 16-17 | 8 | 234 |
| ప్రాణోపాసనమును గూర్చి ప్రాణవిద్యాప్రాప్తము లగు ననగ్నతాధ్యానాచమనములలో ననగ్నతాధ్యానమునకే విధేయత్వ నిరూపణము. | 18 | 9 | 247 |
| కాణ్వుల యగ్నిరహస్య బృహదారణ్యకములఁ జెప్పఁబడిన శాండిల్యవిద్యల కేకవిధత్వ నిరూపణము. | 19 | 10 | 253 |
| వేద్యపురుషుఁ డొక్కఁడే యయిన నాదిత్యస్థుఁడగు పురుషున 'అహః' యనియు నక్షిగత పురుషున 'అహం' మనియు నామవిశేషములు స్థానవిశేషమునందే యుక్త మని నిరూపించుట. | 20-22 | 11 | 257 |
| వేద్యైకత్వాభావమువలననే సంభృత్యాదిగుణములకు శాండిల్యవిద్యాదులం దనుపసంహార్యత్వము. | 23 | 12 | 262 |
| తైత్తిరీయక తాండిశాఖలలోని పురుషవిద్యలకుఁ బృథక్త్వనిరూపణము. | 24 | 13 | 266 |
| వేదమంత్ర ప్రవర్గ్యాదులకు విద్యానంగత్వకథనము. | 25 | 14 | 271 |
| దుష్కృతోపాయన మర్థవాద మగుటచే హానియం దుపాయనోపసంహారము కర్తవ్య మని నిరూపించుట. | 1 వర్ణకము. 26 | 15 | 277 |

| విషయము. | సూత్ర సంఖ్య. | అధికరణ సంఖ్య. | పుట సంఖ్య. |
|---|---|---|---|
| ఇట విధూననము హానముకాని చాల నముగాదని నిరూపించుట. 2 వర్ణకము. | 26 | 15 | 277 |
| ఉపాస్యసాక్షాత్కారము కల్గుచుండఁగా మరణమునకుఁ బూర్వమే పాపపుణ్యక్షయమని నిరూపించుట. | 27-28 | 16 | 288 |
| అర్చిరాదిమార్గమున గమనముపాసకునకుఁగాని జ్ఞానికిఁ గాదను వ్యవస్థ. | 29-30 | 17 | 292 |
| ఎల్ల యుపాసనముల నుత్తరమార్గవిధానము. | 31 | 18 | 295 |
| బ్రహ్మజ్ఞానులకు ముక్తినియతము కాని పాక్షికము గాదని ప్రతిపాదించుట. | 32 | 19 | 300 |
| ఆత్మస్వరూపలక్షకము లగు నిషేధములకుఁ బరస్పరోపసంహార్యత్వము. | 33 | 20 | 309 |
| "ఋతం పిబంతౌ" "ద్వా సుపర్ణా" యను మంత్రములందు వేద్యైకత్వనిరూపణము. | 34 | 21 | 313 |
| ఏకశాఖయందున్న యుషస్తికహోడప్రశ్నములయందు వేద్యైకత్వ ప్రతిపాదనము. | 35-36 | 22 | 317 |
| ఉపాసనార్థము వేఱుగా నుపాస్యద్వైధజ్ఞానము. | 37 | 23 | 321 |
| సత్యవిద్యల కేకత్వప్రతిపాదనము. | 38 | 24 | 324 |
| దహరాకాశహార్దాకాశగుణములకుఁ బరస్పరము నుపసంహర్తవ్యత్వ నిరూపణము. | 39 | 25 | 328 |
| ఉపాసకునకు భోజనలోపమునఁ బ్రాణాగ్నిహోత్రలోపనిరూపణము. | 40-41 | 26 | 332 |
| ఉద్గీథాదికర్మాంగోపాసనముల కనియతత్వము. | 42 | 27 | 340 |
| సంవర్గవిద్యయందుఁ జెప్పఁబడిన యాధిదైవమగు వాయువునకు నధ్యాత్మమగు ప్రాణమునకు నను చింతనపార్థక్యనిరూపణము. | 43 | 28 | 347 |

| విషయము. | సూత్ర సంఖ్య. | అధికరణ సంఖ్య. | పుట సంఖ్య. |
| --- | --- | --- | --- |
| మనశ్చిదాదులకు స్వతంత్రవిద్యాత్వస్వీకారము. | 44-52 | 29 | 355 |
| శ్రౌతికమున కవాత్మత్వస్వీకారపూర్వకముగా నితరమున కా(చైతన్యమున కా)త్మత్వ నిరూపణము. | 53-54 | 30 | 378 |
| కర్మాంగావబద్ధోపాసనముల కన్ని శాఖలందు సమానత్వనిరూపణము. | 55-56 | 31 | 380 |
| విరాడ్రూపవైశ్వానరునకుఁ బూర్ణునకే ధ్యాతవ్యత్వముగాని యంగమాత్రునకుఁ గాదను నిర్ణయము. | 57 | 32 | 386 |
| అనుష్ఠాతవ్యములగు శాండిల్యదహరాదివిద్యలకు, వేద్యబ్రహ్మము భిన్నమగుటచే భిన్నత్వనిరూపణము. | 58 | 33 | 391 |
| అహంగ్రహోపాసనములకు వికల్పానుష్ఠాన నియమకథనము. | 59 | 34 | 396 |
| ప్రతీకోపాసనానుష్ఠానమున కైచ్ఛికత్వకథనము. | 60 | 35 | 398 |
| అంగావబద్ధోపాసనములకు యథాకామానుష్ఠానకథనము. | 61-66 | 36 | 400 |


పాదము ౪.


| | | | |
| --- | --- | --- | --- |
| ఆత్మజ్ఞానము స్వతంత్రమే కాని కర్మాంగము గాదని నిరూపించుట. | 1-17 | 1 | 408 |
| సన్న్యాసాశ్రమమున కస్తిత్వస్థాపనము. | 18-20 | 2 | 435 |
| ఉద్గీథావయవమగు నోంకారమునకు ధ్యేయత్వ నిరూపణము. | 21-22 | 3 | 449 |
| ఔపనిషదాఖ్యాయికలకు విద్యాస్తావకత్వ కథనము. | 23-24 | 4 | 453 |
| ఆత్మజ్ఞానమునకు ఫలోత్పత్తియందుఁ గర్మానపేక్షత్వకథనము. | 25 | 5 | 456 |

| విషయము. | సూత్ర సంఖ్య. | అధికరణ సంఖ్య. | పుట సంఖ్య. |
|---|---|---|---|
| విద్యకు స్వోత్పత్తియందు గర్మసాపేక్షత్వ నిరూపణము | 26-27 | 6 | 458 |
| ఆపత్కాలమున సర్వాన్నభక్షణాభ్యనుజ్ఞానము. | 28-31 | 7 | 5 |
| విద్యం గోరనివానికిని నిత్యకర్మానుష్ఠాననియమకథనము. | 32-35 | 8 | 472 |
| అనాశ్రములకును జ్ఞానసంభావన. | 36-59 | 9 | 478 |
| ఆశ్రముల కవరోహాభావనిరూపణము. | 40 | 10 | 482 |
| భ్రష్టులగు నూర్ధ్వరేతసులకుం బ్రాయశ్చిత్త సద్భావకథనము. | 41-42 | 11 | 485 |
| భ్రష్టుండగు నూర్ధ్వరేతుని ప్రాయశ్చిత్త మాముష్మికశుద్ధిహేతువే [illegible] వానికి వ్యవహారానర్హత్వకథనము. | 43 | 12 | 490 |
| ఉపాసనములకు ఋత్విక్కర్తృత్వనిరూపణము. | 44-46 | 13 | 491 |
| మౌనమునకు విధేయత్వనిరూపణము. | 47-49 | 14 | 496 |
| బాల్యము నా భావశుద్ధియే కాని కామచారాదికము గాదని నిరూపించుట. | 50 | 15 | 506 |
| శ్రవణాదులున్నను జ్ఞానోత్పత్తి యీ జన్మమునం గాని తరువాతి జన్మమునం గాని కల్గునని పాక్షికత్వనిరూపణము. | 51 | 16 | 509 |
| సాలోక్యము మొదలగు ముక్తులు జన్యములగుటచే వానికి సాతిశయత్వమును నిర్గుణముక్తికి నిరతిశయత్వమును నిరూపించుట. | 52 | 17 | 514 |

# ఆంధ్రసూత్రభాష్యము

అధ్యాయము 3. పాదము ౧.

---

## తదంతరప్రతిపత్త్యధికరణము. ౧

సూ. తదంతరప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యాం. ౧

ప. తదంతరప్రతిపత్తౌ - రంహతి - సంపరిష్వక్తః - ప్రశ్ననిరూపణాభ్యాం.

అ. జీవుఁడు దేహాంతరముం బొందుటయందు(=పొందుటకొఱకు) భూతసూక్ష్మములతోఁ గూడియే యీ లోకమునుండి పోవుచున్నాఁడని (పంచాగ్నివిద్యయందలి) ప్రశ్నోత్తరముల వలనఁదెలియంబడుచున్నదికాఁబట్టి వానితోఁగూడియేపోవును.

భా. రెండవయధ్యాయమున వేదాంతవిహిత మగు బ్రహ్మదర్శనము (=వేదాంతార్థము) నందు స్మృతిన్యాయవిరోధము పరిహరింపంబడియె. పర (=సాంఖ్యాది) పక్షము లపేక్షింపంబడఁదగ వనునదియుఁ జెప్పంబడె. శ్రుతులకుఁ బరస్పర విరోధమును నిరసింపంబడె. మఱియు నందు జీవుని కంటె భిన్నములును జీవునికి భోగసాధనములు నగు తత్త్వ

ములు (=ప్రాణేంద్రియాదులు) బ్రహ్మవలనం బుట్టుచున్న వనియుఁ జెప్పంబడె. పిమ్మట నిపు డుపకరణోపహితుఁ డగు (=ప్రాణేంద్రియాదులతోఁ గూడిన) జీవుని సంసారగతిప్రకారము నతని స్వప్నాద్యవస్థలు బ్రహ్మతత్త్వము (సర్వశాఖలయందును) విద్యలు (=ఉపాసనములు) భిన్నములా? యభిన్నములా? యను సంశయమును గుణోపసంహారానుపసంహారములును సమ్యగ్దర్శనమువలనఁ బురుషార్థసిద్ధియు సమ్యగ్దర్శన సాధనముల (యజ్ఞాదులయు, శమాదులయు) భేదమును ముక్తిరూప మగు ఫలమునకు (స్వర్గమునకు వలెఁ) దారతమ్యనియమము లేకపోవుటవలన నేకరూపత్వము ననునీ యర్థజాతము మూఁడవయధ్యాయమున నిరూపింపఁబడును. ప్రసంగమువలనఁ బ్రాప్తమైన యితరాంశము (=దేహాత్మవాదిదూషణము) నెకింత నిరూపింపఁబడును. అందు మొదటిపాదమునఁ బంచాగ్నివిద్య (=ద్యుపర్జన్యపృథివీపురుష యోషిత్తులం దగ్నిదృష్టిచే నుపాసనము) ననుసరించి యావిద్యాంతమున్నను "తస్మా జ్జుగుప్సేత"[1] యని వినంబడుటవలన వైరాగ్యము కొఱకు సంసార గతిప్రభేదము (=సంసారమునఁ

---

౧. ఛాం. ౫. ౧౦. ౮. తస్మాత్ = ఏకారణమువలనఁ గర్మముచే నీలోకమునుండి యూర్ధ్వలోకమునకు నా లోకమునుండి యీ లోకమునకును గమనాగమనరూప మగు ననర్థము సంభవించునో యా కారణమువలనను, జుగుప్సేత = (విద్వాంసుఁడు) కర్మఫలమునకు నేవగించునది.

బుణ్యాపాపముల గతి ప్రకారము) చూపంబడు చున్నది. "[1]అథైనమేతే ప్రాణా అభిసమాయంతి" యనునది మొదలు గాను "[2]అన్యన్నవతరం కల్యాణతరం రూపం కురుతే" యను నందాఁక గల సంసార ప్రకరణమునందున్న శబ్దమువలనను, ధర్మాధర్మ ఫలముల యుపభోగము సంభవించుట వలనను (జీవునకు దేహాంతరసంచారము లేదేని పుణ్యాపాపఫలముల కుపభోగము సంభవింపకపోవుట వలనను) జీవుఁ[3]డవిద్యాకర్మ పూర్వప్రజ్ఞాపరిగ్రహుఁడును ముఖ్యప్రాణసచివుఁడు నింద్రియములతోఁ గూడినవాఁడును సమనస్కుఁడునై పూర్వదేహమును విడిచి దేహాంతరమును బొందుచున్నాఁడను నిది తెలియంబడుచున్నది. ఆ దేహాంతరముఁ బొందుచున్న జీవుఁడు దేహమునకుం గారణము లగు భూతసూక్ష్మ

---

౧. బృ. ౬. ౪. ౧. (ప్రమత్తుఁ డగు నాత్ముఁ డెపు డబలభావము నొందినవాఁడుంబలె నుండి యింద్రియోపసంహారనిమిత్తమైన క్షోభము నొందినవాఁడు వోలె నుండునో) అథ = అపుడు, (మరణకాలమున నని యర్థము.) ఏతే ప్రాణాః = ఈ వాగాదులగు నింద్రియము లన్నియును, ఏనం = ఈ యాత్మనిని, అభిసమాయంతి = సమీపించుచున్నవి.

౨. బృ. ౬. ౪. ౪. (ఆ యాత్ముఁ డెల్లపుడు స్వీకరింపఁబడియున్న భూతములను గ్రహించి వానితోడను) నవతరం = మిక్కిలి క్రొత్తదియును, కల్యాణతరం = మిక్కిలి మనోహరము నగు, అన్యత్-రూపం = వేఱొక దేహమును, కురుతే = నిర్మించుకొనుచున్నాఁడు.

3. అవిద్యను ధర్మాధర్మములను జన్మాంతరసంస్కారమును బరిగ్రహించినవాఁడై యని యర్థము.

ములతో సంపరిష్వక్తుఁడై (= కూడిన వాఁడై) పోవు చున్నాఁడా? సంపరిష్వక్తుఁడు కాకయే పోవుచున్నాఁడా? యను నిది విచారింపఁబడు చున్నది. ఏమి ప్రాప్తమయ్యె ననిన భూతసూక్ష్మములతోఁ గూడనివాఁ డయియే పోవు చున్నాఁ డని ప్రాప్తమయ్యెను. దేనివలన ననిన నింద్రియముల యుపాదానము (=స్వీకారము) వలె భూతముల యుపాదానము వినంబడక పోవుట వలనను. "స ఏతా స్తేజో మాత్రా స్సమభ్యాదదాన" యను చోట వాక్య శేషమునఁ జక్షురాదుల సంకీర్తనము వలనఁ దేజోమాత్రా శబ్దముచేఁ గరణముల యుపాదానము కీర్తింపఁబడుచున్నది. ఇట్లు భూతమాత్రల స్వీకారము కీర్తింపఁబడ లేదు. మఱియు నవి యెల్లచోట్ల సులభములు. ఎట దేహ మారబ్ధవ్యమో యటనే కలవు. కాఁబట్టి వానిని దీసికొని పోవుట నిష్ప్రయోజనము. కనుక వానితో నసంపరిష్వక్తుఁడై పోవుచున్నాఁ డని ప్రాప్తింపఁగా నాచార్యుఁడు "తదంతర ప్రతిపత్తౌరంహాతి సంపరిష్వక్త" యని పఠించుచున్నాఁడు. (జీవుఁడు) తదంతర

---

౧. బృ. ౬. ౪. ౧. స = ఆ యాత్మఁడు, (ఉత్క్రమణకాలము నను) ఏతాః=మీఁదఁ జెప్పంబడిన, తేజోమాత్రాః=చక్షురాదులగు నింద్రియములను, సమభ్యాదదానః=(నిద్రాకాలమున వలెఁగాక) నిశ్శేషముగాఁ దన కభిముఖముగా నాకర్షించుకొనుచున్నవాఁడై (హృదయముం జేరు చున్నాఁడు.)

ప్రతిపత్తౌ = దేహాంతరముం బొందుటయందు - దేహమునకు బీజము లగు భూతసూక్ష్మములతోడను, సంపరిష్వక్తః కూడినవాఁ డయియే, రంహతి = పోవుచున్నాఁ డని తెలియవలెను. దేనివలనను ? ప్రశ్ననిరూపణాభ్యాం = ప్రశ్నోత్తరములవలనను; అది యెట్లన్నం బ్రతిపాదింపఁబడుచున్నది. "వేత్థయథా పంచమ్యా మాహుతావాపః పురుషవచసో భవంతి"[1] యని ప్రశ్నము. ద్యుపర్జన్య పృథివీ పురుషయోషిత్తు లను నైదగ్నులందు శ్రద్ధాసోమవృష్ట్య న్న రేతోరూపము లగు నాహుతులం జూపి (న తరువాతను) "ఇతి తు పంచమ్యా మాహుతావాపః పురుష వచసో భవంతి"

౧. ఛాం. ౫. 3. ౩. (మున్నొకపుడారుణికొడుకు శ్వేతకేతు వనువాఁడు పంచాలదేశప్రభువగు ప్రవాహణుని సభకుం బోఁగా రాజు వానిం జూచి నీకుఁ దండ్రి విద్య నేర్పెనా యని యడిగెను. అతఁడు నేర్పె నని చెప్పఁగా నైదుప్రశ్నములం గావించెను. అందిది యైదవది. ఓ శ్వేతకేతూ!) అపః = దేహమునకుం గారణము లగు భూతసూక్ష్మములు, పంచమ్యాం - ఆహుతౌ = ఐదవయాహుతి (స్త్రీరూప మగు నగ్నియందు) వ్రేల్వంబడినది యగుచు నుండఁగాను, యథా = ఏ ప్రకారముగాను, పురుషవచసః = పురుషశబ్దవాచ్యములు = పురుషాకారమునం బరిణమించునవి, భవంతి = అగుచున్నవో, వేత్థ? = ఎఱుఁగుదువా? యని యర్థము.

౨. ఛాం. ౫. ౯. ౧. (శ్వేతకేతువు వానిలో నొకదానికి నుత్తరము చెప్పలేక తండ్రియొద్దకుఁ బోయి యీవృత్తాంతమును జెప్పఁగా నతఁడును వాని యుత్తరముల నెఱుఁగఁజాలక రాజునొద్దకు వచ్చి నాకుమారు నడిగిన ప్రశ్నముల కుత్తరముం జెప్పుమని కోరెను. పిమ్మట రా జర్థక్రమము ననుసరించి పాఠక్రమ మనుచితము కాఁబట్టి మొట్టమొదట నైదవ ప్రశ్నమునకే యుత్తరముం జెప్ప నారంభించి, ఓయీ గౌతముఁడా! యీ లోకమున దధ్యాదిరూపము లగు నప్పు లగ్నియందు శ్రద్ధాపూర్వకముగా వ్రేల్వంబడి

యను నది నిరూపణము = ప్రతివచనమును; కాఁబట్టి జీవుఁడప్పు (= భూతసూక్ష్మము) లచేఁ బరివేష్టితుఁడై పోవుచున్నాఁడను నిది తెలియంబడుచున్నది. అయ్యా! "తద్యథా

---

వవిరై సూక్ష్మరూపమున యజమాను నాశ్రయించి యాతని ద్వారమున ద్యులోకమును బొందుచున్నవి. అట యజమానుని యింద్రియాధిష్ఠానదేవతలు వానిని ద్యులోకాగ్నియందు వ్రేల్తురు. అపుడవి సోమ నామము గల దేహరూపమునం బరిణమించును. మరల నా దేవతలు ఫలక్షయమువలనం గలిగిన సంతాపముచేఁ గరఁగిపోయిన యా జలమయదేహమును బర్జన్యాగ్నియందు వ్రేల్తురు. అపుడది వర్షమగును. ఇట్లు సోమభావమును వృష్టిభావముం బొందినవానిని (=అప్పులను=భూతసూక్ష్మములను) మరల నా దేవతలు భూమ్యగ్నియందు వ్రేల్తురు. అపుడవి వ్రీహియవాద్యన్నరూపమునం బరిణమించును. అట్లు పరిణమించిన వాని నా దేవతలు పురుషాగ్నియందు హోమము చేయుదురు. అపుడు రేతోరూపమునం బరిణమించును. అట్లు పరిణమించిన వానిని స్త్రీరూపమగు నగ్నియందు హోమము చేయుదురు.) ఇతితు = ఈ ప్రకారముగాను, పంచమ్యామ్-ఆహుతౌ = స్త్రీరూపమగు నగ్నియందు నైదవరేతోరూప మగు హోమద్రవ్యము వ్రేల్వంబడినది యగుచు నుండఁగాను, ఆపః=రేతోరూపముం బొందిన యప్పులు, (గర్భరూపమునొంది) పురుషవచసః=పురుషశబ్దవాచ్యములు, భవంతి=అగుచున్నవి.

౧. బృ. ౬. ౪. 3. తత్ - తత్ర = జీవుని దేహాంతరసంచారమున నిది యుదాహరణము. తృణజలాయుకా=తృణజలూకా=గడ్డిమీఁద సంచరించు పచ్చపురువు; యథా=ఏ ప్రకారమునను వేఱొక గడ్డిపోఁచ నవలంబించి యాతవఱకుఁ దా నవలంబించిన గడ్డిపోఁచను విడుచునో యట్లే జీవుఁడు వేఱొకదేహము నవలంబించి పూర్వదేహమును విడుచుచున్నాఁడని పూర్వపక్షి యర్థము. నేను దేవుఁడనునది మొదలగు భావనచే నీ లోకముననే కర్మాయత్తమగు భావిదేహము నవలంబించి పూర్వదేహమును విడుచుచున్నాఁడని సిద్ధాంతి యర్థము.

తృణజలాయుకా" యను వేఱొకశ్రుతి యెంతవఱకు వేఱొక దేహముం బొందఁడో యంతవఱకుం బూర్వదేహమును విడువఁ డని చెప్పుచున్నది యంటేని యటనైన ముదకపరివేష్టితుఁడే యైన జీవునకుఁ గర్మముచేఁ బ్రాపింపంబడినదియుఁ బ్రాప్తవ్య మగు దేహవిషయము నైన (=నేను జీవుఁడ నను నిది మొదలగు) భావనయొక్క దీర్ఘీభావమే= (దూరమున నున్నదాని నవలంభించుటయే) తృణజలాయుకతో నుపమింపంబడినది కాఁబట్టి విరోధము లేదు. శ్రుత్యుక్తమైన దేహాంతరప్రాప్తి ప్రకార మిట్లుండఁగా దేహాంతరప్రాప్తియందు వ్యాపు లగు కరణములకును విభువగునాత్మకు నటఁ గర్మవశమువలన వృత్తిలాభము గలుగు నని (సాంఖ్యులును) కేవల మాత్మనకే యటనల వృత్తిలాభము గలుగునని (సౌగతులును) మన మొక్కటియే భోగస్థానమునకుఁ బోవుచున్నది యింద్రియములును దేహమువలె నాయాయి భోగస్థానమునఁ బుట్టుచున్నవి యని (కాణాదులును) శుక యొక వృక్షమునుండి యెగిరి వేఱొకవృక్షముం బ్రవేశించినట్లు జీవుఁడే పూర్వదేహము నుండి యెగిరి వేఱొకదేహమునం బ్రవేశించుచున్నాఁ డని (జైనులును జెప్పునట్టి) పురుషబుద్ధిప్రభవము లైన కల్పన లన్నియు, ఘటాకాశమువలె నుపాధియుక్తుఁ డైన జీవుఁ డుపాధిపోవుటచే లోకాంతరమునకుం బోవుచున్నాఁ డని

పంచాగ్నివిద్యాశ్రుత్యుక్తప్రకారమునకు విరుద్ధము లగుట వలన నేకొలఁదియు నాదర్తవ్యములు కావు.

అవ. అయ్యా! మీఁద నుదాహరింపఁబడిన ప్రశ్నోత్తరములచే నప్ఛబ్దశ్రవణసామర్థ్యమువలనఁ గేవలము లగు నప్పులతోడనే సంపరిష్వక్తుఁడై జీవుఁడు పోవుచున్నాఁ డను నిది ప్రాప్తించుచున్నది గదా యట సామాన్యముగా నెల్ల భూతసూక్ష్మములతోడను బోవుచున్నాఁ డని ప్రతిజ్ఞ చేయఁబడినది యనిన నుత్తరముం బలికించుచున్నాఁడు.

సూ. త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్. ౨

ప. త్ర్యాత్మకత్వాత్-తు-భూయస్త్వాత్.

అ. త్రివృత్కరణశ్రుతివలన నప్పులు తక్కిన భూతములతోఁ గూడియున్నవి కాఁబట్టి వాని గ్రహించుటచేఁ దక్కినవియు గ్రహింపఁబడినవియే యగును. మఱియుఁ దక్కిన భూతములకంటె శరీరమున వానిబాహుళ్యము కలదు గావున నవి గ్రహింపఁబడెను. కాఁబట్టి మీఁదటి దోషము లేదు.

౨ భా. తు శబ్దముచే మీఁదటి యాశంకను వారించుచున్నాఁడు. త్ర్యాత్మకత్వాత్ = త్రివృత్కరణ శ్రుతివలన నప్పులు తేజోబన్నాత్మకము లగుటవలన నవి దేహారంభకములుగా నంగీకరింపఁబడినవి యగుచునుండఁగాఁ దక్కిన రెండు భూతములు నంగీకరింపఁబడఁ దగినవే యగును గాఁబట్టి, తు=

మీఁదటి దోషము లేదని యర్థము. మఱియును, త్ర్యాత్మక త్వాత్ =దేహమునందుఁ దేజోబన్న కార్యముల (=పాకస్వేద గంధముల) యుపలబ్ధివలన నది త్ర్యాత్మకమే కాఁబట్టి భూత త్రయారబ్ధమే. మఱియున్ను దేహము వాతపైత్యశ్లేష్మము లను మూఁడు ధాతువులతోఁ గూడినది కాఁబట్టి త్ర్యాత్మకము. అది తక్కిన భూతముల వినాగాఁ గేవలిమ్ము లగు నప్పులతో నారంభింపఁబడ శక్యము కాదు. కాఁబట్టి "ఆపః పురుషవచ సోభవంతి" యను ప్రశ్న ప్రతివచనములలోను, భూయ స్త్వాత్ =బాహుళ్యమువలన = బాహుళ్యము నపేక్షించినది యగుచు - నీయప్ఛబ్దము ప్రయోగింపఁబడినది గాని కైవ ల్యము నపేక్షించినదియై కాదు. దేహములన్నిటియందు రస లోహితాది ద్రవ ద్రవ్యబాహుళ్యము చూడఁబడు చున్నది. అయ్యా! దేహములందుఁ బృథ్వీభూయిష్ఠముగాఁ జూడఁ బడుచున్నది యనిన దానికంటె నితరమగు వాని నపేక్షించి యుదకములకు బాహుల్యము కావచ్చును గాన నిది దోషము గాదు. శుక్ర శోణితలక్షణ మగు దేహబీజమునందు ద్రవబాహుళ్యము చూడఁబడు చున్నదియును; మఱియును దేహారంభమునకుం గర్మము నిమిత్తకారణము. అగ్నిహో త్రాదికర్మములు సోమాజ్యపయః ప్రభృతు లగు ద్రవద్రవ్య ముల నాశ్రయించునవియును, గర్మసమవాయులును శ్రద్ధా

శబ్దమునం జెప్పఁబడుచున్నవియు నగు నప్పులు కర్మములు గావించువారితో ద్యులోక మను నగ్నియందు వేల్వంబడుచున్నవని శ్రుతి చెప్పంగలదు కాఁబట్టియు నుదకములకు బాహుళ్యప్రసిద్ధి గలదు. భూయస్త్వము (=బాహుళ్యము) వలన నప్ఛబ్దముచే దేహమునకు బీజము లగు నెల్ల భూతసూక్ష్మములయు నుపాదానమని నిరవద్యము.

సూ. ప్రాణగతేశ్చ. ౩

ప. ప్రాణగతేః - చ.

అ. ఉత్క్రాంతియందుఁ బ్రాణములకు జీవునితో గమనము శ్రుతిచే వినిపింపఁబడుచున్నది కాఁబట్టియు వానికాశ్రయము లగు భూతములు పోవుచున్న వని తెలియంబడుచున్నది.

భా. ప్రాణగతేశ్చ=దేహాంతరముం బొందుటయందు "౧తముత్క్రామంతం ప్రాణోనూత్క్రామతి ప్రాణ ముత్క్రామంతం సర్వేప్రాణా అనూత్క్రామంతి" యను నది మొద

---

౧. బృ. ఉ. ౪. ౨. (కర్మము నుపాసనము ననుసరించి శరీరావయవములలో దేనినుండి యైనను) ఉత్క్రామంతం = పరలోకమునకుం బోవఁ బయలువెడలుచున్న, తం=ఆ విజ్ఞానాత్మనిని, ప్రాణః=పంచవృత్తులు గల ప్రాణవాయువు, అనూత్క్రామతి = వెంబడించి పోవుచున్నది. అనూత్క్రామంతం - ప్రాణం=జీవుని వెనుకొని బయలువెడలుచున్న ప్రాణమును, సర్వేప్రాణాః=అన్నియింద్రియములును, అనూత్క్రామంతి = వెంటనంటి బయలువెడలుచున్నవి.

లగు శ్రుతులచే జీవునితోఁ బ్రాణములకు గమనము వినిపింపఁబడుచున్నది. అట్లు వినిపింపఁబడుచున్న ప్రాణముల గతి యాశ్రయముతో విన్నాగ సంభవింపదను నీ కారణమువలనఁ దదాశ్రయములును, భూతాంతరములతోఁ గూడినవియు నగు నప్పులకుఁ బ్రాణగతి ప్రయుక్తమైన గతి యర్థమువలనం దెలియంబడుచున్నది. జీవద్దేహమున నున్న ప్రాణములకుం గాన్పింపక పోవుటవలన నిరాశ్రయము లగు ప్రాణము లొక చోటికిం బోవవు; నిలువవును.

సూ. అగ్న్యాదిగతి శ్రుతే రితిచే న్న భాక్తత్వాత్. ౪

ప. అగ్న్యాది గతిశ్రుతేః-ఇతి-చేత్-న-భాక్తత్వాత్.

అ. ప్రాణము లగ్న్యాదిదేవతలం బొందు నను శ్రుతి వలన నవి జీవునితోఁ బోవుట యసిద్ధమనిన నా శ్రుతి గౌణి కాఁబట్టి య ట్లనరాదు.

భా. అగ్న్యాదిగతి శ్రుతేః=శ్రుతి "యత్రాస్యమృత

౧. బృ. గ. ౨. ౧౩. యత్ర=ఎపుడు, మృతస్య=మరణించిన, అస్య-పురుషస్య=ఈ శరీరవంతునియొక్క, వాక్ = వాగింద్రియము, అగ్నిం = తన యధిష్ఠానదేవతయగు నగ్నిని, అప్యేతి=ప్రవేశించుచున్నదో, ప్రాణః=ప్రాణవాయువు, వాతం=మహావాయువును, అప్యేతి=ప్రవేశించుచున్నదో, లోమాని=శిరమున నున్నవి గాక తక్కిన వెండ్రుకలు, ఓషధీః=లతలనును, కేశాః=శిరమున నున్న వెండ్రుకలు, వనస్పతీన్=వృక్షములను బ్రవేశించుచున్నవో మఱియుఁ దక్కిన యింద్రియములు నాయాయిచోట్లఁ బ్రవేశించునో యపుడు కర్తయగువాఁడు=జీవుఁడు దేని నాశ్రయించి యుండు నని యార్తభాగుఁడు యాజ్ఞవల్క్యు నడిగెను.

స్యాగ్నిం వాగప్యేతి వాతంప్రాణ” ఇత్యాదికముచే మరణకాలమున వాగాదిప్రాణము లగ్న్యాదిదేవతలం బొందుచున్న వని చూపుచున్నది యగుటవలన దేహాంతరప్రతిపత్తియందుఁ బ్రాణములు జీవునితోఁ బోవుటయు సిద్ధమును నీది కావచ్చును. ఇతిచేత్ =ఇట్లననేని; భాక్తత్వాత్ =వాగాదు లగ్న్యాదులం బొందుచున్న వను శ్రుతి, లోమములందుఁ గేశములందును (ఓషధి వనస్పతి గమనము) కాన్పింపమిం జేసి గౌణియగుట వలనను, న=అట్లనరాదు. “ఓషధీర్లోమాని వనస్పతీన్ కేశా” యని పఠియింపఁ బడుచున్నది. కాని లోమములుం గేశములు నెగిరి యోషధివనస్పతులం బ్రవేశించు నను నిది సంభవింపదు గదా! మఱియు జీవుని కుపాధిని వినాగా గమనము సంభవింపదు. ప్రాణములతో వినాగ నతనికి దేహాంతరమున నుపభోగమును సంభవింపదు. వేఱొకచో విస్పష్టముగ జీవునితోఁ బ్రాణములకు గమనము వినంబడుచున్నదియును. కాఁబట్టి వాగాదుల కుపకరించు వాగాద్యధిష్ఠాత్రు లగు నగ్న్యాది దేవతలకు మరణకాలమున నుపకారనివృత్తిమాత్రము నపేక్షించి వాగాదు లగ్న్యాదులం బొందుచున్న వని గౌణముగాఁ జెప్పఁబడుచున్నది గాని ప్రాణము లగ్న్యాదులందు ముఖ్యముగా లయించుచున్న వని కాదు.

సూ. ప్రథమే ఽశ్రవణా దితి చే న్న తా ఏవ హ్యుపపత్తేః.౫

ప. ప్రథమే-అశ్రవణాత్-ఇతి-చేత్ - న-తాః - ఏవ-హి - ఉపపత్తేః.

అ. ఐదగ్నులం దప్పు లాహుతు లయ్యేనేని పంచమాహుతియందవి పురుషశబ్దవాచ్యములు గావచ్చును గాని మొదటి యగ్నియం దప్పులు హోమద్రవ్యముగా వినంబడక పోవుటవలన నెట్లు పంచమాహుతియం దప్పులు పురుషశబ్దవాచ్యము లగు నని నిశ్చయింపఁబడవచ్చు ననిన నుపపత్తివలన నటను శ్రద్ధాశబ్దమున నవియే చెప్పంబడెఁ గాన దోషము లేదు.

భా. ప్రథమే-అశ్రవణాత్=మొదటియగ్నియం దప్పులకు శ్రవణము లేకపోవుట యను కారణమువలన నెట్లు పంచమాహుతియం దప్పులు పురుషశబ్దవాచ్యము లగుచున్నవను నిది నిశ్చయింపఁబడవచ్చును? ఇట ద్యులోకము మొదలగు నైదగ్నులు నైదాహుతుల కాధారములుగాఁ బఠింపఁబడినవి. వానిలో మొదటను "అసౌవావలోకో గౌతమాగ్ని" యని యుపన్యసించి "తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాశ్శ్రద్ధాం జుహ్వతి" యను శ్రుతిచే శ్రద్ధ హోమద్రవ్యముగాఁ జెప్పం

౧. ఛాం. ౫. ౪. ౧. ౨. గౌతమ! = ఓ గౌతముఁడా! అసౌలోకః=ఈద్యులోకము, అగ్నిర్వావ=అగ్నియే, దేవాః=ఇంద్రియాధిష్ఠానదేవతలు, తస్మిన్నేతస్మిన్నగ్నౌ=ఈద్యులోక మను నగ్నియందు, శ్రద్ధాం=భూతసూక్ష్మములను, జుహ్వతి=హోమము చేయుచున్నారు.

బడెను గాని యప్పులు హోమద్రవ్యముగా నట వినంబడ లేదు. తరువాతివి యగు పర్జన్యాదులయిన నాలు గగ్నుల యందును హోమద్రవ్యము లని చెప్పంబడిన సోమాదుల కబ్బాహుళ్యోపపత్తివలన వానియం దప్పులకు హోమద్రవ్యత్వము పరికల్పింపఁబడినం బరికల్పింపఁబడ వచ్చును. కాని ప్రథమాగ్నియందు శ్రుతమైన శ్రద్ధను విడిచి యశ్రుతములగు నప్పులం గల్పించు టను నిది సాహసము. శ్రద్ధ యను నది ప్రసిద్ధి సామర్థ్యమువలనఁ బ్రత్యయవిశేషము. కాఁబట్టి పంచమాహుతియం దప్పులకుఁ బురుషభావ మయుక్తము. ఇతిచేత్=ఇట్లం టేని, హి=ఎక్కారణమువలనం బ్రథమాగ్ని యందును, తాఏవ=ఆ యప్పు లే శ్రద్ధాశబ్దముచేఁ జెప్పఁబడు చున్నవో యా కారణమువలనను, న = ఇది దోషము గాదు. దేనివలన శ్రద్ధాశబ్దముచే నప్పులు చెప్పంబడె నం టేని, ఉపపత్తేః=ఇట్లయిననే (=శ్రద్ధాశబ్దముచే నప్పులు గ్రహింపబడిననే) ప్రశ్నోత్తరోపసంహారము లేకార్థము లగుటవలన నిర్నిరాకులమైన యేకవాక్య మగు నను నుపపత్తివలన నని చెప్పుదుము. మఱియొక లాగున నయ్యో నేని=పంచమాహుతి యం దప్పులకుఁ బురుషవచస్త్వప్రకార మడుగంబడినది యగుచు నుండఁగా నుత్తరమును జెప్పునపుడు ప్రథమాహుతి స్థానమునందు నప్పులకంటె వేఱొకటి యగు శ్రద్ధ యను

హోమద్రవ్యము నుపక్రమించెనేని దానివలనఁ బ్రశ్న మొక టియు నుత్తర మొక్కటియు నగుటచే నేకవాక్యత్వము లేకపోవ లెను. ఇతి తు పంచమ్యా మాహుతావాపః పురుషవచసో భవంతి" యని యుపసంహరించుచు శ్రద్ధాశబ్దమున కప్పర త్వమునే (=ఉదకమను నర్థమునే) చూపుచున్నది. మఱియు శ్రద్ధాకార్యమ (=శ్రద్ధాపరిణామ మ)గు సోమవృష్ట్యాదికము స్థూలీభవించుచు నబ్బహుళమై చూడంబడుచున్నది. అదియే శ్రద్ధ యప్పులని చెప్పు విషయమున యుక్తి (=ఉపపత్తి). కార్యము కారణమున కనురూపమైనది గదా యగుచున్నది. మఱియు శ్రద్ధయను ప్రత్యయము మనసునకుఁ గాని యాత్మ నకుఁగాని ధర్మమగుచు నది పశ్వాదులనుండి హృదయాదులు వలె ధర్మినుండి విభజించి హోమముకొఱకు స్వీకరింప నశ క్యము కాఁబట్టియు నప్పులే శ్రద్ధాశబ్ద (వాచ్య)ము లగును. "శ్రద్ధావా ఆప" యను వైదికప్రయోగము కాన్పించుట వలన శ్రద్ధాశబ్ద మప్పులం దుపపన్న మగుచున్నదియును; దేహబీజభూతము లగు నప్పులు తనుత్వ మను శ్రద్ధాసారూ ప్యముం బొందుచున్నవి కాఁబట్టి, సింహపరాక్రముఁ డగు నరుఁడు సింహశబ్దవాచ్యుఁ డై నట్లే శ్రద్ధాశబ్దవాచ్యము లగును. శ్రద్ధాపూర్వక మగు కర్మసంబంధమువలనను శ్రద్ధా శబ్దము, మంచశబ్దము పురుషులందు వలె నప్పులం దుపపన్న

మగుచున్నది. "అపోహాస్మై శ్రద్ధాం సన్నమంతే పుణ్యాయ కర్మణే" యను శ్రుతివలన నప్పులు శ్రద్ధకు హేతు వగుట వలన నైన నా శబ్దమునం జెప్పఁబడవచ్చును.

సూ. అశ్రుతత్వా దితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః. ౬

ప. అశ్రుతత్వాత్ - ఇతి - చేత్ - న - ఇష్టాదికారిణాం - ప్రతీతేః.

అ. భూతాంతరములతోఁ గూడిన యప్పులకుఁ బంచమాహుతియందుఁ బురుషాకారపరిణామము సంభవించినను వానితో జీవులు పోవుదు రని వినంబడక పోవుటవలన వారికి గమనము సంభవింపదనిన నిష్టాదికారులకు గమనము కలదని తెలియంబడుటవలన న ట్లనరాదు.

భా. ప్రశ్నోత్తరములవలనం దక్కిన భూతములతోఁ గూడిన యప్పులు శ్రద్ధాదిక్రమమునఁ బంచమాహుతియందుఁ బురుషాకారముం బొందవచ్చును గాని, అశ్రుతత్వాత్ = శ్రుతియందు వినంబడక పోవుటవలన నా యప్పులతో సహపరిష్వక్తులై జీవులు పోవరు. ఈ ప్రకరణమున నప్పులు పోవుచున్న వని వినిపించినట్లు జీవులు పోవుచున్నా

౧. అపోహా - ఉదకములే కదా, అస్మై - ఈయజమానునకని యర్థము. పుణ్యాయ కర్మణే = స్నానాది కార్యములకొఱకు, శ్రద్ధాం = ఆసక్తిని, సన్నమంతే = పుట్టించుచున్నవి.

రని వినిపించుశబ్ద మెద్దియు లేదు. కాఁబట్టి "రంహతి సంపరి ష్వక్తః" యను నిది (=అప్పులతోఁ గూడినవారై జీవులు పోవుచున్నా రను నిది) యుక్తము కాదు. ఇతిచేత్ = ఇట్లం టేని, ఇష్టాదికారిణాం = యాగాదులం జేసినవారికిఁ, ప్రతీతేః = గమనప్రతీతివలనను, న = ఇది దోషము కాదు. (శ్రుతి) "అథయ ఇమేగ్రామే ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తేధూమ మభిసంభవంతి" యని యారంభించి యజ్ఞాదులం జేసినవారికి ధూమాదిక మగు పితృయాణమార్గముచేతను "ఆకాశాచ్చంద్రమస మేషసోమోరాజా" యని చంద్ర లోకప్రాప్తిం జెప్పుచున్నది. ఆయిష్టాదికారులే యీపంచాగ్ని

---

౧. ఛాం. ౫. ౧౦. 3. అథ = మరణించిన ప్రజ లీలోకమునుండి యెచటికిఁ బోవుచున్నా రను ప్రశ్నమునకు దేవయానోపదేశమున నుత్తర ముం జెప్పిన తరువాతను పితృలోక ప్రకారమున నుత్తరము చెప్పంబడు చున్నది. యఇమే = ఏ యీ గృహస్థులు, గ్రామే = గ్రామమున (నివ సించుచున్నవారై) ఇష్టాపూర్తే = అగ్నిహోత్రాదివైదికకర్మమును, వాపీ కూప తటాకాదికమును, దత్తం = యథాశక్తిగా నర్హులగువారికి ద్రవ్య దానమును, ఇతి = ఇట్టివే యగు గురుసేవ మొదలగువానిని, ఉపాసతే = ఆసక్తితోఁ జేయుచున్నారో, తే = వారు, ధూమం = ధూమాభిమాని దేవతను, అభిసంభవంతి = పొందుచున్నారు.

౨. ఛాం. ౫. ౧౦. ౪. (వారు క్రమముగా నాకాశాభిమాని దేవ తను బొంది) ఆకాశాత్ = ఆకాశాభిమాని దేవతనుండి, చంద్రమసం = చంద్రునిం బొందుచున్నారు. చంద్రదేహు లగుచున్నా రని యర్థము. వారు పొందు చంద్రుఁ డెవ్వఁ డంటేని, ఏషః = ఈ యాకాశమునఁ జూడం బడుచున్న, రాజా సోమః = బ్రాహ్మణులకు రాజైన సోముఁడే.

విద్యావాక్యమునందును "తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా శ్రద్ధాం జుహ్వతి, తస్యా ఆహుతే స్సోమో రాజా సంభవతి" యను శ్రుతిసామ్యమువలనఁ బ్రతీతు లగుచున్నారు. సోమ రాజ శబ్ద సామాన్యమువలన యాగాదికారు లగు జీవులే శ్రద్ధాశబ్దమునం జెప్పంబడిన యప్పులచేఁ బరివేష్టితులై ద్యులోకమునకుఁ బోవుచున్నారని శ్రద్ధాహుతి వాక్యమునం దోఁచుచున్నది యని యర్థము. వారికి, నగ్నిహోత్రము, దర్శపూర్ణమాసములు మొదలగు కర్మములకు సాధనభూతము లగు దధ్యాజ్యపయః ప్రభృతులు ద్రవద్రవ్య బాహుళ్యము కలవి యగుటవలనఁ బ్రత్యక్షముగానే యప్పులు సంభవించు చున్నవి. అవి యాహవనీయమున హుతములై సూక్ష్మాహుతులయి యపూర్వరూపము లగుచు నిష్టాదికారుల నాశ్రయించుచున్నవి. వారి శరీరము నిధన నిమిత్త మగు విధానమున నంత్యాగ్నియందు ఋత్విజులు "అసౌ స్వర్గాయ లోకా

---

౧. ఛాం. ౫. ౪. ౨. తస్యాః - ఆహుతేః = ద్యులోక మను నగ్నియందు హుతము లగు శ్రద్ధాశబ్దవాచ్యము లగు నప్పులవలన, సోమో రాజా - సంభవతి = సోమరాజు సంభవించుచున్నాఁడు. ద్యులోకాగ్నియందు హుతము లగు నప్పులు సోమరూపమునం బరిణమించుచున్న వని యర్థము.

౨. అసౌ = ఈ యజమానుఁడు, స్వర్గాయ - లోకాయ = స్వర్గలోకముకొఱకుం బోవుఁగాక యని యర్థము. స్వాహా యనునది మంత్రసమాప్తిం దెలుపును.

య స్వాహా" యని 'జుహ్వతి' = హోమము చేయుచున్నారు. పిమ్మట నా శ్రద్ధాపూర్వకకర్మసంబంధము గల యాహుతిమయము లగు నప్పు లపూర్వరూపము లగుచు నా యిష్టాదికారు లగు జీవులం బరివేష్టించి ఫలదానము కొఱకై ద్యులోకమునకుఁ దీసికొని పోవుచున్న వని "శ్రద్ధాం జుహ్వతి" యనుదానియందలి 'జుహోతి'చేఁ జెప్పంబడుచున్నది. అట్లే యగ్నిహోత్రప్రకరణమున (జనకుఁడు యాజ్ఞవల్క్యు నడిగిన) షట్ప్రశ్నముల నిర్వచించునట్టి "తే వా ఏతే ఆహుతీ హుతే ఉత్క్రామత" యనునది మొదలగు వాక్యశేషముచే నగ్నిహోత్రాహుతులకు ఫలారంభముకొఱకు లోకాంతరప్రాప్తి చూపంబడుచున్నది. కాఁబట్టి యాహుతిమయము లగు నప్పులతో జీవులు సంపరిష్వక్తులై తమ కర్మఫలోపభోగార్థము పోవుచున్నా రను నిది యుక్త మగును. (ఉత్తర

---

౧. సాయంకాలమునను ప్రాతఃకాలమునను నగ్నియందు వ్రేల్వంబడిన యాహుతులయొక్క యుత్క్రమణము, గతి, ప్రతిష్ఠ, తృప్తి, పునరావృత్తి, లోకము నను నీ యాఱిటిని నీ వెఱుఁగుదువా యని జనకుఁడు యాజ్ఞవల్క్యు నడిగె, తే - ఏతే - వై - ఆహుతీ = ఈ యా సాయంప్రాతరాహుతులు రెండును, హుతే = వేల్వంబడినవియై, ఉత్క్రామతః = మీఁదికిం బోవుచున్నవి. అవి యంతరిక్షమునకుం బోయి ద్యులోకమున నిల్చుచున్నవి. అవి దివిని దృప్తిపఱచి మరల వచ్చుచున్నవి. తరువాత నవి భూమియందును బురుషునందును స్త్రీయందును గ్రమము గాహుతులై పురుషరూపమున నిలుచుచున్నవి యని వాక్యశేషమున జనకుఁడే నిర్వచించెను.

సూత్రమున వారింపం దగినదానిని శంకించుచున్నాఁడు.) "ఏష సోమో రాజా తద్దేవానా మన్నం తం దేవా భక్షయంతి" యనుశ్రుతియును దీనికి సమానార్థము గల "తే చంద్రం ప్రాప్యాన్నం భవంతీతి తాం స్తత్ర దేవా యథా సోమం రాజాన మాప్యాయ స్వాపక్షీయ స్వేత్యేవ మేతాం స్తత్ర భక్షయంతి" యను శ్రుతియు నెక్కారణమువలన ధూమాద్యవ

---

౧. ఛాం. ౫. ౧౦. ౪. ఏవ సోమో రాజా = చంద్రమండలమునకుఁ బోయినవారు పొందునట్టివాఁడు బ్రాహ్మణులకు రాజైన యీ కాన్పించు చంద్రుఁడే. తత్ = ఆ చంద్రశరీరము, దేవానాం = ఇంద్రాదులకున్, అన్నం = అన్నము. దేవాః = ఇంద్రాదులు, తం = ఆ చంద్రుఁ డగు నన్నమును, భక్షయంతి = భక్షించుచున్నారు. కాఁబట్టి ధూమాదిమార్గమునం బోయి చంద్రభూతు లగు కర్ములు దేవతలచే భక్షింపఁబడుచున్నారు. అనఁగా దేవతలు స్త్రీ పశు భృత్యాదులను వలెఁ గర్ములను భోగోపకరణములుగాఁ జేసికొనుచున్నా రని సిద్ధాంతార్థము.

౨. బృ. ౬. ౨. ౧౬. తే = ఆ కర్ములు, చంద్రం = చంద్రునిని, ప్రాప్య = పొంది, తత్ర = ఆ లోకమునను, అన్నం - భవంతి - ఇతి = దేవతల కన్నమగుచున్నారు కాఁబట్టి, దేవాః = ఇంద్రాదులు, తత్ర = ఆ దేవలోకమునను, తాన్ = అన్నభూతు లగు నా కర్ములను (ఋత్విజులీ లోకములోని యజ్ఞమునను) యథా = ఏ ప్రకారముగాను, సోమం - రాజానం = చమసములో నున్న సోమరసమును, ఆప్యాయస్వా పక్షీయస్వ - ఇతి - చ = మరల మరలఁ బూరించి మరల మరల భక్షణముచే క్షయింపఁ జేసి, భక్షయంతి = భక్షించుచున్నారో, ఏవం = అట్లే, ఏతాన్ = చంద్రమండలముం బొందిన కర్ములను (స్వామి పశు భృత్యాదులను వలె) మరల మరల విక్రమింపం జేయుచుఁ గర్మానురూప మగు ఫలము నిచ్చుచు, భక్షయంతి = భక్షించుచున్నారు. భోగోపకరణములుగాఁ జేసికొనుచున్నా రని సిద్ధాంతార్థము.

యవములు గల మార్గమునం జంద్రలోకము నధిరోహించిన వారి కన్నభావముం జూపుచున్నవియో యా కారణమువలన నె ట్లిష్టాదికారులకు స్వకర్మఫలోపభోగార్థము గమనము ప్రతిజ్ఞ చేయంబడుచున్నది? వ్యాఘ్రాదులచేతనువలె దేవతలచే భక్షింపఁబడుచున్న వారి కుపభోగము సంభవింపదు గదా యనిన నుత్తరముం జెప్పుచున్నాఁడు..

సూ. భాక్తంవా ఽనాత్మవిత్త్వా త్తథాహి దర్శయతి. ౭

ప. భాక్తం - వా - అనాత్మవిత్త్వాత్ - తథా - హి - దర్శయతి.

అ. "స్వర్గకామో యజేత" యను శ్రుతికి బాధ ప్రసంగమువలన యాగాదులం గావించువారికన్న భావము భాక్త (=గౌణ)ముగాని ముఖ్యముగాదు. కాఁబట్టి మీఁదటి దోషము లేదు. కర్ములాత్మజ్ఞానము కలవారు కారు కాఁబట్టి భృత్యాదులువోలె దేవతల కుపభోగ్య లగుదురు. అనాత్మవిదులు దేవతల కుపభోగ్యులని శ్రుతి చెప్పుచున్నది.

భా. వాశబ్దము చోదిత (మీఁదఁ జెప్పఁబడిన) దోష నిరాసార్థము. యాగాదులం గావించి చంద్రలోకమ్ము నధిరోహించిన వారికన్న భావము. భాక్తం=గౌణముగాని ముఖ్యముగాదు. అన్నత్వము ముఖ్యమే యయ్యేనేని "స్వర్గకామో యజేత" యనునది మొదలగు నధికారశ్రుతి పీడింపబడు

చున్నది. (అధికారము = ఫలకామన) చంద్రమండలమున నిష్టాదికారుల కుపభోగము లేదని యధికారు లా (ఫలముం గోరువార లా)యాసబహుళమగు నిష్టాదికర్మముల నేల చేయుదురు? "విశోఽన్నం రాజ్ఞాం పశవోఽన్నం విశా మ్మనియ న్నశబ్ద ముపభోగహేతుత్వసామ్యమువలన నన్నము కాని దానియందును గౌణముగాఁ జూడంబడు చున్నదియును. కాఁబట్టి ప్రియు లగు స్త్రీపుత్రమిత్రభృత్యాదులతోఁడ వలె గుణభావము నొందిన యిష్టాదికారులతో దేవతలకే సుఖవిహారణము కలదో యదియే భక్షణ మని చెప్పంబడినది గాని మోదకములను వలె వారిని నమలుట గాని మ్రింగుట గాని కాదు. "నవై దేవా అశ్నంతి పిబం త్యేతదేవామృతం దృష్ట్వా తృప్యంతి" యని (శ్రుతి) దేవతలకుఁ జర్వణాది వ్యాపారమును వారించు చున్నదియును. దేవతలకు గుణభావము నొందిన యీ యిష్టాదికారులకును రాజు ననుసరించిన పరిజనులకు వలె నుపభోగ ముపపన్న మగుచున్నదియును. అనాత్మవిత్త్వాత్ ఇష్టాదికారు లాత్మజ్ఞానము కలవారు కాకపోవుటవలనను

౧. విశః = ప్రజలు, రాజ్ఞాం = రాజులకు, అన్నం = భోగసాధనము. విశాం = మనుష్యులకు, పశవః = గోవు మొదలగు జంతువులు, అన్నం = భోగోపకరణము.

౨. ఛాం. 3. ౬. ౧. దేవాః = దివ్యులు, నాశ్నంతి = భుజింపరు; నపిబంతి = త్రాగరు. ఏతదమృతం = ఈ యమృతమును, దృష్ట్వైవ = చూచియే, తృప్యంతి = సంతసించుచున్నారు.

దేవతల కుపభోగ్యభావ ముపపన్నము. తథాహి—అశ్లే[1] "అథ యో௨న్యాం దేవతా ముపాస్తే௨న్యో௨సావన్యో௨హ మస్మీతి న స వేద యథా పశురేవం స దేవానా" మని శ్రుతి యనాత్మజ్ఞులకు దేవతోపభోగ్యభావమును దర్శయతి—చూపుచున్నది. వాఁడీ లోకమున నిష్టాది కర్మములచే దేవతలకుం బ్రియము చేయుచుఁ బశువువలె వారి కుపకరించుచున్నాఁడు. పరలోకమునను వారి ననుసరించి జీవించువాఁడై వారిచే నాదిష్టమగు ఫలము ననుభవించుచుఁ బశువువలెనే దేవతల కుపకరించుచున్నాఁ డని తోఁచుచున్నది. "అనాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి" యను దానికి వేఱువిధ మగు వ్యాఖ్యానము చేయంబడుచున్నది. ఈ యిష్టాదికారు లాత్మవిదులు (పంచాగ్నివిద్య నెఱింగినవారు) కారు కాఁబట్టి కేవలకర్ములు గాని జ్ఞానకర్మసముచ్చయానుష్ఠానముం జేయువారు కారు. ఇటు

౧. బృ. ౩. ౪. ౧౦. జ్ఞానులకుఁ గృతార్థతం జూపి యజ్ఞులకు ననర్థముం జూపుచున్నాఁడు. అథ = పిమ్మటను, యః = బ్రహ్మవిదుఁడు కానివాఁ డెవఁడైన నొకఁడు, అహం = నేను, అన్యః = వేఱొకఁడను, అస్మి = అగుదును. అసౌ = నే నుపాసించు దేవుఁడు, అన్యః = వేఱొకఁ డగువని, అన్యాం - దేవతాం = ఆత్మకంటె వేఱగు దేవతను, ఉపాస్తే = ఇజ్యాబల్యుపహారాదులచే సేవించుచున్నాఁడో (గంధపుష్పాదులచేఁ జేయు పూజ = ఇజ్య. నివేద్యసమర్పణము = బల్యుపహారము.) సః = వాఁడు, న వేద = తత్త్వము నెఱుంగఁడు. పశుః = గవాదికము, యథా = ఎట్లు లోకులకు వాహనదోహనాదులచే నుపకరించునో, ఏవం = అట్లే, సః = ఆ కర్మాధికృతుఁడు, దేవానాం = దేవతల కుపకరించును.

బంచాగ్నివిద్య నాత్మవిద్య యని ప్రకరణమువలన గౌణ ముగాఁ జెప్పుచున్నారు. పంచాగ్నివిద్యాహీనులగుట వలన నిష్టాదికారులకు దేవోపభోగ్యత్వముచే నీ యన్న భావము పంచాగ్నివిద్యా ప్రశంసకొఱకు చెప్పంబడు చున్నది. గౌతమప్రవాహణసంవాదరూప మగు వాక్యమున కుం బౌర్వాపర్యమ్ము నాలోచింపఁగాఁ బంచాగ్నివిద్యావిధాన మునం దాత్పర్యము కాన్పించుటవలన నిటఁ బంచాగ్నివిద్య విధింపఁగోరఁబడుచున్నది గదా! తథాహి=అట్లే వేఱొక శ్రుతి యును "స సోమలోకే విభూతి మనుభూయ పునరావర్తతే" యని, దర్శయతి = చంద్రమండలమున భోగసముద్భావముం జూపుచున్నది. అట్లే వేఱొక ప్రకరణమునను "అథ యేశతం

---

౧. ప్ర. ౫. ౪. సః = ద్వితీయ మాత్రారూప మగు నోంకార ముమ ధ్యానించినవాఁడు, సోమలోకే = చంద్రలోకమునను, విభూతిం = ఐశ్వర్యమును, అనుభూయ = అనుభవించి (పుణ్యావసానమునను) పునరా వర్తతే = మరల నీ లోకమునకు వచ్చుచున్నాఁడు.

౨. బృ ౬. 3. 33. జితలోకానాం = శ్రాద్ధాదికర్మములచేఁ బితృ దేవతలను దృప్తిపఱిచి యా లోకమును సంపాదించిన, పితౄణాం = పితృ దేవతలయొక్క, యే - శతం - ఆనందాః = ఏ నూఱానందములు గలవో, అవి గంధర్వలోకమున నొక యానందము. (మనుష్యలోకమునందలి యానం దముకంటెఁ బితృలోకమునందలి యానందము శతగుణము; నట్లే పితృ లోకమునందలి యానందముకంటె నూఱురెట్లధికమగు నానందము గంధర్వ లోకమునం గలదని యర్థము.) అట్టి గంధర్వానందములు నూఱు, కర్మణా = అగ్నిహోత్రాది శ్రౌతకర్మముచేతను, దేవత్వం = దేవభావమును, యే = ఎవ్వరు, అభిసంపద్యంతే = పొందుచున్నారో, కర్మదేవానాం = అధి

పితౄణాం జితలోకానామానందా స్స ఏకః కర్మదేవా నా మానందః యే కర్మణా దేవత్వమభి సంపద్యంతే" యను వేఱొక శ్రుతియు నిష్టాదికారులకు దేవతలతోఁ గూడ వసించువారికి భోగప్రాప్తిం జూపుచున్నది. ఇట్టి నిష్టాదికారుల కన్న భావవచనము భాక్త మగుటవలననట్టి యిష్టాదికారు లగు జీవులు పోవుచున్నా రని ప్రశ్న ప్రతివచనములందుఁ దెలియంబడుచున్నది. కాఁబట్టి "రంహాతి సంపరిష్వక్త" యను నిది యుక్తముగానే చెప్పంబడినది.

ఇది ప్రథమాధికరణము.

## కృతాత్యయాధికరణము. ౨

సూ. కృతాత్యయేనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేత మనేవంచ. ౮

ప. కృతాత్యయే - అనుశయవాన్ - దృష్టస్మృతిభ్యాం - యథేతం - అనేవంచ.

అ. జీవులు పరలోకమున ఫల మిచ్చు కర్మనము దాయ మనుభవింపఁబడినది యగుచునుండఁగా నైహికఫల మగు కర్మముతోఁ గూడినవారై యీ లోకమునకు వచ్చు

కర్మదేవతలయొక్క, ఏకః - ఆనందః = ఒక యానందము, గంధర్వలోక ము నందలి యానందముకంటె శతగుణమైన యానందము కర్మదేవతలకుఁ గలదని యర్థము.

చున్నారని శ్రుతిస్మృతులచేఁ దెలియంబడుచున్నది. వచ్చునపుడు పూర్వము పోయిన మార్గమునను దానికి విపరీతమగు మార్గముననుఁ వత్తురు.

భా. ధూమాదిమార్గమునఁ జంద్రమండలము నధిరోహించినవారును భుక్తభోగులు నగు నిష్టాదికారులకు నటనుండి ప్రత్యవరోహము, "తస్మిన్యావత్సంపాత ముషిత్వా ఽథైతమేవాధ్వానం పునర్నివర్తంతే యథేత" మనునది మొదలుగాను "రమణీయచరణా బ్రాహ్మణాది యోని మాపద్యంతే కపూయచరణాశ్శ్వాది యోని" మనునంతవఱకు (గల వాక్యమున)ఁ జెప్పంబడుచున్నది. అట (అవరోహించు జీవులందు) భుజింపంబడిన యెల్లకర్మములు గలవారగుచు నిరనుశయులై యవరోహించుచున్నారా? లేక సానుశయులై యవరోహించుచున్నారా? యనునది విచారింపఁబడుచున్నది. ఏమి ప్రాప్తించెనంటేని నిరనుశయులై యవరోహించుచున్నా రనునది

---

౧. ఛాం. ౫. ౧౦. ౫. (జీవులు) తస్మిన్ = ఆ చంద్రమండలమునందున్, యావత్సంపాతం = భోగహేతు వగు కర్మము క్షయించునంతవఱకును, ఉషిత్వా = సూక్ష్మభూతములచే నారంభింపఁబడిన శరీరముతో భోగముల ననుభవించుచుండి, అథ = పిమ్మటను, యథేతం = వెళ్లినట్లే, ఏతమేవ - అధ్వానం = చెప్పంబోవు మార్గమును, మార్గముననే యని యర్థము. పునర్నివర్తంతే = మరల వచ్చుచున్నారు. మరల వచ్చుచున్నారనుటచే ము న్ననేకపర్యాయములు చంద్రలోకమునకుఁబోయి తిరిగి వచ్చిరని తోఁచుచున్నది.

ప్రాప్తించును. దేనివలన నంటేని "యావత్సంపాత" మను విశేషణమువలన నని చెప్పుచున్నారము. "సంపతంత్యనేనాస్మాల్లోకా దముల్లోకం ఫలోపభోగాయ" యను (=దీనిచే నీలోకమునుండి ఫలోపభోగము కొఱకుం బరలోకమునకు జీవులు పోవుచున్నారను) వ్యుత్పత్తిచే సంపాతశబ్దమున నిటఁ గర్మాశయము చెప్పంబడుచున్నది. "యావత్సంపాత ముషిత్వా" యను శ్రుతిచేఁ జెప్పంబడిన యెల్లకర్మమునకు నటనే భుక్తత్వముం జూపుచున్నది. "తేషాం యదా తత్పర్యవైతి"[1] యను వేఱొక శ్రుతిచేతను నీ యర్థమే చూపంబడుచున్నది. పరలోకమున నుపభోగింపం దగిన కర్మ మెంత కలదో దానినంత నుపభోగించునని కల్పింతునంటేని "ప్రాప్యాంతం కర్మణస్తస్య యత్కించేహ

౧. బృ. ౬. ౨. ౧౬. తేషాం=ఆ కర్ములకుఁ, యదా = ఎప్పుడు, తత్ = చంద్రలోకప్రాపక మగు యజ్ఞదానాది కర్మము, పర్యవైతి = క్షయించుచున్నదో (అథ = అపు డాకాశముం బొందుచున్నారు.)

౨. బృ. ౪. ౪. ౬. అయం = ఈ నరుఁడు, ఇహ = ఈ లోకమునను, యత్కించ = ఏ కొంచెది కర్మము నైనను, కరోతి = చేయుచున్నాఁడో, తస్యకర్మణః = ఆ కర్మముయొక్క (ఫలముం బరలోకమున ననుభవించి) అంతం - ప్రాప్య = అవసానము నొంది, అస్మాల్లోకాత్ = ఫలము ననుభవించిన లోకము నుండి, పునః = మరలను, కర్మణే = కర్మానుష్ఠానమునకై, అస్మైలోకాయ = ఈ లోకమున కని యర్థము, ఏతి = వచ్చుచున్నాఁడు. నరుఁ డీలోకమున సత్కర్మములఁ గావించి పరలోకమున వాని ఫలము ననుభవించి వాని యంతముం జూచి మరల సత్కర్మముల నాచరింప నీ లోకమునకు వచ్చుచున్నాఁ డని యర్థము.

కరోత్యయం తస్మాల్లోకా త్పునరేత్యస్మై లోకాయ కర్మణే" యనువేఱొకచోటను "యత్కించ" యను పరామర్శమువలన నిట్లు కల్పింపరాదని చెప్పుదుము. ఇట్టి పరామర్శ శ్రుతి "యత్కించ" యను నవిశేషపరామర్శముచే నిటఁ జేయంబడిన యెల్ల కర్మమునకు నటనే క్షపితత్వమును (=భోగముచే నాశమును) జూపుచున్నదిః మఱియుఁ బ్రాయణముకంటెం బూర్వము ప్రారబ్ధఫల మగు కర్మముచేఁ బ్రతిబద్ధమైన ద్దాని కభివ్యక్తి యుపపన్నము కాకపోవుటవలనఁ బ్రాయణ మనారబ్ధఫలమైన కర్మమున కభివ్యంజకము. ఆ ప్రాయణ మవిశేషమున ననారబ్ధఫల మగు కర్మ మెద్ది కలదో దానికంతకు నభివ్యంజక మగును. సాధారణమగు నిమిత్తముచే నైమిత్తిక మసాధారణము కాఁగూడదు. ప్రదీపసన్నిధి యవిశిష్టమగుచు నుండఁగా ఘట మభివ్యక్త మగుచున్నది గాని పట మట్లు కాదనునిది యుపపన్నము కాదుగదా! కాఁబట్టి (జీవులు) నిరనుశయులై (=కర్మము లేనివారై) యవరోహించుచున్నారని ప్రాప్తింపఁగాను "కృతాత్యయేఽనుశయవా" నని చెప్పుచున్నారము. చంద్రమండలము నుపభోగార్థమై యే కర్మబృందముచే నధిరోహించిరో యా కర్మబృంద ముపభోగమున నశింపఁజేయఁబడఁగాఁ జంద్రమండలమున నుపభోగముకొఱకు కారంభింపబడినవారి యమ్మయశరీర మా యుపభోగక్షయదర్శనముచేఁ

గలిగిన శోకాగ్నివలన సూర్యకిరణసంపర్కమువలన హిమకరకములువలె నగ్నిజ్వాలాసంపర్కమువలన ఘృతకాఠిన్యమువలెను కరఁగిపోవును. పిమ్మటను-కృతాత్యయే=చేయఁబడిన యిష్టాదికర్మమిన కుశభోగమున నాశము గలుగుచుండఁగాను, అనుశయవాన్ = (=అనుశయవంతః) సానుశయు లయియే యీ లోకముం బ్రవేశించుచున్నారు. వీహేతువుచేత నంతేని "దృష్టస్మృతిభ్యాం" మని (=శ్రుతిస్మృతులచేతఁనని) చెప్పుచున్నాఁడు. శ్రుతిస్మృతు లెవ్వి యనం బ్రతిపాదింపఁబడుచున్నవి. "తద్యఇహ రమణీయచరణా అభ్యాశోహయత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనింవా

౧. ఛాం. ౫. ౧౦. ౭. తత్ = అనుశయవంతులలోను (పరలోకఫల మగు కర్మ మనుభవింపఁబడినది యగుచు నుండఁగా నవశిష్టమైన యైహికఫల మగు కర్మజాత మనుశయము.) యే = ఎవరు, ఇహ - రమణీయచరణాః = ఈ లోకమున మంచిస్వభావముచే సూచింపఁబడిన పుణ్యకర్మము గలవారో, తే = వారు, రమణీయాం - యోనిం = క్రౌర్యాది దోషవర్జిత మగు యోనిని, బ్రాహ్మణయోనిం క్షత్రియయోనిం వైశ్యయోనింవా = బ్రాహ్మణయోనిని గాని, క్షత్రియయోనిని గాని, వైశ్యయోనిని గాని (రేతస్సిగ్యోగముకంటెం దరువాతను) ఆపద్యేరన్నితియత్ = పొందుదు రనునది, అభ్యాశోహ = శీఘ్రముగానే యగును. అథ = తరువాతను, యే = ఎవరు, ఇహ - కపూయచరణాః = ఈ లోకములో దుశ్శీలముచే నుపలక్షితమైన దుష్కర్మము కలవారో, తే = వారు, కపూయాం - యోని = జుగుప్సితమైన యోనిని, శ్వయోనిం - సూకరయోనిం - చండాలయోనింవా = శునకయోనిని గాని, సూకరయోనిని గాని, చండాలయోనిని గాని, (రేతస్సిగ్యోగముకంటెం దరువాతను) ఆపద్యేరన్నితియత్ = పొందుదు రనునది, అభ్యాశోహ = శీఘ్రముగానే యగును.

క్షత్రియయోనింవా వైశ్యయోనింవా, అథ య ఇహ కపూయచరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా” యనునిది దృష్టశబ్దమునం జెప్పంబడిన శ్రుతి. దీనియందుఁ జరణశబ్దముచే ననుశయము సూచింపఁబడుచున్నదని చెప్పఁగలఁడు. మఱియు జన్మముచేతనే (జన్మము మొదలుకొని) యెల్లప్రాణులందు నానావిధమగు నీ భోగము విభజింపంబడుచున్నదియై దృష్టమగుచు నభ్యుదయప్రత్యవాయములు సుకృతదుష్కృతజన్యములని సామాన్యముగా శాస్త్రము వలనం దెలియంబడుటచే నాకస్మికత్వా (=నిష్కారణత్వా) సంభవమువలన ననుశయసద్భావమును సూచించుచున్నది (యని దృష్టశబ్దమున కర్థాంతరము.) “వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫల మనుభూయ తతశ్శేషేణ విశిష్టదేశ కుల జాతి రూపాయు శ్శ్రుత వృత్త విత్త సుఖమేధసో

౧. ఆ. సూ. వర్ణాః = బ్రాహ్మణాది జాతులవారును, ఆశ్రమాః = బ్రహ్మచర్యాద్యాశ్రమములును, స్వకర్మనిష్ఠాః = తమతమ విహితమైన కర్మముల నాచరించినవారై, ప్రేత్య = మరణించి, (చంద్రలోకము నారోహించి) కర్మఫలం - అనుభూయ=కర్మఫలము ననుభవించి, తతః-శేషేణ= అనుభవింపఁబడినదానికంటె నితరమగు కర్మముచేతను, విశిష్టదేశ, కుల, జాతి, రూపాయు, శ్శ్రుత, వృత్త, విత్త, సుఖ, మేధసః=ప్రతినియతమైన (=వారి వారి కర్మమునకుం దగిన) దేశమును, వంశమును, జాతియు, నాకారము, నాయువు, జ్ఞానము, నాచారము, విత్తము, సుఖము, బుద్ధియుం గలవారై, జన్మ = జన్మమును, ప్రతిపద్యంతే = పొందుచున్నారు.

జన్మ ప్రతిపద్యంతే" యని స్మృతియు సానుశయులకే యవ రోహముం జూపుచున్నది. అనుశయము నా నెద్ది యనినఁ గొందఱు భాండానుసారి స్నేహముయొక్క వలె = ఎట్లు స్నేహభాండమది రిచ్యమాన మగుచు (=చమురుకుండ వంపఁ బడుచున్నది యగుచు) నెల్ల స్నేహముతో వేఱుచేయఁబడదో భాండానుసారి యైన యొకానొక స్నేహ శేషము నిలుచుచున్న దో యట్లే, స్వర్గార్థమై చేయంబడినదియు భుక్తఫలము నగు కర్మముయొక్క నిలిచియున్న యొకానొక శేష(లేశ)మనుశయ మని చెప్పుచున్నారు. అయ్యా! యదృష్టము (కర్మము) కార్య (= ఫలోదయ) విరోధి యగుటవలన భుక్తఫల మగు కర్మమున కవశేషావస్థానము (= మిగిలి యుండుట) న్యాయ్యము గా దనిన నెల్ల కర్మమునకు భుక్తఫలత్వముం బ్రతిజ్ఞ చేయము కాఁబట్టి యిది దోషము గాదు. అయ్యా! నిరవశేష ముగాఁ గర్మఫలము ననుభవింపఁ జంద్రమండలము నధిరో హించి రనిన సత్యమే; కాని స్వల్పకర్మము మిగిలినంత మాత్రమున నట నవస్థానము సంభవింపదు. ఎట్లొకానొక సేవకుఁ డెల్ల సేవోపకరణములతోఁ గూడినవాఁడై, రాజ కులము నుపసర్పించి చిరప్రవాసమువలనఁ బరిక్షీణము లగు బహూపకరణములు గలవాఁడై మిగిలిన ఛత్రముం బాదు కలు మొదలగు స్వల్పోపకరణములనే కలవాఁడై రాజకుల

మున నుండ శక్తుఁడు గాఁడో యట్లే యనుశయమాత్ర ప్రతిగ్రహుఁడై చంద్రమండలమున నుండంజాలఁ డనినఁ గార్యవిరోధి యగుటవలన భుక్తఫల మగు స్వర్గార్థమైన కర్మమున కనువృత్తి యుపపన్నము గాదని చెప్పంబడెఁ గాఁబట్టి యిది యుక్తమువలెఁ గాన్పింపదు. అయ్యా! స్వర్గఫలమగు కర్మమునకెల్ల భుక్తఫలత్వము సంభవింపదను నిదియుఁ జెప్పంబడె ననిన స్వర్గార్థమగు కర్మము స్వర్గమున నున్నవానికే నిఖలమగు ఫలముం బుట్టింపదు; స్వర్గమునుండి వచ్చినవానికిని గొంచెము ఫలలేశమును బుట్టించు నను నిది మిక్కిలి యపేశలము. శబ్దము ప్రమాణ మను వారి కిట్టి కల్పనము యుక్తముగాదు. స్నేహభాండమందు స్నేహలేశాను వృత్తి ప్రత్యక్ష మగుటవలన నుపపన్నము. అట్లే సేవకున కుపకరణలేశానువృత్తియుఁ జూడంబడుచున్నది. శాస్త్రీయ వ్యవహారమం దిట్లు స్వర్గఫలమగు కర్మమునకు లేశానువృత్తి చూడంబడదు. స్వర్గఫలశాస్త్రవిరోధమువలనఁ గల్పింపను శక్యము గాదు. మఱియును భాండానుసారి స్నేహైకదేశము వలె ననువర్తించుచున్న స్వర్గాదిఫల మగు నిష్టాదికర్మైకదేశ మనుశయము కాదను నిది యవశ్యము తెలియందగినది. ఏ సుకృత మగు నిష్టాదికర్మముచే స్వర్గఫలము ననుభవించిరో దానిదే యగు నేకదేశ మనుశయ మని కల్పింపఁబడెనేని

దానివలన రమణీయ మైన యనుశయ మొకటియే యుండఁ దగునుగాని విపరీత ముండఁగూడదు. అట్లగుచునుండఁగాను "తద్య ఇహ రమణీయచరణాః, అథయ ఇహాకపూయ చరణా" యను ననుశయ విభాగశ్రుతి పీడింపఁబడుచున్నది. కాఁబట్టి యాముష్మిక ఫలమగు కర్మసముదాయ మనుభవింపఁబడినది యగుచు నుండఁగా నవశిష్టమైన యైహికఫలమగు వేఱొక కర్మజాత మనుశయము. దానితోఁ గూడినవారై యవరోహించుచున్నా రనునిది యుక్తము. "యత్కించ" యను సామాన్యపరామర్శమువలన నీ లోకమునం జేయఁబడిన యెల్లకర్మమునంతమును ఫలోపభోగమునఁ జంద్రలోకమున నుండి పొంది నిరనుశయులై యవరోహించుచున్నా రని యెయ్యది చెప్పంబడినదో యది యనుశయసద్భావము తెలుపంబడుటవలన నిట్లు కాదు. ఈలోకమునం జేయంబడిన యాముష్మికఫలమగు నే కర్మము కలదో యారబ్ధఫలమగు దాని నంత నుపభోగమున నశింపఁజేసి (వచ్చుచున్నా రని) తోఁచును. ప్రాయణము (మరణము) సాధారణ నిమిత్తమగుట వలన ననారబ్ధఫలమగు నెల్లకర్మమును ఫలోన్ముఖముగాఁ జేయుచున్నది. అట్లగుచు నుండఁగా "నొక కర్మముచేఁ బర లోకమున ఫలమారంభింపఁబడు చున్నది, వేఱొక దానిచే నీ లోకమున ఫలమారంభింపఁబడు చున్నది" యను నీ విభా

గము సంభవింపదని యెద్ది చెప్పంబడినదో యదియు నను
శయసద్భావముం జూపుటచేతనే నిరాకరింపఁబడినది. మఱి
యు నే కారణముచేఁ బ్రాయణ మనారబ్ధ ఫలమగు కర్మమున
కభివ్యంజక మని (ఫలోన్ముఖముగాఁ జేయునది యని) ప్రతి
జ్ఞ చేయంబడు చున్నదో (నీవు) చెప్పవలసియున్నది. ఆరబ్ధ
ఫలమగు కర్మముచేఁ బ్రతిబద్ధ మైన యితరకర్మమునకు
వృత్త్యుద్భవ ముపపన్నము కాకపోవుటవలన నది యుపశమి
ల్లుటచేఁ బ్రాయణకాలమున ననారబ్ధఫలమగు కర్మమునకు
వృత్త్యుద్భవమగు నని చెప్పంబడెనేని యట నపు డెట్లు మర
ణమునకుఁ బూర్వ మారబ్ధఫలమగు కర్మముచేఁ బ్రతిబద్ధమైన
యితరకర్మమునకు వృత్త్యుద్భవోపపత్తి లేదో, యట్లే ప్రాయణ
కాలమునను విరుద్ధఫల మగు ననేకకర్మమున కొక్క పర్యా
యమే ఫలారంభము సంభవింపకపోవుటవలన బలవంతమగు
దానిచేతను బ్రతిబద్ధమైన దుర్బలకర్మమునకు వృత్త్యుద్భవా
నుపపత్తి (యగునని) చెప్పవలసియున్నది. కర్మముల కెల్లఁ
బ్రతినియత మగు ఫలము కలదని బోధించు శాస్త్రమునకు
విరోధమువలన ననారబ్ధఫలత్వ సామ్యముచే జన్మాంతరముల
నుపభోగింపఁదగిన ఫలము గల యనేకకర్మ మొకటియే
యైనఁ బ్రాయణమున నొక్క పర్యాయమే యభివ్యక్తమై
(=ఫలోన్ముఖమై) యొకజాతి (జన్మము) నే యారంభించు

నని చెప్ప శక్యముగాదు. చేయంబడిన కర్మ మవశ్యము ఫలము నిచ్చు నను శాస్త్రమునకు విరోధము గలుగును గాఁబట్టి మరణకాలమున నొకానొక కర్మమున కభివ్యక్తియు వేఱొక దానికి నాశమును గలుగుననియుఁ జెప్ప శక్యముగాదు. ప్రాయశ్చిత్తాదు లగు హేతువులతో వినాగాఁ గర్మములకు నాశమూహింపరాదు గదా! "౧కదాచిత్సుకృతంకర్మ కూటస్థమిహ తిష్ఠతి, మజ్జమానస్య సంసారే యావద్దుఃఖా ద్విముచ్యతే" యనునది మొదలగు స్మృతియును విరుద్ధఫల మగు కర్మముచేఁ బ్రతిబద్ధ మగు వేఱొక కర్మమునకుఁ జిరకాలమేని స్థితిని జూపుచున్నది. అనారబ్ధఫలమగు నెల్లకర్మము నొక్కటియ యగు ప్రాయణమునం దభివ్యక్తమగుచు నొకజన్మమునే యారంభించునేని దానివలన స్వర్గనరకతిర్యగ్యోనుల (యోని= దేహము) లం దధికారావగమము లేదు కాఁబట్టి ధర్మాధర్మముల యుత్పత్తి లేనిది యగుచు నుండఁగా నిమిత్తాభావము వలన నుత్తరజన్మము లేక పోవలెను. (జ్ఞానాభావము వలన

---

౧. సంసారే మజ్జమానస్య=జన్మమరణ ప్రవాహరూపమగు సంసారమున మునుఁగుచున్న వానియొక్క, సుకృతం-కర్మ=పుణ్యకర్మము, యావత్-దుఃఖాత్-విముచ్యతే=దుఃఖమునుండి విడువంబడు నందాఁకను, కదాచిత్=ఒకానొకప్పుడు, కూటస్థం=నశింపనిదియై, ఇహ=ఈ జంతువునందు, తిష్ఠతి=నిలుచుచున్నది. కర్మము విరుద్ధఫలమగు కర్మమునుండి జంతువు విడివడునందాఁకఁ జిరకాలమైన నుండును గాని ఫలమీక నశింపదని యర్థము

ముక్తియు సంభవింపదని వేదమున కప్రామాణ్యము వచ్చును.) బ్రహ్మహత్యాదులలో, నొక్కొక్క కర్మమునకు స్మరింపఁబడుచున్న యనేక జన్మహేతుత్వమును బాధింపఁబడుచున్నది. మఱియు ధర్మాధర్మముల స్వరూపము, ఫలము, సాధనము మొదలగువాని యధిగమమందు శాస్త్రముకంటె వేఱొక కారణము (కలదని) యూహింపను శక్యముగాదు. దృష్టఫలమగు కారీర్యాదికర్మమునకు మరణ మభివ్యంజకము కాదు కాఁబట్టి ప్రాయణమునకు సర్వకర్మాభివ్యంజకత్వకల్పన మవ్యాపకము గదా! ప్రదీపదృష్టాంతమును గర్మబలాబల ప్రదర్శనముచేతనే నిరాకృత మైనది. ఎట్లు ప్రదీపము స్వసన్నిధిసమానమే యైనను స్థూలరూపముఁ బ్రకటించును గాని సూక్ష్మముం బ్రకాశింపఁజేయ లేదో యట్లే ప్రాయణము, ననారబ్ధఫలమగు కర్మజాతమునకుఁ బ్రాప్తకాలత్వము సమానమైనను బలవంత మగు కర్మమునకు వృత్తిం బుట్టించుచున్నది గాని దుర్బల మగు దానికిఁ బుట్టింపఁజాలదు. కాఁబట్టి శ్రుతిస్మృతి న్యాయవిరోధమువలన (ప్రాయణము) సర్వకర్మముల ఫలోన్ముఖములం జేయునను నభ్యుపగమము సంగతముకాదు. సమ్యగ్దర్శనమువలన నెల్లకర్మములు క్షయించునను శ్రుతివలన శేషకర్మసద్భావము గలుగుచుండఁగా మోక్షాభావము సంభవించు ననుట నిదియు నస్థానమునందలి సంభ్రమము.

కాఁబట్టి యనుశయవంతులై యవరోహించుచున్నా రనునిది సిద్ధము. వా రవరోహించు చున్నవారై (ఈ లోకమునకు వచ్చుచున్నవారై) యథేతం - అనేవంచ = యథేతం=వెళ్లిన మార్గముననే వచ్చుచున్నా రని యర్థము. అనేవంచ=దానికి విరుద్ధమగు మార్గమునను వత్తురని యర్థము. పితృయాణ మార్గమం దున్న ధూమాకాశములను వచ్చు మార్గమునం జెప్పుటవలనను, "యథేత" మను శబ్దమువలనను, వెళ్లినమార్గముననే మఱలి వచ్చుచున్నా రని తోఁచును. వచ్చు మార్గమున రాత్రి మొదలగువాని సంకీర్తనము లేకపోవుటవలనను నభ్రాదులం జెప్పుటచేతను వెళ్లిన దానికి విపరీతమగు మార్గమున వత్తురనియుం దోఁచును.

సూ. చరణాదితిచే న్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః. ౯

ప. చరణాత్ - ఇతి - చేత్ - న - ఉపలక్షణార్థా - ఇతి - కార్ష్ణాజినిః.

అ. శ్రుతిచరణ = (ఆచార) మువలన దేహప్రాప్తిం జెప్పుచున్నది యగుటవలన ననుశయమువలన నది సిద్ధింప దనిన నెక్కారణమువలనఁ గార్ష్ణాజిన్యాచార్యుఁ డాశ్రుతి యనుశయమున కుపలక్షణ మని చెప్పుచున్నాఁడో యాకారణమువలన నిది దోషము కాదు.

భా. శ్రుతిచే ననుశయసద్భావము చూపంబడిన నను

శయప్రతిపాదనార్థము "రమణీయచరణా" యను నేశ్రుతి యుదాహరింపంబడినదో, అది చరణాత్ = ఆచారమువలన యోన్యాపత్తిని (= దేహప్రాప్తిని) జూపుచున్నది గాని యను శయమువలనఁ జూపుచున్నది కాదు. చరణము వేఱొకటియు ననుశయము వేఱొకటియును. చరణము, చారిత్రము, నాచారము, శీలము ననునవి యేకార్థకములు. అనుశయ మనునది భుక్తఫల మగు కర్మముకంటె నతిరిక్త మగు కర్మ మని తలంపఁబడుచున్నది. "యథాకారీ యథాచారీ తథాభవతి" యను శ్రుతియును, "యాన్యనవద్యానికర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి యాన్యస్మాకగ్ం సుచరితాని తానిత్వయోపాస్యాని నో ఇతరాణి" యను శ్రుతియును గర్మమును జరణమును వేఱుగా వ్యపదేశించుచున్నవి. కాఁబట్టి చరణమువలన

---

౧. బృ. ౪. ౪. ౫. యథాకారీ=ఎట్లుచేయు శీలముకలవాఁడో, యథాచారీ = ఎట్లాచరించు స్వభావముకలవాఁడో, తథాభవతి = అట్టివాఁడగుచున్నాఁడు. సత్కర్మములఁ జేయువాఁడును సదాచారము గలవాఁడును సాధువగును; దుష్కార్యములఁ గావించువాఁడును దురాచారుఁడును దురాత్ముఁ డగునని యర్థము.

౨. తై. ౧. ౧౧. ౨. యాని = ఎవ్వి, అనవద్యాని = నిషిద్ధములు కాని, కర్మాణి = కర్మములో, తాని = అవి, సేవితవ్యాని=చేయఁదగినవి. ఇతరాణి = తక్కినవి, [దుష్కర్మములు,] నో = సేవింపఁదగినవి కావు. అస్మాకం = మాయొక్క, సుచరితాని = సదాచారములు, యాని = ఎవ్వి కలవో, తాని = అవి, త్వయా = నీచేతను, ఉపాస్యాని = ఆచరింపఁదగినవి. ఇతరాణి = తక్కినవి=దురాచారములు, నో=ఆచరింపందగినవి కావు.

యోన్యాపత్తిని బోధించు శ్రుతివలన ననుశయము సిద్ధింపదు.
ఇతిచేత్ = ఇట్లంటేని, ఎక్కారణమువలన నీ చరణశ్రుతి, ఉపలక్షణార్థా ఇతి = సర్వకర్మాంగ మగు చరణ మనుశయ (= శ్రౌతకర్మ) లక్షకమని, కార్ష్ణాజినిః = కార్ష్ణాజిని యను నాచార్యుఁడు తలంచుచున్నాఁడో? యూకారణమువలనను, న = ఇది దోషము కాదు.

సూ. ఆనర్థక్యమితిచేన్న తదపేక్షత్వాత్. ౧౦.

ప. ఆనర్థక్యం - ఇతి - చేత్ - న-తదపేక్షత్వాత్.

అ. శుభాశుభ దేహప్రాప్తి యనుశయమువలన నయ్యె నేని యాచారమున కానర్థక్యము ప్రాప్తించు ననిన నాకర్మ జాత మాచారము నపేక్షించిన దగుటవలన నట్లనరాదు.

భా. అయ్యా! ఏ కారణమువలనఁ జరణశబ్దముచే శ్రౌతమగు (= ముఖ్యార్థమగు) శీలమును విడిచి లాక్షణిక మైన యనుశయము గ్రహింపఁబడవలెను? మంచిదియు బెడ్డదియు విహితమును ప్రతిషిద్ధము నగు శ్రౌతమైన శీలమునకే శుభాశుభయోన్యాపత్తి ఫలము కావచ్చును. శీలమునకు నైత మవశ్య మెద్దియో యొక ఫలము కల దని యంగీకరింప వలెను. అట్లంగీకరింపఁబడదేని, ఆనర్థక్యం - ఇతి - చేత్ =

౧. మనసుచేఁగాని, వాక్కుచేఁగాని, కర్మముచేఁగాని ఏజంతువు నకుఁ గీడుచేయమియు, వానియందలి దయయు, దానప్రాశస్త్యమును, శీల మనఁబడును.

శీలమున కానర్థక్యము ప్రసక్తించునం టేని, న = ఇది దోషము కాదు. దేనివలననం టేని, తదపేక్షత్వాత్ = ఇష్టాదికర్మజాతము చరణా (= శీలా) పేక్షమగుటవలన నని చెప్పుదుము. "ఆచారహీనం నపునంతి వేదా" యనునది మొదలగు [1]స్మృతులవలన సదాచారహీనుఁ డెవ్వఁడు (కర్మమున) నధికృతుఁడు కాఁడు గదా! (స్నానస్వాధ్యాయాదులవలెనే) యాచారమునకుఁ బ్రత్యేకముగాఁ బురుషార్థత్వ మున్న నిష్టాదికర్మజాతము ఫలము నారంభించుచున్నది యగుచునుండఁగా (అంగావబద్ధోపాసనమువలె) దాని నపేక్షించినదియై యాఫలమునందే యాచారమొక యతిశయము నారంభింపఁగలదు కాఁబట్టి యానర్థక్యము లేదు. శ్రుతిస్మృతులందుఁ గర్మమే సర్వార్థకారి యని ప్రసిద్ధి కలదు. కాఁబట్టి శీలోపలక్షిత మగు ననుశయభూతమగు కర్మమే యోన్యాపత్తికిఁ గారణ మనునది కార్ష్ణాజిని యభిప్రాయము. కర్మము సంభవించుచుండఁగా శీలమువలన యోన్యాపత్తి యుక్తము కాదు. పాదములతోఁ బరువెత్తశక్తుఁ డగువాఁడు మోకాళ్లతోఁ బ్రాకనర్హుఁడు కాఁడుగదా!

సూ. సుకృతదుష్కృతే ఏవేతితు బాదరిః. ౧౧

ప. సుకృతదుష్కృతే - ఏవ - ఇతి - తు - బాదరిః.

---

౧. వేదాః = వేదములు, ఆచారహీనం = సత్ప్రవర్తనము లేనివానిని, నపునంతి = పవిత్రునిఁ జేయఁజాలవు.

అ. బాదరాయణాచార్యుఁడు చరణశబ్దముచే సుకృతదుష్కృతకర్మములే గ్రహింపఁబడుచున్న వని తలంచుచున్నాఁడు.

(అవ. ఇట్లే కదేశిమతమును జెప్పి ముఖ్యసిద్ధాంతమును జెప్పుచున్నాఁడు.)

భా. బాదరిః - తు = బాదరాయణాచార్యుఁడు చరణశబ్దముచేతను, సుకృతదుష్కృతే - ఏవ = పుణ్యపాపకర్మములే, చెప్పఁబడుచున్న వని తలంచుచున్నాఁడు. చరణము, కర్మము, అనుష్ఠానమునను శబ్దములేకార్థబోధకములు. అట్లే చరతి ధాతువు సామాన్యమునఁ గర్మమాత్రమునం బ్రయోగింపఁబడుచున్నదియై చూడఁబడుచున్నది. ఎవఁడిష్టాదిలక్షణ మగు పుణ్యకర్మమును జేయుచున్నాఁడో, యతనిని "ధర్మంచర త్యేష మహాత్మా" యని (ఈ మహాత్ముఁడు ధర్మమును = పుణ్యకర్మమును జేయుచున్నాఁ డని) లౌకికులు చెప్పుచున్నారు గదా! ఆచారము సైతము ధర్మవిశేషమే. కర్మమునకును జరణమునకును భేదవ్యపదేశము, బ్రాహ్మణపరివ్రాజకన్యాయమున నైన నుపపన్నము కావచ్చును. కాఁబట్టి రమణీయచరణులు నాఁ బ్రశస్తకర్మము గలవారనియుఁ గపూయచరణులు నా నిందితకర్ము లనియు నిర్ణయము.

ఇది ద్వితీయాధికరణము.

అనిష్టాదికార్యధికరణము. ౩

సూ. అనిష్టాదికారిణా మపి చ శ్రుతం. ౧౨

వ. ... దికారిణాం - అపి - చ - శ్రుతం.

అ. ఇష్టాదులం గావించిన వారికంటె నితరులకును జంద్రలోకప్రాప్తి వినఁబడుటఁ జేసి యిష్టాదికారులే చంద్రలోకమును బొందుచున్నా రను నిది యుక్తము గా దని పూర్వపక్షము.

(అవ. పుణ్యాత్ముల గమనా గమనములచే వైరాగ్యమును నిరూపించి పాపాత్ముల గత్యాగతులచే సైతము దానిని నిరూపించుచున్నాఁడు.)

భా. యజ్ఞాది పుణ్యకర్మములను జేసినవారు (ఫలోపభోగార్థము) చంద్రలోకమును బొందుచున్నారని చెప్పంబడె. వారికంటె నితరు లెవ్వరు కలరో వారును జంద్రలోకమునకుం బోవుచున్నారా? పోవరా? యనునది చింతింపఁబడుచున్నది. అందు యజ్ఞాది పుణ్యకర్మములం జేసినవారే చంద్రలోకమును బ్రవేశించుచున్నా రను నిది యుక్తము కాదని చెప్పుచున్నాఁడు. దేనివలన నంటెని ఏ కారణము వలనను, అనిష్టాదికారిణా మపిచ = ఇష్టాది కర్మములను జేసినవారికంటె నితరులకును, శ్రుతం = చంద్రమండలము గంతవ్యమని వినంబడుచున్నదో యా కారణము వలనను, అది

యెట్లనిన సామాన్యముగఁ గౌషీతకి శాఖవారు "యే వై కే చాఽస్మాల్లోకాత్ప్రయంతి చంద్రమస మేవ తే సర్వేగచ్ఛంతి" యని పఠించుచున్నారు. పంచమాఽహుతియందు దేహారంభ మగు ననే నాహుతిసంఖ్యానియమము వలన మరల జన్మించుచున్నవారికి దేహారంభము నైతము చంద్రలోక ప్రాప్తిని వినాగ సంభవింపదు. కనుక నెల్లవారును జంద్రలోకమునకుఁ బోవుదురు. ఇష్టాదులం గావించినవారికి నితరులకును సమానగతి యుక్తము గాదనిన, నితరులకుఁ జంద్రమండలమున భోగాభావము వలన నట్లనరాదు. (అనిష్టాదికారులకుఁ జంద్రలోకమున భోగము లేకున్నను వేఱొక త్రోవ లేక పోవుటచే గ్రామమునకుం బోవుచు వృక్షమూలము నుపసర్పించుచున్నాఁ డనునట్లు గతి యుక్తమే యని భావము.)

(సిద్ధాంతము నుపక్రమించుచున్నాఁడు.)

సూ. సంయమనే త్వనుభూయేతరేషా మారోహావరోహౌ తద్గతి దర్శనాత్. ౧3

ప. సంయమనే - తు - అనుభూయ - ఇతరేషాం -

---

౧. కౌ. ౧. ౨. యే - వై - కేచ = ఏ కొందఱు, అస్మాల్లోకాత్ = ఈ లోకమునుండి, ప్రయంతి = పరలోకమునకుం బోవుచున్నారో, తేసర్వే = వారందఱును, చంద్రమస మేవ = చంద్రునిఁగూర్చియే, గచ్ఛంతి = పోవుచున్నారు. ఈ లోకమునుండి పరలోకమునకుం బోవువారందఱును జంద్రలోకమునకుం బోవుచున్నారని యర్థము.

ఆరోహావరోహౌ - తద్గతి దర్శనాత్.

అ. ఇష్టాదులం గావింపనివారికి శ్రుతి యమలోకము నకుం బోకను జూపుచున్నది కాంబట్టి వా రాలోకమునం బాపానురూపము లగు బాధల ననుభవించి యాలోకమునకు వచ్చుచున్నారు. వారి కిట్టి యారోహావరోహములే యగును గనుక నెల్లవారు జంద్రలోకమునకుం బోవుదు రనునది యయుక్తము.

భా. ఎల్లవారును జంద్రలోకమునకుం బోవుచున్నా రనునది యుక్తము కాదని, "తు" శబ్దము పూర్వపక్షమును వారించుచున్నది. దేనివలన నంటేని యెట్లొకానొకని వృక్షారోహణము పుష్పములను గాని ఫలములను గాని స్వీక రింపనే కాని నిష్ప్రయోజనముగం గాని కేవల పతనము కొఱకుం గాని కాదో యట్లే చంద్రమండ లారోహణమును భోగముకొఱకే కాని నిష్ప్రయోజనముగం గాని కేవల ప్రత్యవరోహముకొఱకుం గాని కాదు. ఇష్టాదులం గావింపని వారికిం జంద్రలోకమున భోగము లేదని చెప్పంబడెను. కాంబట్టి యిష్టాదికారులే చంద్రమండలమును బ్రవేశించు చున్నారు గాని యితరులు ప్రవేశింపరు. ఇష్టాదులను గావిం చినవారికంటె నితరులు, సంయమనే = యముని వాసస్థాన మునకుం బోయి యటను, అనుభూయ = వారి పాపముల

కుం దగునట్లుగా యమునిచే నేర్పఱుపఁబడిన యాతనల (=తీవ్రబాధల) ననుభవించి యీ లోకమునకు వచ్చుచున్నారు. ఇతరేషాం = యజ్ఞాదులను గావించినవారికంటె నితరులకు, ఆరోహావరోహౌ = ఇట్టి యారోహావరోహములే (=గమనాగమనములే) యగుచున్నవి.* దేనివలన నంటేని, తద్గతి దర్శనాత్ = వారికి యమలోక గమనము శ్రుతియందుఁ గాన్పించుట వలన నని చెప్పుదుము. అది యెట్లనినఁ బ్రతిపాదింపఁబడు చున్నది. "నసాంపరాయః ప్రతిభాతి బాలం, ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం, అయం లోకో నాస్తి పర ఇతి మానీ పునః పున ర్వశ మాపద్యతే మే"

---

౧. క. ౨. ౬ సాంపరాయః=సమ్యక్ = లెస్సగాను, పరస్తాత్ = దేహపాతమునకుం దరువాతను, ఈయతే = పొందఁబడుచున్నది. కాఁబట్టి సంపరాయ మను వ్యుత్పత్తిచేఁ సంపరాయము నాఁ బరలోకము. దాని ప్రాప్తికి శాస్త్రీయమైన సాధనము సాంపరాయము. అది, ప్రమాద్యంతం= పుత్రాదులం దాసక్తినిబొందిన మనసుగలవాఁ డగుటచేఁ బ్రమాదపడుచున్న వానిని, విత్తమోహేన=ధననిమిత్తమగు నవివేకముచేతను, మూఢం= అంధుఁడైన, బాలం = అవివేకిని, నప్రతిభాతి = అనువర్తింపదు. అవివేకికి శాస్త్రసిద్ధమైన పరలోకసాధన మగు నుపాయము తోఁపదని యర్థము. అయంలోకః= స్త్రీలతోడ నన్నపానాదులతోడఁ గూడిన యీ లోకమే, (కలదు కాని) పరః=మనకు గాన్పింపని పరలోకము, నాస్తి-ఇతి - మానీ= లేదని తలఁచుకొను విపరీతజ్ఞానము గల యా యజ్ఞుఁడు (మరల మరల జన్మించి) పునః పునః = మరల మరలను, మే=మృత్యువగు నా యొక్క, వశం=అధీనత్వమును, ఆపద్యతే = పొందుచున్నాఁడు. అవివేకి జననమరణ ప్రవాహరూప మగు దుఃఖమునుండి విడివడఁ డని యముఁడు నచికేతునితోఁ జెప్పెను.

యను యమవచనరూపమగు శ్రుతి మరణించుచున్న యని ష్టాదికారులకు యమవశ్యత్వం జూపుచున్నది. మఱియును "వైవస్వతం సంగమనం జనానాం" మనునది మొదలగు బహు శ్రుతిజాతము యజ్ఞాదులను గావింపనివారికి యమవశ మును బొందుటయందు లింగమగుచున్నది.

సూ. స్మరంతి చ. ౧౪

ప. స్మరంతి - చ.

అ. మఱియు వ్యాసాదులు యమలోకమున యమా యత్తమగు పాపకర్మ ఫలోపభోగమును స్మరించుచున్నారు.

భా. అపిచ = మఱియును, స్మరంతి = మనువు, వ్యా సుఁడు మొదలగు శిష్టులు యమపురము నందు యమాధీన మైన పాపకర్మ ఫలోపభోగముననిష్టాదికారులకు నాచికేతో పాఖ్యానము మొదలగు వానియందుఁ జెప్పుచున్నా రను నీ కారణమువలసను వారికిఁ జంద్రమండలారోహణము సంభ వింపదు.

సూ. అపిచ సప్త. ౧౫

ప. అపి - చ - సప్త.

అ. మఱియును పౌరాణికులు రౌరవాదులగు నేడు

౧. జనానాం = మరణించు జనులకు, సంగమనం = అవశ్యము గంతవ్యుఁ డగు, వైవస్వతం=యమరాజును, (హవిస్సుచేఁ దృప్తిపొందింప వలసినది.)

నరకములనిష్టాదికారులు పాపఫలము ననుభవించు స్థానము లని చెప్పుచున్నారు. కాబట్టియు వారు చంద్రలోకమునకుం బోరు.

భా. అపిచ=మఱియును, సప్త=రౌరవము మొదలగు నేడునరకములు, దుష్కృతకర్మముల ఫలముం బొందుచోట్లని పౌరాణికులు చెప్పుచున్నారు. అనిష్టాదికారులు వానిని బొందుచున్నారు. వా రెట్లు చంద్రలోకమును బొందుదురు? పొందరని యభిప్రాయము.

అవ. అయ్యా! ఏ కారణమువలన రౌరవాదు లగు నరకములయందు యమునికంటె నితరులగు చిత్రగుప్తాద్యధిష్ఠాతలు (= అధికారులు) స్మరింపఁబడుచున్నారో యా కారణమువలనఁ బాపకర్ములు యమాయత్తము లగు యాతనల ననుభవించుచున్నా రనునిది విరుద్ధ మనినఁ గాదని చెప్పుచున్నాఁడు.

సూ. తత్రాపిచ తద్వ్యాపారా దవిరోధః. ౧౬

ప. తత్ర - అపి - చ - తద్వ్యాపారాత్ - అవిరోధః.

అ. ఆరౌరవాదినరకములందు యమున కధిష్ఠాతృత్వ మంగీకరించుటవలన విరోధము లేదు.

భా. తత్రాపిచ = ఆరౌరవాదులగు నేడు నరకము లందును, తద్వ్యాపారాత్ - యమునకే యధిష్ఠాతృత్వ

వ్యాపారము నంగీకరించుటవలనను, అవిరోధః = విరోధాభావము (అగును.)

(అవ. మూఁడవమార్గము శ్రుతియందు వినఁబడుచున్నది. కాఁబట్టి పేలోక శ్రోవలేకపోవుటవలనఁ బాపకర్ములు సైతము చంద్రలోకమునకుఁ బోవుచున్నారను నిది యుక్తము కాదని చెప్పుచున్నాఁడు.)

సూ. విద్యాకర్మణో రితి తు ప్రకృతత్వాత్. ౧౭

ప. విద్యాకర్మణోః - ఇతి - తు - ప్రకృతత్వాత్.

అ. శ్రుతియం దేతచ్ఛబ్దముచే విద్యాకర్మములమార్గములు రెండే ప్రకృతము లగుటవలన వానియం దధికారము లేని యనిష్టాదికారులకు మూఁడవమార్గమే యగును గాని చంద్రలోకప్రాప్తి లేదు.

భా. పంచాగ్నివిద్యయందు "వేత్థ యథా సౌలోకో న సంపూర్యతే" యను ప్రశ్నమునకుఁ బ్రతివచనము చెప్పునపుడు "అథైతయోః పథోర్నకతరేణచనతా నీమానిక్షు

౧. ఛాం. ౫. ౩. ౩ (ఓ బాలుఁడా) యథా = ఎట్లు, అసౌ-లోకః = ఈ పిత్రులోకము, (పెక్కుండ్రు పోవుచున్నను) నసంపూర్యతే = నింపఁబడలేదో, వేత్థ = తెలిసికొనుచున్నావా? అని పాంచాలరాజు గౌతమపుత్రు నడిగెను.

౨. ఛాం. ౫. ౧౦. ౭ శుభకర్మవశమువలన బ్రాహ్మణాది దేహములం బొందిన వారాశ్రమ విహితకర్మములం జేయుచు నిష్టాపూర్తాదికర్మములను జేసినేని దక్షిణ (ధూమాది)మార్గమునఁ జంద్రలోకమునకు బోయి కర్మఫలము ననుభవించి యా ఫలహేతు వగు కర్మము క్షీణించిన తరువాత

ద్రాణ్యా సకృదావర్తీని భూతాని భవంతి జాయస్వ మ్రియస్వే త్యే తత్తృతీయం స్థానం తేనాసౌ లోకో నసంపూర్యతే" యని వినంబడుచున్నది. శ్రుతిలోను "ఏతయోఃపథో" యనఁగాను విద్యాకర్మణోః - ఇతి = విద్యాకర్మముల యొక్క మార్గము లని యర్థము. దేనివలన ననిన నా విద్యాకర్మములు రెండున్నూ ప్రకృతత్వాత్ = దేవయాన పితృయాణములనుమార్గము

నవశిష్ట మగు కర్మముచే నీ లోకమునకు వత్తురు. వీరి ట్లీ లోకమునుండి యా లోకమునకు నా లోకమునుండి యీ లోకమునకు వచ్చుచుందురు. ఈ బ్రాహ్మణాదులు విహితకర్మములను జేయుచు జ్ఞానమును బొందుదు రేని, ఉత్తర (=అర్చిరాది) మార్గమున బ్రహ్మలోకమునకుం బోయెదరు. ఎవరిష్టా పూర్తాదికర్మములను గావింపరో, మఱియు నెవరు విద్యను సంపాదింపరో వారు, అథ=పిమ్మట, మూఁడవమార్గము చెప్పంబడుచున్నది. ఏతయోః-పథోః= ఈ యర్చిరాది ధూమాదిమార్గములలోను, కతరేణచ = ఏ మార్గముచేతను, న=పోరు. ఇమాని - క్షుద్రాణి - భూతాని= ఇట్టి క్షుద్రజంతువు లగు నీచ కకదంశాదులు, అసకృదావర్తీని=మరల మరల జన్మించునవియుఁ జచ్చునవియు, భవంతి = అగుచున్నవి. "జాయస్వ - మ్రియస్వ" యనునది వీని జననమరణసంతతి కనుకరణము. సర్వేశ్వరుఁడు మార్గద్వయభ్రష్టు లగు నీజీవులను జూచి, జాయస్వ=నీవు జన్మింపుము. మ్రియస్వ=మరణింపు మని ప్రేరించుననునది దీనిచేఁ జెప్పఁబడుచున్నది. వీనికి జననమరణములచేతనే కాలక్షేప మగుచుండును గాని కర్మములను జేయుటకుఁ గాని ఫలములఁ బొందుటకుఁగాని కాలము లేదని భావము. ఏతత్=ఇది, తృతీయం-స్థానం = మూఁడవమార్గము. యేన=ఎక్కారణమున, దక్షిణమార్గమునం బోయినవారు మరల నీలోకమునకువత్తురో జ్ఞానకర్మముల రెంట నధికృతులు గాని వారు దక్షిణమార్గమున నెక్కారణమునం బోవరో యా యీ కారణముచేతను, అసౌలోకః = ఈపితృలోకము (= చంద్రలోకము), నసంపూర్యతే=నిండఁబడదు. (ఇట్లు పాంచాలరాజు గౌతమునితోఁ జెప్పెను.)

లకుఁ బ్రాప్తిసాధనములుగాఁ బ్రస్తుతము లగుటవలన నని చెప్పుదుము. "తద్య ఇత్థ"మ్మ నునది విద్య; దానిచేఁ బొందఁ దగినది దేవయానమార్గ మని చెప్పఁబడినది. "ఇష్టాపూర్తే దత్త" మ్మను నది కర్మము; దానిచేఁ బ్రతిపత్తవ్యమైనది పితృయాణమార్గ మని చెప్పఁబడినది. ఆ ప్రకరణముననే "అథైతయో ర్నకతరేణ్ణచన" యను నదియుఁ జెప్పఁబడినది. ఎవరు విద్యాసాధనముచే దేవయానమార్గమునను గర్మసాధనముచేఁ బితృయాణమార్గమున నధికృతులుగారో వారికి క్షుద్రజంతులక్షణమునసకృదావర్తి (= పలుమాఱు వచ్చునది) యు నగు మూఁడవపథము సంభవించు ననునది దీనిచేఁ జెప్పంబడినది. యగును. కాఁబట్టియు నసిష్టాదికారులకుఁ జంద్రలోకప్రాప్తి లేదు. వారును జంద్రలోకము నధిరోహించి యటనుండి దిగుచు క్షుద్రజంతుత్వమును బొందవచ్చు ననునది కావచ్చు ననిన నారోహము వ్యర్థము కాఁబట్టి యదియును సంభవింపదు. మఱియును మరణించుచున్నవా రెల్లరును జంద్రలోకమును బొందుచున్నవా రగుచునుండగా, వారిచే నీ (ద్యు) లోకము పూరింపఁబడుచున్నది కాఁబట్టి ప్రశ్నమునకు విరుద్ధమగు నుత్తరము ప్రసక్తించును. ఎట్లీలోకము పూరింపఁబడదో యట్లే కదా ప్రతివచనము నీవలెను. అవరోహము నంగీకరించుటవలన నసంపూరణము కావచ్చు ననిన నది శ్రుతి

యందు వినంబడకపోవుటవలన నట్లనరాదు. అవరోహణము వలన నసంపూరణ ముపపన్న మగుచున్నది యను నిది సత్యమే. కాని శ్రుతి "ఏత త్తృతీయం స్థానం తేనా உసౌలోకో నసంపూర్యతే" యని తృతీయస్థానము (=మూఁడవమార్గము)ం జెప్పుటచే నసంపూరణమును జూపుచున్నది కాఁబట్టి యనారోహణమువలననే యసంపూరణము యుక్తము. అవరోహణమిష్టాదికారులందు సమానమగుచుండఁగా మూఁడవ స్థానముం జెప్పుట కానర్థక్యము ప్రసక్తించుటవలనను వారారోహింపక పోవుటచేతనే యసంపూరణము యుక్తము. (సూత్రములోని) తు శబ్దము కౌషీతకిశాఖవారి వాక్యము వలనఁ గలిగిన యెల్లవారి గమనాశంకను వారించుచున్నది. ఇట్లగుచునుండఁగా నెవ్వ రామార్గమున నధికృతులై యీ లోకమునుండి పోవుచున్నారో, వారందఱును జంద్రలోకము నకుం బోవుచున్నా రని, శాఖాంతరీయవాక్యమునందలి "సర్వ" శబ్ద మధికృతాపేక్షమై నిలుచుచున్నది.

అవ. పంచమాహుతియందు దేహారంభ మగు నను నాహుతి సంఖ్యానియమమువలన దేహాలాభోపపత్తికొఱకు నెల్లవారును జంద్రలోకమును బ్రవేశించుచున్నా రని యెద్ది చెప్పంబడినదో యది నిరాకరింపఁబడుచున్నది.

సూ. న తృతీయే తథోపలబ్ధేః. ౧౮

ప. న - తృతీయే - తథా - ఉపలబ్ధేః.

అ. ఆహుతి సంఖ్యానియమమును వినాగనే మూఁడవ మార్గముం బ్రవేశించినవారికి దేహప్రాప్తి కాన్పించుటవలన వారిదేహలాభము కొఱ కాహుతినియమ మాదరింపఁదగినది కాదు.

భా. తృతీయే=మూఁడవస్థానమున (=మార్గమున)ను, న=దేహలాభముకొఱ కాహుతిసంఖ్యానియమ మాదరింపఁదగినది గాదు. దేనివలన నంటేని, తథా ఉపలబ్ధేః = ఆహుతి సంఖ్యానియమమును వినాగనే "జాయస్వ మ్రియస్వే త్యేత త్తృతీయం స్థాన" మను శ్రుతిచేఁ జెప్పఁబడిన ప్రకారము గాను మూఁడవమార్గము ప్రాప్తి (నిరంతరజన్మమరణముల ప్రాప్తి) కాన్పించుటవలనను, మఱియును "పంచమ్యామాహుతావాపః పురుషవచసో భవంతి" యనుచోటఁ బురుష శబ్దము మనుష్యజాతిం జెప్పునది యగుటవలన మనుష్యశరీరమునకుఁ గారణముగా నాహుతిసంఖ్య చెప్పంబడుచున్నది గాని కీటపతంగాదిశరీరములకుం గారణముగాఁ గాదు. మఱియు వాక్యమునకు ద్వ్యర్థతాదోషమువలనఁ బంచమాహుతియం దప్పులకుఁ బురుషవచస్త్వము చెప్పంబడుచున్నది గాని యాపంచమాహుతియందుఁ బురుషవచస్త్వము నిషే

ధింపఁబడలేదు. ఆ జీవులలో నేరికిఁ జంద్రమండలమున కారో హము నటనుండి యవరోహము సంభవించునో వారికిఁ బంచ మాహుతియందు దేహ ముద్భవించును. తక్కినవారి కాహుతి సంఖ్యతో వినాగనే భూతాంతరములతోఁ గూడిన యప్పు లచే దేహ మారంభింపఁబడుచున్నది.

సూ. స్మర్యతేపిచ లోకే. ౧౯.

ప. స్మర్యతే - అపి - చ - లోకే.

అ. భారతాదులందు ద్రోణాదులకు సీత మొదలగు వారికిని నయోనిజత్వము చెప్పంబడుచున్నది. వారియందు వలెనే మఱియొకరియందు నాహుతినియమమున కనాదర ము కావచ్చును.

భా. అపిచ=మఱియును, లోకే=భారతాదిగ్రంథము లందును, స్మర్యతే=ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుఁడు మొదలగు వారికిని సీతా ద్రౌపదీ ప్రభృతులకు నయోనిజత్వము చెప్పం బడుచున్నది. వారిలో ద్రోణాదులకు యోషిద్విషయ మైన యొక యాహుతియే లేదు. ధృష్టద్యుమ్నుఁడు మొదలగు వారికి స్త్రీపురుషవిషయమైన రెండాహుతులు లేవు. వారి యందు వెల్లాహుతిసంఖ్యానియమమున కనాదరమో యట్లే వేఱొకచోటం గావచ్చును. (లోకశబ్దమునకు యౌగికార్థముం జెప్పి రూఢ్యర్థముం జెప్పుచున్నాఁడు.) లోకే=లోకమున బలా

కరేతస్సేకముతో వినాగనే గర్భమును ధరించునని, స్మర్యతే =చెప్పంబడుచున్నది.

సూ. దర్శనాచ్చ. ౨౦.

ప. దర్శనాత్ - చ.

అ. కొన్ని జంతువులు గ్రామ్యధర్మమును వినాగనే పుట్టుచున్నవిగా కాన్పించుటవలన నాహుతిసంఖ్య యనావశ్యకము.

భా. దర్శనాత్ - చ=మఱియు జరాయుజములు నండజములు నుద్భిజ్జములు నను నాల్గువిధములు గల భూతసముదాయమునందు స్వేదజములకు నుద్భిజ్జములకును గ్రామ్యధర్మమును వినాగనే యుత్పత్తి కాన్పించుటవలన నాహుతిసంఖ్యయం దనాదర మగుచున్నది. ఇట్లే వేఱొక చోటనుం (అనిష్టాదికారులందును) గాఁగలదు.

అవ. అయ్యా! "ఆండజంజీవజముద్భిజ్జ ము"నుచోటను "తేషాంఖల్వేషాంభూతానాం త్రీణ్యేవ బీజాని భవంతి"యని మూఁడు విధము లగు భూతముల సముదాయమే వినంబడు

౧. ఛాం. ౬. 3. ౧. తేషాం = జీవావిష్టము లగు ( = జీవునిచేఁ బ్రవేశింపఁబడిన) ఏషాం - భూతానాం = పశుపక్షిస్థావరాదులకుఁ, అండజం = పక్ష్యాదికమును, జీవజం = జరాయుజ మగు మనుష్యాదికమును, ఉద్భిజ్జం=స్థావరజాతము నను, త్రీణ్యేవ = మూఁడే; బీజాని - బీజములు= హేతువులు, భవంతి = అగుచున్నవి.

చున్నది. ఎట్లు భూతగ్రామమునకుఁ జతుర్విధత్వము ప్రతిజ్ఞ సేయఁబడుచున్నది యను నాశంక గలుగుచుండఁగాఁ జెప్పు చున్నాఁడు.

సూ. తృతీయశబ్దావరోధస్సంశోకజస్య. ౨౧.

ప. తృతీయశబ్దావరోధః - సంశోకజస్య.

అ. అండజమిత్యాదిస్థలమున స్వేదజములకు నుద్భిజ్జ శబ్దముచేత గ్రహణము చేయఁబడె నని తెలియవలెను.

భా. అండజం జీవజ ముద్భిజ్జ మను చోటను, సంశోకజస్య=స్వేదజమునకును, తృతీయశబ్దావరోధః=మూఁడవ దగు నుద్భిజ్జశబ్దముచేతనే సంగ్రహము చేయంబడె నని యెఱుంగ వలెను. దేనివలననంటెని స్వేదజములు నుద్భిజ్జములు నను రెంటికిని భూజలముల యుద్భేదము (=భూమిని జలమును బెకల్చికొనివచ్చుట) చే నుత్పత్తితుల్యమగుట వలనను. స్థావరము పెకలించుకొనివచ్చుటకంటె జంగమము పెకలించు కొని వచ్చుట విలక్షణము కాఁబట్టి వేఱొకచోట వానికి భేద వాదము సైత ముపపన్నమే యగుటవలన విరోధము లేదు.

ఇది తృతీయాధికరణము.

---

## సాభావ్యాపత్త్యధికరణము. ౪

సూ. సాభావ్యాపత్తి రుపపత్తేః. ౨౨

ప. సాభావ్యాపత్తిః - ఉపపత్తేః.

అ. యుక్తియుక్తముగా నుండుటవలనఁ జంద్రమండలము నారోహించి యటనుండి దిగు వారాకాశాదిసామ్యముం బొందుదురు గాని వాని స్వరూపమునే పొందరు.

భా. ఇష్టాదులం (= యాగాదులం) గావించినవారు చంద్రలోకమునకుం బోయి యట ననుభవింపం దగిన ఫలము గల కర్మ మున్నంతకాల ముండి యటనుండి యీ లోకమునకు సానుశయులై వచ్చుచున్నారని చెప్పంబడె. పిమ్మట వారి యవరోహప్రకారము పరికింపఁబడుచున్నది. చంద్రలోకమునకుం బోయి భోగము సమాప్తిం జెందిన తరువాత నవరోహించు జీవుల యందు "[1]అథైతమేవాధ్వానం పున

---

౧. ఛాం. ౫. ౧౦. ౫. అథ = చంద్రలోకమునకుం బోయిన జీవులు పరలోక భోగసాధన మగు కర్మము క్షయించిన తరువాతను, యథేతం = పోయినట్లుగనే, ఏత మేవ - అధ్వానం = ఈ మార్గముననే, పునర్నివర్తంతే = మరలుచున్నారు. (అట్లు మరలిన యనుశయులు కర్మాంతమునఁ గరఁగిన శరీరము గలవారై) ఆకాశం = ఆకాశమును, (బొంది దానితో సము లగుచున్నారు. ఆకాశసామ్యముం బొందిన తరువాత వారు శుద్ధగాఁ జేయఁబడిన లింగోపాధి గలవారై వాయువుచే నిటు నటు త్రిప్పంబడినవారై) వాయుం = వాయువును, (బొంది తత్సదృశు లగుచున్నారు.) (ఆ జీవ సంఘము) వాయుర్భూత్వా - వాయువై = వాయు సామ్యముం బొంది, ధూమోభవతి = ధూమ మగును. ధూమముం బొంది దానితో సమమగును...

న్నివర్త్తంతే యథేత మాకాశ మాకాశాద్వాయుం వాయుర్భూత్వా ధూమో భవతి ధూమో భూత్వా ఽభ్రం భవత్యభ్రం భూత్వా మేఘో భవతి మేఘో భూత్వా ప్రవర్షతి" యను నవరోహశ్రుతి కలదు. అం దవరోహించుచున్న జీవు లాకాశాది స్వరూపముం బొందుచున్నారా? యాకాశాది సామ్యముం బొందుచున్నారా? యను సంశయము కలదు. అట్టి సంశయము గలుగుచుండఁగా నాకాశాది స్వరూపముం బొందుచున్నా రనునిది ప్రాప్త మయ్యెను. దేనివలన నంటేని యిట్లైననే శ్రుతి ముఖ్యార్థమగుచున్నది కనుకను. వేఱొకలాగున నయ్యేనేని లక్షణ ప్రసక్తించును. ముఖ్యార్థమును గ్రహింపవలెనా? లక్షణకావలెనా? యనుసంశయము కలుగుచుండఁగా ముఖ్యార్థగ్రహణము న్యాయ్యము గాని లక్షణ న్యాయ్యము కాదు. పూర్వోక్తప్రకారమున శ్రుతికి ముఖ్యార్థత్వము నాశ్రయించి యనుశయుల కాకాశాదిస్వరూపప్రాప్తి కలుగుచుండఁగానే "వాయుర్భూత్వాధూమోభవతి" యను

---

ధూమోభూత్వా - ఆ సముదాయము ధూమమై = ధూమసామ్యముం బొంది, అభ్రం భవతి = ఉదకమును ధరించిన మబ్బగుచున్నది. అభ్రసమ మగుచున్నదని యర్థము. అభ్రంభూత్వా = అట్టి మేఘసామ్యముం బొంది, మేఘోభవతి = వర్షించు మబ్బగుచున్నది. వర్షించు మబ్బుతో సమానమగునని యర్థము. మేఘోభూత్వా = మేఘమై, ప్రవర్షతి = వర్షించుచున్నది. వర్షధారాద్వారమున భూమిం బ్రవేశించుచున్న దని సిద్ధాంతగతిచే శ్రుత్యర్థము.

నవి మొదలగు నక్షరము లనుకూలము లగుచున్నవి. కాఁబట్టి యాకాశాదిస్వరూపప్రాప్తియే సాభావ్యాపత్తి యని ప్రాప్తింప గాను. సాభావ్యాపత్తిః=ఆకాశాదిసామ్యమే పొందఁబడుచున్న దని చెప్పుచున్నారము. (అనుశయులకు) శశిమండలమున నుపభోగార్థమైయే యమ్మయమగు (=జలమయమగు) శరీర మారంభింపఁబడినదో (=కర్మముచే రచియింపఁబడినదో) యది యుపభోగము క్షయించినది యగుచుండఁగాఁ గరఁగి పోయినదియై సూక్ష్మమగుచు నాకాశసమమగుచున్నది. తరు వాత వాయువశముం బొందుచున్నది. పిమ్మట ధూమాదు లతోఁ జేరుచున్నది. "య థేతమాకాశ" మిత్యాదులచే నిదియే చెప్పంబడుచున్నది. ఇది యెట్లంటేని, ఉపపత్తేః=ఇట్లయిననే యిది యుపపన్నమగుటవలన నని చెప్పుదుము. అన్యమునకు ముఖ్యమైన యన్యభావ ముపపన్నముగాదు గదా! ఆకా శాదిస్వరూపప్రాప్తి గలుగుచుండఁగా వాయ్వాదిక్రమమున నవరోహణమును సంభవింపదు. ఆకాశము విభువగుటవలన నెల్లపుడు సంబద్ధమే కాఁబట్టి దానితో సాదృశ్యప్రాప్తికంటె మఱియొక సంబంధమును ఘటిల్లదు. ముఖ్యార్థము సంభవిం పని యపుడు లక్షణాగ్రహణమును న్యాయ్యమే. కాఁబట్టి యాకాశాదితౌల్యముం బొందుటయే యిట నాకాశాదిభావ మని గౌణముగాఁ జెప్పంబడినది.

(బ్రహ్మవిద్యాభరణముతో ముద్రింపఁబడిన పుస్తకములో నీ సూత్రమునకు మొదటఁదచ్ఛబ్దము చేర్పఁబడి యున్నది. కాని యర్థవిశేష మెద్దియుం గాన్పింపదు.)

ఇది చతుర్థాధికరణము.

నాతిచిరాధికరణము. ౫.

సూ. నాతిచిరేణ విశేషాత్. ౨౩

ప. నాతిచిరేణ - విశేషాత్.

అ. అనుశయులకు వ్రీహ్యాదిభావముం బొందిన తరువాత దీర్ఘకాలమునకు నిర్గమనముం జెప్పుట యను విశేషము వలన దానికిం బూర్వ మల్పకాలముననే యాకాశాది సాదృశ్యమున నుండి నిర్గమనము గలుగు నని తెలియఁబడుచున్నది.

భా. అవరోహించుచు నాకాశాది సాదృశ్యమును బొందిన జీవులకు వ్రీహియవాదిభావముం బొందుటకుఁ బూర్వ మాకాశాదిప్రాప్తి గలుగుచుండఁగాఁ బూర్వపూర్వసాదృశ్యమున దీర్ఘదీర్ఘకాలముండి మీఁదిమీఁది దానితో సామ్యముం బొందుచున్నారా? యల్పాల్పకాలముండి పొందుచున్నారా? యను సంశయము కలదు. అట్టి సంశయము గలుగుచుండఁగా నియమమును బోధించు శాస్త్రము లేకపోవుటవలన నియ

మము లేదని ప్రాప్తింపఁగాను "నాతిచిరేణ" యను దీనిం జెప్పుచున్నాఁడు. (జీవు లవరోహించుచున్నవారై) మిక్కిలి స్వల్పకాల మాకాశాదిసామ్యమువనుండి వర్షధారలతోఁ గూడ నీభూమిం బ్రవేశించుచున్నారు. ఇది దేనివలనం దెలియంబడుచున్న దరటని, విశేషాత్ = విశేషము కాన్పించుట వలనను. అది నొట్లిన్నం బ్రతిపాదింపఁబడుచున్నది. వ్రీహ్యాది భావముకంటెం దరువాతను "అతో వై ఖలు దుర్నిష్ప్రపత రమ్మ" ని ప్రత్యేకించి (శ్రుతి) చెప్పుచున్నది. ఛాందసప్రక్రియచే నిట నొక తకారము లోపించినదని తెలియవలెను. దుర్నిష్ప్రపతతరం = దుర్నిష్క్రమతరం = వ్రీహ్యాదిభావము నుండి నిస్సరణము దుఃఖతర మని యర్థము. కాఁబట్టి దీని యందు దుఃఖమగు నిష్ప్రపతనము (=బయలువెడలుట) ను జూపుచుఁ బూర్వపువానియందు సుఖనిష్క్రమణమును జూపుచున్నది. ఆకాలమునందు శరీరనిష్పత్తి లేదు కాఁబట్టి యుపభోగము సంభవింపకపోవుటవలన నిష్క్రమణమున కీ సుఖ

---

౧. ఛాం. ౫. ౧౦. ౬. అతో వై ఖలు = వ్రీహియవాదిభావము నుండి, దుర్నిష్ప్రపతరం - దుర్నిష్ప్రపతతరం = మిక్కిలి దీర్ఘకాలమునకు నిస్సరణము గల, అన్నం = అనుశయులతోఁ గూడిన యన్నమును, యః యః = ఎవఁ డెవఁడు, అత్తి = భక్షించుచున్నాఁడో, యః = ఎవఁడు, రేతః = వీర్యమును, సించతి = ఋతుకాలమున స్త్రీయందుఁ బ్రవేశపెట్టుచున్నాఁడో, తద్భూయ ఏవ = (అనుశయి) వాని యాకృతి కలవాఁడయియే, భవతి = అగుచున్నాఁడు.

దుఃఖవిశేషములు కాలాల్పత్వదీర్ఘత్వనిమిత్తములే యని తెలియవలెను. కనుక వ్రీహ్యాదిభావముక్తంబుం బూర్వ మల్ప కాలముననే యవరోహ మగును.

ఇది పంచమాధికరణము.

---

అన్యాధిష్ఠితాధికరణము. ౬.

సూ. అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్. ౨౪

ప. అన్యాధిష్ఠితే - పూర్వవత్ - అభిలాపాత్.

అ. ఆకాశాదులందు వలెనే కర్మప్రసక్తిని వినాగా వ్రీహ్యాదిప్రవేశముం జెప్పుటవలన వేఱు జీవులచే నధిష్ఠింపఁబడిన వ్రీహ్యాదులం దనుశయులకు సంసర్గమాత్రమె యగుచున్నది గాని వానియందు సుఖదుఃఖభోక్తృత్వము లేదు.

భా. మీఁదటి యవరోహమునందే ప్రవర్షణానంతరమునను "తే ఇహ వ్రీహియవా ఓషధివనస్పతయస్తిలమాషా ఇతి జాయంతే" యని పఠింపఁబడుచున్నది. అందు వర్షపాదృశ్యానంతరమున ననుశయులు స్థావరజన్మముం బొందు

---

౧. ఛాం. ౫ ౧౦. ౬. తే=ఆ యనుశయవంతులు (క్షీణకర్ములై), ఇహ = భూమిమీఁదను, వ్రీహియవాః - ఓషధివనస్పతయః = తిలమాషాః = వ్రీహులుఁగఁ గాని, యవలుఁగఁ గాని, ఓషధులుఁగఁ గాని, వనస్పతులుఁగఁ గాని, తిలమాషములుఁగఁ గాని, జాయంతే = పుట్టుచున్నారు. అనఁగా జాతిస్థావరము లగు వ్రీహియవాదులతో సంశ్లేషమాత్రముం బొందుచున్నారని యర్థము గాని యా స్థావరములై జన్మించుచున్నారని యర్థము గాదు.

చున్నవారై స్థావర సుఖదుఃఖములం బొందుచున్నారా? లేక వేఱు క్షేత్రజ్ఞులచే నధిష్ఠింపఁబడిన స్థావరశరీరములందు సంశ్లేషమాత్రముం బొందుచున్నారా? యను సంశయము గలదు. ఏమిప్రాప్త మయ్యెననిన ననుశయులు స్థావరజన్మముం బొందుచున్నవారగుచు వాని సుఖదుఃఖములం బొందువారగుచున్నా రనునిది ప్రాప్త మయ్యెను. దేనివలన నిది తెలియంబడు చున్నదనిన జని ధాతువునకు ముఖ్యార్థోపపత్తి కలుగుటవలనను ("స్థాణు మన్యేను సంయంతి యథాకర్మ యథాశ్రుతం, శరీరజైః కర్మదోషై ర్యాతిస్థావరతాం నర" యను నిత్యాది) శ్రుతిస్మృతులందు స్థావరభావ ముపభోగ స్థానమని ప్రసిద్ధ మగుటవలనను నిష్టాదికర్మ సముదాయమునకు హింసాది సంబంధము వలన ననిష్టఫలము కలిమి యుపపన్న మగుటవలనను ననుశయులకు శ్వాదిజన్మమువలె నీ స్థావరజన్మమును ముఖ్యమే యని తెలియంబడుచున్నది. ఎట్లు "శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా"

౧. అన్యే = ఈ లోకమున మరణించినవారు కొందఱు, యథాకర్మ = కర్మానుసారముగాను, యథాశ్రుతం = వారు చేసిన యుపాసనానుసారముగాను, స్థాణుం = స్థావరజన్మమును, అనుసంయంతి = పొందుచున్నారు.

౨. నరః = మనుష్యుఁడు, శరీరజైః – కర్మదోషైః = శరీరమువలనఁ గలిగిన కర్మదోషములచేతను, స్థావరతాం = స్థావరభావమును, యాతి = పొందుచున్నాఁడు.

యని యనుశయులకు (అనుశేతే=భోక్తారమనుగచ్ఛతి యను వ్యుత్పత్తిచే భుజియింపంబడిన ఫలము గల కర్మముకంటె వేఱొకటియగు=అనారబ్ధఫలమగు - కర్మజాత మనుశయము. అది యెవ్వరికిఁ గలదో యట్టిజీవు లనుశయులు. వారికి) శ్వాది సుఖదుఃఖసమన్వితమగు శ్వాదిజన్మము "ముఖ్యమే యగు చున్నదో యట్లే వ్రీహ్యాదిజన్మమును" ముఖ్యమే యని ప్రాప్తింపఁగాను, అన్యాధిష్ఠితే=అన్యులగు జీవులచే నధిష్ఠింపఁబడిన వ్రీహ్యాదులం దనుశయులు సంసర్గమాత్రం బొందు చున్నారు కాని వాని సుఖదుఃఖములం బొందువారు కారు. పూర్వవత్=ఎట్లనుశయులకు వాయుధూమాదిభావము తత్సంశ్లేషమాత్రమో యట్లే వ్రీహ్యాదిభావమును జాతిస్థావరములతో సంశ్లేషమాత్రమే యని చెప్పుచున్నారము. దేనివలన నిది చెప్పంబడుచున్నది యంటేని పూర్వవత్-అభిలాపాత్= పూర్వమువలెనే యిటనుం జెప్పుటవలన నని చెప్పుదుము. అభిలాపమునకుఁ బూర్వమువలెనే యునికి యెద్దియనినఁ గర్మవ్యాపారమును వినాగ సంకీర్తనము (శ్రుతి) ఆకాశము మొదలుగా వర్షణము కడపలగాఁ గలవానియం దెట్లు కర్మవ్యాపారము నెద్దానిం బరామర్శింపదో యట్లే వ్రీహ్యాదిజన్మమునందుం బరామర్శింపదు. కాఁబట్టి యనుశయులకు వ్రీహ్యాదులందు సుఖదుఃఖానుభవము లేదు. శ్రుతి యెచ్చోట సుఖదుఃఖముల

ప్రాప్తిం దలఁచుచున్నదో యక్కడను "రమణీయచరణాః, కపూయచరణా" యని కర్మవ్యాపారముం బరామర్శించు చున్నయది. మఱియు ననుశయులకు వ్రీహ్యాదిజన్మము ముఖ్య మె యయ్యె నేని వ్రీహ్యాదులు కోయంబడుచున్నవి చీల్పం బడుచున్నవి వేఁపంబడుచున్నవి వధింపంబడుచున్నవి భక్షిం పఁబడుచున్నవి యగుచునుండఁగాఁ దదభిమానులగు నను శయులు లేచిపోవుదురు. ఏజీవుఁ డేశరీరము నభిమానించు చున్నాఁడో యాజీవుఁ డాశరీరము పీడింపఁబడుచున్నప్పుడు లేచిపోవుచున్నాఁడని ప్రసిద్ధము. అనుశయులు లేచిపోయిన వా రగుచునుండఁగా వ్రీహ్యాదిభావముకంటెం దరువాత రేత స్సిగ్భావము వారికిఁ జెప్పంబడకపోవలెను. కాబట్టి యను శయుల కన్యాధిష్ఠితములగు వ్రీహ్యాదులందు సంశ్లేషమాత్రమే యగుచున్నది. మీఁదఁ జెప్పంబడిన యుక్తిచే జన్మశ్రుతి గౌణార్థ మగుటవలన ముఖ్యార్థమును, వ్రీహ్యాదు లనుశయు లకు భోగస్థాన మనునంశమును నిరాకరింపవలెను. (అట్లయిన మీఁదటి శ్రుతిస్మృతులు పీడింపఁబడునంటేని) మేము వ్రీహ్యా దులకు భోగాయతనత్వమును వారింపము. పాపబలముచే స్థావరభావమును బొందిన యితరజంతువులకు నవి భోగస్థా నము కావచ్చును గాని చంద్రలోకమునుండి దిగుచున్న యనుశయులు స్థావరభావమును బొందరని చెప్పెదము.

సూ. అశుద్ధ మితిచే న్న శబ్దాత్. ౨౫

ప. అశుద్ధం - ఇతి - చేత్ - న - శబ్దాత్.

అ. వైదికమగు కర్మము పశుహింసాసంబంధమువలన దుష్టము. దాని కనిష్టఫలముంగావచ్చును గనుక ననుశయులకు వ్రీహ్యాదిజన్మము ముఖ్యమే యనిన ధర్మాధర్మపరిజ్ఞానము కేవల శబ్దగమ్యము కాఁబట్టి య ట్లనరాదు.,

భా. పశుహింసాసంబంధమువలన నాధ్వరిక మగు కర్మము (యజ్ఞాదికర్మము) అశుద్ధం=దుష్టము. దాని కనిష్ట మగు ఫలమును గావచ్చు నను కారణమువలన ననుశయులకు వ్రీహ్యాదిజన్మము ముఖ్యమే యగును. వ్రీహ్యాది జన్మమునకు ముఖ్యత్వము సంభవించుచుండఁగా గౌణకల్పనము నిరర్థకము. ఇతిచేత్ - ఇట్లనిన నది పరిహరింపఁబడుచున్నది. శబ్దాత్ = ధర్మాధర్మవిజ్ఞానము శాస్త్రహేతుకమగుటవలనను,న = వైదిక మగు కర్మ మశుద్ధము కాదు. ధర్మాధర్మము లప్రత్యక్షము లగుట వలనను ననియతదేశకాల నిమిత్తము లవుట వలనను నిది ధర్మ మిది యధర్మ మను జ్ఞానమునకు శాస్త్రమే కారణము. ఏ దేశమున నే కాలమున నే నిమిత్తమున నే ధర్మ మనుష్ఠింపఁబడుచున్నదో యా ధర్మమే వేఱు దేశకాలనిమిత్త ములం దనుష్ఠింపఁబడుచున్నదియై యధర్మమగును. ధర్మాది జ్ఞానము శాస్త్రైకసాధ్యము కాఁబట్టి శాస్త్రమును వినాగ

ధర్మాధర్మవిజ్ఞాన మెవనికిం గలుగదు. శాస్త్రమున హింసానుగ్రహాద్యాత్మకమగు (హింస నంగీకరించుట మొదలగు నాకారముగల) జ్యోతిష్టోమము ధర్మమని నిశ్చయింపఁబడుచున్నది. అది యశుద్ధమని యెట్లు చెప్పవచ్చును? అయ్యా! "నహింస్యాత్సర్వాభూతాని"[౧] యను శాస్త్రమే భూతవిషయ మగు హింస యధర్మమని తెలుపుచున్నది యనిన సత్యమే. కాని యది యుత్సర్గము.(=సామాన్యశాస్త్రము.) "అగ్నీషోమీయం[౨] పశుమాలభేత" యనునది యపవాదము = విశేషశాస్త్రము= (సామాన్య శాస్త్రమునకు బాధకమనియర్థము.) ఉత్సర్గాపవాదములకు వ్యవస్థితవిషయత్వము కలదు=విధి నిషేధములకుఁ బరస్పర విరోధము గలిగినపుడు నిరవకాశము సావకాశమును బాధించునను వ్యవస్థ కలదని భావము. కాఁబట్టి శిష్టులచే ననుష్ఠింపఁబడుచున్నది కావునను నిందింపఁబడుచున్నది కాకపోవుటవలనను వైదిక మగు కర్మము విశుద్ధము. ఆ కారణముచేఁ బరిశుద్ధమగు యాగాదికర్మమునకు స్థావరజన్మరూప మైన యనిష్టఫలము కాఁగూడదు. మఱియు శ్వాదిజన్మమువలె

౧. సర్వా - భూతాని = ఏ జంతువును గాని, నహింస్యాత్ = హింసింపరాదు.

౨. అగ్నీషోమీయం = అగ్నియు, సోముఁడు నధిదేవతగాఁ గల, పశుం = ఛాగమును, అలభేత = ఆలంభించునది.

వ్రీహ్యాది జన్మము కాఁదగదు. అది పాపకర్మల నధికరించిగదా చెప్పంబడినది. ఇట్లనుశయులకు వ్రీహ్యాదిజన్మమునం దసాధారణ మగు హేతు వెద్దియు లేదు. కాఁబట్టి చంద్రలోకము నుండి స్ఖలితు లగుననుశయులకు వ్రీహ్యాదిసంశ్లేషమాత్రమే తద్భావమని గౌణముగాఁ జెప్పంబడుచున్నది.

సూ. రేతస్సిగ్యోగోథ - ౨౭

ప. రేతస్సిగ్యోగః - అథ.

అ. అనుశయులకు వ్రీహ్యాది భావమునకుం దరువాత రేతస్సేకముఁ జేయువానితోఁ సంబంధము పఠింపఁబడుచున్నది కాఁబట్టియు వ్రీహ్యాదిభావము వానితోడిసంశ్లేషమే.

భా. అథ=ఎక్కారణమువలన ననుశయులకు వ్రీహ్యాది భావము తరువాతను రేతస్సిగ్యోగః=రేతస్సిగ్భావము (రేతస్సేకము చేయువానితోడి సంబంధము) "యో యో హ్యన్నమత్తి యో రేతస్సించతి తద్భూయ ఏవ భవతి" యను వాక్యమునఁ బఠింపఁబడుచున్నదో యాకారణమువలనను వ్రీహ్యాది సంశ్లేషమే వ్రీహ్యాదిభావము. భుజియింపఁబడుచున్న యన్నమున నున్న యనుశయికి ముఖ్యమైన రేతస్సిగ్భావము సంభవింపదు. చిరకాలమునకుఁ బూర్వము జన్మించినవాఁడును బ్రాప్తయావనుఁడునగు పురుషుఁడు రేతస్సేకముం జేయువాఁడగుచున్నాఁడు. అద్యమానాన్నానుగతుఁడగుననుశయి రేత

స్నిగ్భావము (రేతస్సేకకర్తృత్వము) ను నిరుపచరితము (=ముఖ్యము) గా నెట్లు పొందును? ముఖ్యమైనతద్భావము సంభవింపనియపు డవశ్యము రేతస్సేకముఁ జేయువానితోడి సంబంధమే రేతస్సిగ్భావమని యంగీకరింపవలెను. అట్లే వ్రీహ్యాది భావమును వ్రీహ్యాదియోగమే. కాఁబట్టి యవిరోధము.

సూ. యోనే శ్శరీరం. ౨౭

ప. యోనేః — శరీరం.

అ. అనుశయులకు యోనివలనఁ గర్మఫలోపభోగార్థము శరీరము పుట్టుచున్నదని శాస్త్రము చెప్పుచున్నది కాఁబట్టియు వ్రీహ్యాదిజన్మము తత్సంశ్లేషమాత్రమే.

భా. (అథ=రేతస్సిగ్భావమునకుం దరువాతను) రేతసు యోనియందు నిషిక్తమగుచుండఁగాను, యోనేః=యోని వలన ననుశయుల కనుశయఫలోపభోగార్థము, శరీరం=దేహము పుట్టుచున్నదని "తద్య ఇహ రమణీయచరణా" యను వది మొదలగు శాస్త్రము చెప్పుచున్నది యను కారణము వలన నవరోహమందు వ్రీహ్యాదిభావముం బొందునపుడు సుఖదుఃఖములతోఁ గూడిన యా శరీరమే సంభవింపఁ దని తోఁచుచున్నది. కాఁబట్టి యనుశయులకు (చంద్రమండలమునకుఁ గర్మఫలోపభోగార్థము పోయి భోగానంతర మింట ననుభవింపందగినఫలము గలకర్మముతో నటనుండి యాలోక

మునకు వచ్చు జీవులకు) వ్రీహ్యాదులతోడి సంశ్లేషమాత్రమే వ్రీహ్యాదిజన్మమని యీప్రకారము కర్మ్మలకుం గమనాగమనరూపమగు సంసారము దుర్వారమను ననుసంధానము వలనఁ గర్మ్మఫలమునుండి తత్త్వజ్ఞానసాధనమగు వైరాగ్యము సిద్ధించును.

ఇది షష్ఠాధికరణము.

---

—ఇది శ్రీమద్గోవిందభగవత్పాదశిష్య శ్రీమచ్ఛంకరభగవత్పాదకృత శారీరకమీమాంసాభాష్య తృతీయాధ్యాయ ప్రథమపాదాంధ్రీకరణము.

---

# ఆంధ్రసూత్రభాష్యము

## అధ్యాయము 3. పాదము ౨.

### సంధ్యాధికరణము ౧.

సూ. సంధ్యే సృష్టిరాహ హి. ౧

ప. సంధ్యే - సృష్టిః - ఆహ - హి.

అ. శ్రుతి చెప్పుచున్నది కాఁబట్టి స్వప్నమునందలి సృష్టి పారమార్థికమే.

భా. గతించిన పాదమునఁ బంచాగ్నివిద్య నుదాహరించి జీవుని సంసారగతిప్రభేదము ప్రపంచింపఁబడియె. ఈ పాదమున నతనిదేయగు నవస్థాభేదము ప్రపంచింపఁబడుచున్నది. ("నస్థానతోఽపి" యను సూత్రముదాఁక నవస్థాద్వారమునఁ ద్వంపదార్థమును దరువాతఁ బాదసమాప్తివఱకుఁ దత్పదార్థమును శోధింపఁబడును.) బృహదారణ్యకమునను "సయత్ర ప్రస్వపితి" యని యుపక్రమించి "నతత్రరథా

---

౧. బృ. ౬. 3. ౯. సః=ప్రకృతుఁడగు నాత్ముఁడు, యత్ర=ఏకాలమునను, ప్రస్వపితి = మిక్కిలి స్వాపము ననుభవించుచున్నాఁడో (యప్పుడు దేనిని స్వీకరించి యే ప్రకారముగా సంధ్య (=స్వప్న) స్థానముం బొందు

న రథయోగా నపంథానో భవంత్యథ రథాన్రథయోగాన్పథ
స్సృజతే " యనుదీనిం బఠించుచున్నారు. అందుఁ బ్రబోధ

---

మున్నాఁడం లేని చెప్పంబడుచున్నది. జాగ్రద్వాసనల గ్రహించి తానే యీ దేహమును నిశ్చేష్టముగాఁజేసి తానే వాసనామయమగు స్వప్నదేహమును నిర్మించికొని సర్వవాసనా స్వీకారలిప్తుఁడగు నంతఃకరణప్రకాశముతోడను దద్విషయి యగు తన తేజము (= ద్యానిం జూచునది యగు తన చైతన్యము) తోడను వాసనాత్మకమగు నంతఃకరణప్రకాశమును జూచుచు నుండును. ఇట్లుండుటయే ప్రస్వపితి యనుదానిచేఁ జెప్పంబడుచున్నది. అత్రయవస్థయందీయాత్ముఁడు స్వయంజ్యోతి ( = బాహ్యములు నాధ్యాత్మికములు నగు భూతములతోడను భౌతికములతోడను సంబంధము లేని జ్యోతి) యగుచున్నాఁడు.

అ. బృ. ౬. ౩. ౧౦. స్వప్నమునను జాగ్రదవస్థయందువలె నింద్రియములు నూర్యాద్యాలోకము విషయములు భాసిల్లుచున్నవి గదా యెట్లిటుఁ బ్రత్యేకముగా నాత్ముఁడు స్వయంజ్యోతియని చెప్పవచ్చుననిన జాగ్రదవస్థలో నాత్మజ్యోతి యింద్రియమనోబుద్ధ్యాలోకాదివ్యాపారములతో సంకీర్ణమైయుండును. స్వప్నమున నింద్రియములు వాని ననుగ్రహించుచు లోకాదికమును లేవు. కాఁబట్టి కేవలయాత్మజ్యోతియే యుండును. కనుక స్వప్నము జాగరితముకంటె విలక్షణము. విషయములు స్వప్నమునను గాన్పించుచున్నవి గదా యెట్లింద్రియాభావమువలన వైలక్షణ్యమంటేని వినుము. తత్ర = స్వప్నమునను, రథాః = రథములు (మొదలగు విషయములు), నభవంతి = లేవు. రథయోగాః = అశ్వములు మొదలగునవియు, న = లేవు. పంథానః = రథములు పోవఁదగిన మార్గములును, న = లేవు. అథ = పిమ్మటను, రథాన్ = రథములను, రథయోగాన్ = అశ్వములను, పథః = రథమార్గములను, స్పృజతే = ఆత్ముఁడు స్వయముగానే కల్పించుచున్నాఁడు. సః = ఆయాత్ముఁడు, హి = ఎక్కారణమువలనను, కర్తా = స్వప్నమందలి రథాదిసృష్టివిషయమై కర్తయో యాకారణమువలనఁ గల్పించుచున్నాఁడని యన్వయము.

మునందు (=జాగ్రదవస్థయందు)వలె స్వప్నమునందును సృష్టి పారమార్థికియా? మాయామయియా? యను సంశయము కలదు. స్వప్నదృష్టరథాదులు జాగ్రద్రథాదులువలె వ్యావహారికసత్త కలవియా? శుక్తిరజితమువలె భ్రాంతిమాత్రసిద్ధములా? యనుసంశయము కలదని యర్థము. అట్లు సంశయము కలుగుచుండఁగాను "సంధ్యే సృష్టి" యని పఠించుచున్నాఁడు. "సంధ్యం తృతీయం స్వప్నస్థాన" మని వేదమునం బ్రయోగము కాన్పించుటవలన సంధ్యము వా స్వప్నస్థానము. (మరణించువాని కింద్రియోపసంహారమువలన నీలోకమునందలి పదార్థముల యనుభవము లేనిది యగుచునుండఁగా వాసనామాత్రమున నిందలి పదార్థముల స్మరించుచున్న యతనికిఁ గర్మబలమువలన హృదయమున మానసపరలోకస్ఫూర్తియను స్వప్నము గలుగును. అది లోకద్వయసంధియం దగునుగాఁబట్టి సంధ్యమని చెప్పంబడుచున్నది.) ఈ లోకమునందలి పదార్థముల నొకపుడుం బరలోకమునందలి పదార్థముల నొకపుడుం జూచుటచే రెండులోకముల స్పృశించుటచేఁగాని, జాగ్రదవస్థకు నిద్రావస్థకు నడిమిదగుటచేఁగాని నిత్యస్వప్నమే సంధ్య మని (కొందఱు) చెప్పుచున్నారు. (కాని మొదటిది శాస్త్రీయము గనుక నిట రెండవదియే గ్రహింపఁబడుచున్నది.) సంధ్యే సృష్టిః = అట్టి స్వప్నస్థానమం

దలి సృష్టి తథ్యమైనదియే యగుచున్నది. ఏకాకారణము వలన నంటేని, హి=ఏకాకారణమువలనను "అథరథాన్రథయోగాన్పథస్సృజతే" యని ప్రమాణభూత మగుశ్రుతి, ఆహ = చెప్పుచున్నదో యాకారణమువలనను. మఱియును "సహి కర్తా" యను నుపసంహారమువలన నట్లే తోఁచుచున్నది.

సూ. నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ. ౨.

ప. నిర్మాతారం - చ - ఏకే - పుత్రాదయః - చ.

అ. స్వప్నావస్థయందుఁ గామముల నిర్మించువాఁడు పరమాత్ముఁడని కఠశాఖవారు పఠించుచున్నారు కాఁబట్టియు నప్పటిసృష్టి తథ్యమైనదియే. అటఁ గామములు పుత్త్రాదులు.

భా. మఱియును, ఏకే = కొందఱు (=కఠశాఖవారు) నిర్మాతారం = ఈ సంధ్యముననే కామాదుల నిర్మించువానిని బరమాత్ముఁడుగాను "య ఏష సుప్తేషు జాగర్తి కామంకామం

---

౧. క. ౨. ౫. ౮. యః - ఏషః - పురుషః = ఏ యీ పురుషుఁడు, ప్రాణేషు = ఇంద్రియములు మొదలగునవి, సుప్తేషు = నిద్రించుచున్నవి యగుచు నుండఁగాను, వ్యాపారశూన్యము లగుచునుండఁగాను, కామం - కామం = ఆయా కోరంబడిన పదార్థమును, నిర్మిమాణః - జాగర్తి = అవిద్యచే నిష్పాదించుచు మేల్కొనుచున్నాఁడో, (తదేవ = అదియే, శుక్రం - పరిశుద్ధమును, తత్ = అదియే, బ్రహ్మ = స్వయంప్రకాశమును, తదేవ = అదియే, అమృతం = అవినాశియు నని, ఉచ్యతే = శాస్త్రములం జెప్పంబడుచున్నది. మఱియును, లోకాస్సర్వే = భూమి మొదలగు లోకము లన్నియును, తస్మిన్, ఆ బ్రహ్మమునందే, శ్రితాః = (కారణమగుటవలనను) ఆశ్రయించి యున్నవి. కనుక సర్వాత్మకము, తదు = ఆ బ్రహ్మమే. కశ్చన = ఒకానొకఁడును, నాత్యేతి = బ్రహ్మత్వమును విడిచి, యన్యత్వముం బొందఁజాలఁడు.)

పురుషో నిర్మిమాణ” యను వాక్యమునఁ బలికిచుచున్నారు పుత్త్రాదయశ్చ=పుత్త్రాదులే “కామ్యంతే” యను (కోరం బడుచున్నారను) వ్యుత్పత్తిచే నందలి కామము లని తలంపఁ బడుచున్నవి. అయ్యా! కామశబ్దముచే నిచ్ఛావిశేషము చెప్పంబడవలయు నంటేని “శతాయుషః పుత్త్ర పౌత్త్రాన్ వృణీష్వ” యనీ యారంభించి యంతమునను “కామానాం త్వా కామభాజం కరోమి” యని ప్రకృతములగు, పుత్త్రాదులందుఁ గామశబ్దము ప్రయోగింపఁబడినది యగుటవలన నట్లు కాదు. ప్రకరణమువలనను వాక్యశేషమువలన నీ నిర్మాత ప్రాజ్ఞుఁ డని తెలిసికొనుచున్నారము. “అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మాదన్యత్రాస్మాత్కృతా కృతాత్త” ను నిది ప్రాజ్ఞుని ప్రకరణము గదా! “తదేవశుక్రం తద్బ్రహ్మ తదేవామృత

---

౧. క. ౧. ౨౩. శతాయుషః = నూఱేండ్లాయువు కల, పుత్త్ర పౌత్త్రాన్=కుమారులను, మనుమలను, వృణీష్వ = కోరుము. (ఓ నచికేతుఁడా! ఇటియు దీర్ఘాయువు మొదలగుదాని దేనినైనం గోరుము.) త్వా = నిన్నుక, కామానాం=ఎల్ల కామ్యములకును, కామభాజం=కామార్హునిగాను, కరోమి = చేయుచున్నాను. నేను సత్యసంకల్పుఁడ నగుదేవుఁడను గనుక నీవు కోరినవాని నెల్ల నిచ్చెదను. ఇదివఱకుఁ గావించిన యాత్మవిషయమైన ప్రశ్నమును మానుకొమ్మని యముఁడు నచికేతునితోఁ బ్రలోభ వాక్యము చెప్పెను.

౨. క. ౨. ౧౪. ప్రథమాధ్యాయ, తృతీయపాదమున శబ్దాధికరణమున వ్యాఖ్యాతము.

ముచ్యతే తస్మిన్ లోకాశ్శ్రితాస్సర్వే తదునాత్యేతికశ్చన" మను వాక్యశేషమును ప్రాజ్ఞవిషయమే. జాగరితాశ్రయ మగు ప్రాజ్ఞనిర్మిత మైన సృష్టి తథ్యమైనదని తెలియంబడు చున్నదియును. అట్లే స్వప్నాశ్రయమైన సృష్టి యును గావచ్చును. "అథో ఖల్వాహుర్జాగరితదేశ ఏవా స్యైష" మనియును "యాని హ్యేవజాగ్రత్పశ్యతితాని సుషుప్త" యని యును శ్రుతి స్వప్నావస్థకును జాగ్రదవస్థకును సమానన్యాయ త్వమును వినిపించుచున్నది. స్వప్నజాగరితములు సమాన దేశములనియును స్వప్నజాగరితజ్ఞానము లేకార్థము లనియును శ్రుతి వినిపించుటవలన జాగ్రద్వస్తువులువలెనే స్వప్నవస్తువు లును సత్యములని ప్రాప్తింపఁగా నిరాకరించుచున్నాఁడు.

సూ. మాయామాత్రం తు కార్త్స్న్యే నానభివ్యక్తస్వరూప త్వాత్. 3

ప. మాయామాత్రం - తు - కార్త్స్న్యేన - అనభి వ్యక్తస్వరూపత్వాత్.

---

౧. బృ. ౬. 3. ౧౪. అథోఖలు=అథో - అపి - ఖలు - అస్య = మఱియుం గొందఱు, అస్య - ఏషః=ఈ యాత్మని స్వప్నము, జాగరిత దేశ ఏవ=జాగ్రదవస్థగల చోటనే యగుచున్నదని, ఆహుః = చెప్పుచున్నారు. (అట హేతువుం జెప్పుచున్నారు.) జాగ్రత్ = జాగ్రదవస్థలోనున్న లౌకి కుఁ డాయవస్థయందు, యాన్యేవ=ఏ వస్తువులనే, పశ్యతి=చూచుచున్నాఁ డో, సుప్తః=నిద్రించువాఁడు, తాని=వానినే, పశ్యతిహి =చూచుచున్నాఁ డను కారణమువలన నట్లు చెప్పుచున్నా రని యర్థము.

అ. స్వప్నసృష్టి (స్వప్నమందలి రథాదికము) సంపూర్ణమగు వస్తుధర్మములతో నభివ్యక్తమైన స్వరూపము గలది కాకపోవుటవలన మాయామాత్రమే.

భా. స్వప్నావస్థయందలిసృష్టి పారమార్థికమని యెద్ది చెప్పంబడినదో యది తగదని "తు" శబ్దము పూర్వపక్షమును వారించుచున్నది. మాయామాత్రం=సంధ్యమునందలి సృష్టి మాయామయియేకాని సత్యగంధమైన నటలేదు. శుక్తిరజతమువలెఁ గాన్పించునంతటిదియె కాని వ్యవహారార్హమై కాదని యర్థము. దేనివలన నంటేని, కార్త్స్న్యేన - అనభివ్యక్తస్వరూపత్వాత్ = స్వప్నవస్తువు సంపూర్ణముగాఁ బరమార్థవస్తుధర్మములతో నభివ్యక్తమైన స్వరూపము కలది కాకపోవుటవలనను. ఇటఁ గార్త్స్న్య మనునది యెద్దియని తలంపఁబడుచున్నదనిన దేశకాలనిమిత్తసంపత్తియు నబాధమును. పరమార్థవస్తువిషయము లగు దేశకాలనిమిత్తములు నబాధమును స్వప్నమునందు సంభవింపవుగదా! రథాదుల కుచితమైన దేశము స్వప్నమందు సంభవింపదు. ఇఱుకట మగు దేహదేశమునందు రథాదు లిముడంజాలవు. (అయ్యా!) దూరదేశమునందలి ద్రవ్యముల గ్రహించుటవలన దేహముకంటె వెలుపలనే స్వప్న (పదార్థ) ములఁ జూడఁగలఁ డను నిది

కావచ్చును. "బహిష్కులాయా దమృతశ్చరిత్వా స ఈ యతే ఽమృతో యత్ర కామ" మ్మన్నశ్రుతియు దేహము కంటె వెలుపలనే స్వప్నముం జూపుచున్నది. జంతువు దేహమునుండి బయలు వెడలనిది యగుచునుండఁగా స్థితిగతి ప్రత్యయభేదము (=సిల్చుట పోవుట యను వ్యవహారభేదము) ను సామంజస్యమును బొందదనిన సుప్తుఁడగు జంతువునకు క్షణమాత్రమున యోజనశతవ్యవధానము గల దేశమునకుఁ బోవ నటనుండి రాను సామర్థ్యము సంభావింపఁబడదు కాఁబట్టి యట్లు కాదని చెప్పంబడుచున్నది. ఒకానొకపుడు (నిద్రనుండి మేల్కొన్నవాఁడు దగ్గఱివారితో) నేను గురుదేశములందు శయనించినవాఁడ నగుచు నిద్రచే నభిభూతుఁడ నై పంచాల దేశములకుంబోయి యటనే మేల్కొంటి నని ప్రత్యాగమనమును వినాగనే స్వప్నమును వినిపించుచున్నాఁడు. దేహము నుండి వెడలిపోయెనేని యతఁడు పంచాలదేశములకుం బోయినవాఁడు కాఁబట్టి యాదేశములందే ప్రతిబుద్ధుఁడు కావలెను.

---

౧. బృ. ఉ. ౩. ౧౨. (చైతన్యస్వభావము గల పురుషుఁడు పంచవృత్తులు గల ప్రాణముచే నిర్వృత్త మగు నీశరీరమును మృతభ్రాంతి లేకుండఁగాపాడుచున్నవాఁడై) అమృతః = తాను మరణధర్మములేనివాఁడై, కులాయాత్ = శరీరముకంటెను, బహిః = వెలుపలను, చరిత్వా = సంచరించి, యత్ర = ఏవిషయమునను, (కామః = కోర్కిగలదో) కామం = వాసనారూపమున సద్భూతమగు నాయా విషయమును, ఈయతే = పొందుచున్నాఁడు.

కాని కురుదేశములందే మేల్కొనుచున్నాఁడు. ఏదేహముతో నితఁడు దేశాంతరమునకుఁ బోవుచున్నట్లు తలఁచుచున్నాఁడో యా దేహమును బ్రక్కనున్నవారు శయనించిన చోటనే చూచుచున్నారు. స్వప్నమున నితఁ డెట్టి దేశాంతరములనే చూచుచున్నాఁడో యవి యట్టివే కావు. పరువెత్తుచుంబోయి (= దేహమునుండి దేశాంతరమునకుఁ బోయి) చూచునేని జాగ్రదవస్థయందువలె సత్యమైన వస్తువునే చూడవలెను. శ్రుతి "సయత్ర తత్స్వప్నయాచరతి" యని యుపక్రమించి "స్వేశరీరే యథాకామం పరివర్తతే" యని దేహములోపలనే స్వప్నముం జూపుచున్నది. కాఁబట్టి శ్రుతికి నుపపత్తికిని విరోధమువలన "బహిష్కులాయా దమృతశ్చరిత్వా" యను శ్రుతి "బహిరివకులాయాదమృతశ్చరిత్వా" యని = ఎవఁడు శరీరమున నున్నను దానితో నేప్రయోజ

---

౧. బృ. ౪. ౧. ౧౨. సః = ప్రకృతుఁడగు నాత్ముఁడు, యత్ర = ఏకాలమునను, ఏతత్స్వప్నయా = ఈ దర్శనలక్షణ మగు స్వప్నవృత్తితోడను, చరతి = ఉండునో, (యపుడు కర్మఫలములు సంభవించును.) (మహారాజు తన భృత్యులు మొదలగు ప్రజలం దీసికొని తనదేశమున నిచ్ఛానుసారముగాఁ బ్రవర్తించునో యట్లే యీ విజ్ఞానమయుఁడు నింద్రియముల నాకర్షించి) స్వేశరీరే = తన శరీరముననే, యథాకామం = ఇచ్ఛానుసారముగాను, పరివర్తతే = విహరించుచుండును. కామకర్మములచే నుద్భావితములును మున్ననుభవింపంబడినవస్తువులం బోలినవియు నగువాసనల ననుభవించుచుండు నని యర్థము.

నముం జేయఁడో యతఁడు శరీరముకంటె వెలుపలనున్న వాఁడు వలె నుండుననను హేతువువలనను - గౌణిగా వ్యాఖ్యానింపం దగినది. ఇట్లు శ్రుతియుక్తులచే స్వప్నము దేహములోపలనే యగుచు నుండఁగా స్థితిగతిప్రత్యయభేదమును విభ్రమమే యని యంగీకరింపవలెను. రజనియందుఁ బరున్నవాఁడు భారతవర్షముననే పగటింజూచుచున్నాఁడు. అట్లే ముహూర్తమాత్రమందుండు స్వప్నమున నొకానొకపు డనేకము లగు వర్షసముదాయములను వెళ్లఁబుచ్చుచున్నాఁడును. కాఁబట్టి స్వప్నమునఁ గాలవిసంవాదము (=కాలవిరోధము)ను గలదు. మఱియును స్వప్నమున నిమిత్తములు సైతము బుద్ధికిఁ గాని కర్మమునకుఁ గాని తగినవి కాన్పింపవు. ఇంద్రియోపసంహారమువలన స్వప్నద్రష్టకు రథాదివిజ్ఞానమునకుం దగిన చక్షురాదులు లేవు. ఇతనికి నిమిషమాత్రమున రథాదినిర్మాణమునందుఁ గాని దారుసంపాదనమునందుఁ గాని సామర్థ్య మెట్లు సంభవించును? సంభవింపదు. ఇంతయె కాక స్వప్నదృష్టములగు నీ రథాదిపదార్థములు ప్రబోధమునందు బాధింపఁబడుచున్నవి. ఇవి యాద్యంతములందు వ్యభిచారము (=తొలఁగియుండుట) కాన్పించుటవలన స్వప్నమునందే సులభబాధములు నగుచున్నవి. ఒకానొకపుడు స్వప్నమున నిది రథమని నిశ్చయింపఁబడినది క్షణమాత్రమున మనుష్యుఁ

డగును. మనుష్యుఁడని నిశ్చయింపఁబడినది క్షణమాత్రమున వృథమగును. "న తత్ర రథా న రథయోగా నపంథానో భవంతి" యనునది మొదలగు శాస్త్రము స్వప్నమున రథాద్యభావమును స్పష్టముగా వినిపించుచున్నదియును. కాఁబట్టి= యోగ్యదేశకాలనిమిత్తాదులు లేకపోవుటవలన స్వప్నపదార్థదర్శనము మాయామాత్రమే.

(అవ. స్వప్నము భ్రాంతిమాత్ర మయ్యెనేని దానిచే సూచింపంబడిన వస్తువు నైత మసత్యమే కావలె నను శంక కలుగుచుండఁగా దాని నివారింప నీ సూత్రము చెప్పంబడుచున్నది.)

సూ. సూచకశ్చ హి శ్రుతే రాచక్షతే చ తద్విదః. ౪

ప. సూచకః - చ - హి - శ్రుతేః - ఆచక్షతే - చ - తద్విదః.

అ. శ్రుతివలన స్వప్నము రాఁబోవు శుభాశుభముల సూచించునది యగుచున్నది. స్వప్నాధ్యాయము నెఱింగిన వారు నట్లు చెప్పుచున్నారు. కాని సూచింపఁబడుచున్న వస్తువు సత్యమే యైనను సూచకము మిథ్యయే.

భా. మాయామాత్ర మగుటవలన స్వప్నమునందుఁ గొంచెమైనం బరమార్థగంధము లేదా యనిన లేకపోలేదని చెప్పంబడుచున్నది. స్వప్నము, సూచకశ్చ=రాఁగల శుభా

శుభములను సూచించునది యగును. (సూచించునది యగు నవి దేనివలనం దెలియునంటివి) శ్రుతేః = శ్రుతివలనను. తథాహి = అట్లేకదా! "యదాకర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి సమృద్ధిం తత్ర జానీయాత్తస్మిన్స్వప్న నిదర్శనే" యను శ్రుతి యిట్టిస్వప్నముచే సాఫల్యాగమము(=శుభాగమనము) నట్లే "పురుషం కృష్ణం కృష్ణదంతం పశ్యతి సఏనం హంతి" యనునది యిట్టిస్వప్నములచే నచిరజీవిత్వమును దెలుపంబడుచున్నది యని వినిపించుచున్నవి. తద్విదః = స్వప్నాధ్యాయము నెఱింగినవారు, స్వప్నమునఁ గుంజరారోహణాదులు ధన్యములనియు ఖరయానాదు లధన్యములనియును, ఆచక్షతేచ = చెప్పుచున్నారును. మంత్రమును, దేవతానుగ్రహము, నౌషధసేవయు నిమిత్తముగాఁ గల కొన్ని స్వప్నములు సత్యార్థగంధము గలవగుచున్నవని తలంచు

౧. ఛాం. ౫. ౨. ౯. కామ్యేషు-కర్మసు = కామ్యకర్మములందుఁ, తస్మిన్ - స్వప్ననిదర్శనే = ప్రశస్తమగు స్వప్నము గలుగుచుండఁగాను, స్వప్నేషు = స్వప్నకాలములందు, యదా = ఎపుడు, స్త్రియం = స్త్రీని, పశ్యతి = (ఆకర్మము జేయుచున్నవాఁడు) చూచునో (యపుడు) తత్ర = ఆకర్మమునను, సమృద్ధిం = ఫలనిష్పత్తిని, జానీయాత్ = తెలిసికొనునది. కామ్యకర్మములం జేయునపుడు స్వప్నమున స్త్రీలం జూచినచో కర్మఫలము సిద్ధించునని తెలియవలెనని యర్థము.

౨. ఋ. కృష్ణదంతం = నల్లనిపండ్లుగల, కృష్ణం - పురుషం = నల్లపురుషుని, పశ్యతి (చేత్) = స్వప్నమునం జూచునేని, సః = ఆపురుషుఁడు, ఏనం = ఈ చూచినవానిని, హంతి = హింసించుచున్నాఁడు.

చున్నారు. స్వప్నము సత్యార్థమును సూచించునది యైనను సూచ్యమానమగు వస్తువునకు సత్యత్వ మున్న నుండవచ్చును గాని సూచకమగు స్త్రీదర్శనాదులు బాధింపఁబడుచున్నవి యగుటవలన వానికి వైతథ్యమే యగుచున్నదియని యభిప్రాయము. (సత్య మగు హర్షమునకుం గారణమైన శుక్తి రూప్యమున కసత్యత్వము కాన్పించుటవలన నని భావము) కాఁబట్టి స్వప్నమునకు మాయామాత్రత్వ మూపపన్నము. పూర్వోక్త న్యాయమున స్వప్నము మాయామాత్ర మగుచుండఁగాను "ఆహహి" యని (శ్రుతి చెప్పుచున్నది కాఁబట్టి స్వప్నసృష్టి పారమార్థిక మని) యెద్ది చెప్పఁబడినదో యది భాక్త మని (గౌణ మని) వక్కాణింపవలెను. ఎట్లు (కృష్యాదిద్వారమున జీవన) నిమిత్తమాత్ర మగుటవలనను "లాంగలంగవాదీ నుద్వహాతి" యని (నాఁగలి గోవులు మొదలగువానిం జీవింపఁ జేయుచున్న దని) చెప్పంబడుచున్నది గాని ప్రత్యక్షముగానే లాంగలము గవాదుల నుద్వహింపదో యట్లే నిమిత్తమాత్ర మగుటవలన "సృజతే, సహికర్తా" యనియుఁ జెప్పంబడుచున్నాఁడు గాని సుప్తుఁడు ప్రత్యక్షము గానే రథాదుల సృజియింపఁడు. అతనికి నిమిత్తత్వము రథాది ప్రతిభానము నిమిత్తముగాఁ గల మోదత్రాసములు గాన్పించుటవలన వానికిఁ గారణభూతము లగు సుకృతదుష్కృత

ములకుఁ గర్త యగుటచేఁ జెప్పవలసి యున్నది. మఱియు జాగ్రదవస్థయందు విషయేంద్రియ సంయోగమువలనను సూర్యాదితేజస్సాంకర్యమువలన నాత్మునకు స్వయంజ్యోతిష్ట్వము(=స్వయంప్రకాశత్వము) దుర్వివేచనమని దాని వివేచింప స్వప్న ముపన్యసింపఁబడినది.[1] అందు రథాదిసృష్టివచనము శ్రుతిచే (దాత్పర్యమునఁ) జెప్పంబడుదేని (జాగ్రదవస్థకంటె విశేషము లేకపోవుటవలన) స్వయంజ్యోతిష్ట్వము నిర్ణయింపఁబడినది కాకపోవును గాఁబట్టి రథాదులు లేవని చెప్పు శ్రుతిచేతనే రథాది సృష్టివచనము గౌణమని వ్యాఖ్యేయము. ఇట్లనుటచే (=రథాదులను సృజియించుచున్నాఁడను వచనము గౌణమని స్వీకరించుటచేతను) నిర్మాణశ్రవణము గౌణమని వ్యాఖ్యానింపంబడినదియే యగును. "ప్రాజ్ఞ మేనం నిర్మాతార మాహు రన్తి" యని (స్వప్నావస్థయందుఁ గామముల నిర్మించువాఁడు పరమాత్ముఁడని) యెద్ది చెప్పంబడినదో యది యును "స్వయం విహత్య స్వయం నిర్మాయ స్వేన భాసా

---

౧. బృ. ఉ. ౩. ౯. (ఈ యాత్ముఁడు జాగ్రద్వాసనల గ్రహించి) స్వయం=తానే, (జాగ్రద్దేహమును) విహత్య=నిశ్చేష్టముగాఁ జేసి, స్వయం తానే, నిర్మాయ=వాసనామయమగు స్వప్నదేహమును నిర్మించుకొని, స్వేన-భాసా=తనబుద్ధివృత్తి ప్రకాశముచేతనను, స్వేనజ్యోతిషా=స్వరూపచైతన్యముచేతనను, ప్రస్వపితి=స్వప్నము ననుభవించుచున్నాఁడని యర్థము.

"స్వేన జ్యోతిషా ప్రస్వపితి" యను వేఱొక శ్రుతియందు జీవవ్యాపారము వినంబడుటవలన యుక్తము కాదు. ఇటులను "య ఏష సుప్తేషు జాగర్తి" యని ప్రసిద్ధు ననువదించుటవలన నీ జీవుఁడే కామముల నిర్మించువాఁ డని కీర్తింపఁబడుచున్నాఁడు. వాక్యశేషముచేత నటని కే—"తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే" యనువాక్యముచేతను "తత్త్వ మసి" త్యాదులచేతను వలె జీవభావమును దొలఁగించి బ్రహ్మభావము నుపదేశింపఁబడుచున్నది. కాఁబట్టి (జీవుఁడు చెప్పఁబడినను) బ్రహ్మప్రకరణము విరోధింపదు. ప్రాజ్ఞుఁడు సర్వేశ్వరుఁ డగుటవలన నెల్ల యవస్థలయందు నధిష్ఠాతృత్వ ముపపన్నమె కాఁబట్టి, స్వప్నమునందును ప్రాజ్ఞవ్యాపారము మాచే నిషేధింపఁబడదు. కాని యీ స్వప్నాశ్రయమైన సర్గ మాకాశాది సర్గమువలెఁ బారమార్థిక మైనది. (=వ్యవహారమందు బాధ లేనిది) కా దనునంతమాత్రమే ప్రతిపాదింపఁబడుచున్నది. వియదాదిసర్గమునకు నాత్యంతిక మైన సత్యత్వము లేదు. "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" యను సూత్రముకడ నెల్ల ప్రపంచమునకు మాయామాత్రత్వము ప్రతిపాదింపఁబడినది గదా! బ్రహ్మాత్మజ్ఞానమునకుం బూర్వము వియదాది ప్రపంచము వ్యవస్థితరూప (=నిశ్చితరూప) మగుచున్నది. సంధ్యాశ్రయ మైన ప్రపంచము దినదినము బాధింపఁబడు

చున్నది. కాబట్టి స్వప్నమున కీమాయామాత్రత్వము విశేష ప్రాప్తమైనది చెప్పంబడినది.

సూ. పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బంధవిపర్యయౌ. ౫

ప. పరాభిధ్యానాత్ - తు - తిరోహితమ్ - తతః - హి - అస్య - బంధవిపర్యయౌ.

అ. జీవుఁ డీశ్వరాంశమే కాబట్టి యతని సంకల్పము వలనను రథాదిసృష్టి కావచ్చుననిన నతని యనైశ్వర్యాదికము ప్రత్యక్షమగుటవలన నట్లనరాదు. ఈశ్వరునివలననే జీవునికి బంధమోక్షము లగుచున్న వని శ్రుతి చెప్పుచున్నది కాబట్టి యవిద్యాదివ్యవధానమువలన నంతర్హితమైన యతని యైశ్వర్యాదిక మీశ్వరానుగ్రహమువలన నొకానొకనికే యావిర్భవించునుగాని స్వభావమువలననే యెల్లవానికి నావిర్భవింపదు.

(అవ. తగిన నిమిత్తము లేకపోవుటవలన స్వప్నము మిథ్య యని యెద్ది చెప్పంబడినదో యది జీవసంకల్పముచేతనును సత్యసృష్టి సంభవించుటవలన యుక్తము కాదని శంకించుకొని పరిహరింప సూత్రమును పఠించుచున్నాఁడు.)

భా. పూర్వము చెప్పంబడిన రీతిచే స్వప్నమునకు మిథ్యాత్వము చెప్పంబడినను విస్ఫులింగ మగ్నియొక్క యం

శమే యైనట్లు జీవుఁడు పరమేశ్వరుని యంశమే యగును. జీవుఁ డీశ్వరాంశ మనునది శ్రుతిస్మృతిప్రసిద్ధ మగుచుండఁగా నె ట్లగ్ని విస్ఫులింగములకు దహన ప్రకాశన శక్తులు సమానములో యట్లే జీవేశ్వరులకును జ్ఞానైశ్వర్యశక్తులు సమానములే యగుచున్నవి కాఁబట్టి జీవుని యైశ్వర్యవశము వలన స్వప్నమునందలి రథాదిసృష్టి సంకల్పసిద్ధ మైనది కావచ్చు ననిన నిటఁ జెప్పంబడుచున్నది. జీవేశ్వరుల కంశాంశిభావ మున్నను జీవున కీశ్వరధర్మముకంటె విపరీతధర్మము (= అసత్యసంకల్పము) కలిమి ప్రత్యక్షమే. (కాఁబట్టి యతని సంకల్పమువలన రథాదిసృష్టి కాదు.) జీవున కీశ్వర సమానధర్మ మేదియు లేదా యనిన లేకపోలేదుగాని యున్నదని యవిద్యాదివ్యవధానమువలనను, తిరోహితం = మఱుఁగు పడినది. పరాభిధ్యానాత్తు = అంతర్హిత మగుచు నది పరమేశ్వరుని ధ్యానించుచు యతనము చేయుచున్న నిష్పాపుఁడగు వాని కౌషధవీర్యమువలనఁ దిమిరతిరస్కృత మైన దృక్శక్తివలె నీశ్వర ప్రసాదమువలన నణిమాదులు గల యొకానొకనికే యావిర్భవించునుగాని స్వభావమువలననే యెల్లజంతువులకు నావిర్భవింపదు. తతోహి = ఆ యీశ్వరుఁ డను కారణమువలననే, అస్య-బంధవిపర్యయౌ=ఈ జీవునకు బంధమోక్షము లగుచున్నవి. ఈశ్వరస్వరూపాపరిజ్ఞానమువలన

బంధమును దత్స్వరూపజ్ఞానమువలన మోక్షమునగుచున్నది. "జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః తస్యాభిధ్యానాత్తృతీయం దేహభేదే విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామ" యనునది మొదలగు శ్రుతి యట్లే చెప్పుచున్నది.

(అవ. మీఁదఁ జెప్పఁబడిన మైశ్వర్యతిరోభావము దేహాభిమానహేతుక మని చెప్ప నీ సూత్రము రచియింపఁబడెను.)

సూ. దేహయోగాద్వా సోపి. ౬.

---

౧. శ్వే. ౧. ౧౧. (సేసే బ్రహ్మమ నని) దేవం=పరమేశ్వరుని, జ్ఞాత్వా = సాక్షాత్కరించికొని, (యున్నవానికి) సర్వపాశాపహానిః = అవిద్యాదిక్లేశములన్నిటినాశమునగును. క్షీణైః క్లేశైః = క్లేశములుక్షయించినవి యగుచునుండఁగాను, జన్మమృత్యుప్రహాణిః = క్లేశకార్యమగు జన్మమరణాత్మకబంధమునకు ధ్వంసము (అగు నని నిర్గుణవిద్యాఫలము చెప్పంబడెను.) తస్య = ఆ పరమేశ్వరునియొక్క, అభిధ్యానాత్ = అభిముఖ్యధ్యానము (= అహంగ్రహోపాసనము) వలనను, తృతీయం = బంధమోక్షముల నపేక్షించికాని, మంత్రములోనిహానిద్వయము నపేక్షించికాని మూడవది యగు విశ్వైశ్వర్యం = అణిమాదిసంపద, దేహభేదే = మర్త్యదేహము పడిపోయిన తరువాత సిద్ధదేహమునందు సంభవించును. (ఆ యైశ్వర్యము ననుభవించిన తరువాత ఆత్మజ్ఞానమువలనను) కేవలః = ద్వైతశూన్యుఁడును, ఆప్తకామః = పొందఁబడినయానందముఁ గలవాఁడు నగుచున్నాఁడని క్రమముక్తి (= సగుణవిద్యాఫలము) చెప్పంబడినది.

౬. దేహయోగాత్ - వా - సః - అపి.

అ. జీవుని జ్ఞానైశ్వర్యతిరోభావము దేహాదిసంబంధము వలననే యగుచున్నది.

భా. ఏకారణమువలన జీవుఁ డీశ్వరాంశమే యగుచుఁ దిరస్కృతజ్ఞానైశ్వర్యములు గలవాఁడగును? విస్ఫులింగమునకు దహనప్రకాశములువలె (జీవునకు) జ్ఞానైశ్వర్యము లతిరస్కృతములగుట న్యాయము కదా యనిన నిటఁ జెప్పఁబడుచున్నది. ఇది సత్యమే. కాని, సోఽపి = జీవుని జ్ఞానైశ్వర్యతిరోభావమును, దేహయోగాత్ = స్థూలసూక్ష్మదేహములయు మనోబుద్ధులయు సుఖదుఃఖాదులయు సంబంధమువలన నగుచున్నది. ఎట్లగ్నికి దహనప్రకాశసంపన్నమగుదానికి నరణిగతమైనదానికి దహనప్రకాశములంతర్హితము లగుచున్నవో యెట్లు భస్మముచే మఱుఁగుపడినదానికి దహనప్రకాశములు తిరోభవించుచున్నవో యట్లే యవిద్యాప్రత్యుపస్థాపితములైన నామరూపములచేఁ జేయఁబడిన దేహాద్యుపాధిసంబంధమువలన జీవునకుఁ దదవివేకభ్రమకృతమైన జ్ఞానైశ్వర్యతిరోభావము కావచ్చును. వా శబ్దము జీవేశ్వరుల కన్యత్వవ్యావృత్త్యర్థము. జీవేశ్వరులకు భేదమును వారించుచున్నదని యర్థము. అయ్యా! తిరస్కరింపఁబడిన జ్ఞానైశ్వర్యములు గలవాఁడగుటవలన జీవుఁ డీశ్వరునికంటె వేఱొకఁడు కావచ్చును;

దేహసంబంధకల్పనతో నేమి యనినఁ గాఁ దని చెప్పంబడు
చున్నది. "సేయందేవతైక్షత"[1] యని యుపక్రమించి
"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" యను చోట నాత్మ
శబ్దముచే జీవునిం బరామర్శించుటవలన నీశ్వరునికంటె జీవున
కన్యత్వ ముపపన్నము గాదు. మఱియును "తత్సత్యం స
ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో"[2] యను వాక్యమున జీవున
కీశ్వరాత్మత్వమును (శ్రుతి) యుపదేశించుచున్నది. కాఁబట్టియు
జీవుఁ డీశ్వరునికంటె ననన్యుఁడే యగుచు దేహసంబంధము
వలనఁ దిరోహితమైన జ్ఞానైశ్వర్యములు కలవాఁడగుచున్నాఁడు.
కాఁబట్టియు జీవునకు స్వప్నమున సాంకల్పికి యగు రథాది
సృష్టి ఘటిల్లదు. మఱియును స్వప్నమున (జీవుని) సంకల్ప
మువలన రథాదిసృష్టి ఘటిల్లునేని యనిష్టమగు స్వప్నము నే
వాఁడుం జూడకయే పోవలెను. ఏవాఁడు ననిష్టమును సంక
ల్పింపఁడుగదా! "జాగరితదేశ" శ్రుతి స్వప్నమునకు సత్య
త్వముం బ్రకటించుచున్నది యని యెద్ది చెప్పంబడినదో యా
సామ్యవచనము స్వయంజ్యోతిష్ట్వ విరోధమువలనను, శ్రుతి
చేతనే రథాద్యభావము చూపంబడుటవలనను సత్యత్వాభి
ప్రాయము కాదు. మఱేయభిప్రాయము కలది యనిన స్వప్నము

---

౧. ఛాం. ౬. ౩. ౨ } ప్రథమాధ్యాయమున ఈక్షత్యధికరణమున
౨. ఛాం. ౬. ౮. ౭ } వ్యాఖ్యాతములు.

జాగరితమునందుఁ గలిగిన వాసనానిమిత్త మగుటవలన నది జాగ్రత్తుల్య భానాభిప్రాయము. (జాగ్రదవస్థతో సమాన మైన భానము కలదను నభిప్రాయము నిచ్చునది.) కాఁబట్టి స్వప్నమునకు మాయామాత్రత్వ ముపపన్నము.

ఇది ప్రథమాధికరణము.

---

తదభావాధికరణము. ౨

సూ. తదభావో నాడీషు తచ్ఛ్రుతే రాత్మని చ. ౭

ప. తదభావః - నాడీషు - తచ్ఛ్రుతేః - ఆత్మని - చ.

అ. నాడులు మొదలగువాని కటనట సుప్తిస్థానత్వము వినంబడుటవలన జీవునకు సుషుప్తి నాడులందుం బురీతత్తు నందుఁ బరమాత్మునందు నగుచున్నది. నాడీపురీతద్ద్వార మునఁ బరమాత్మునందే సుప్తియగుచున్న దని యర్థము.

భా. స్వప్నావస్థ పరీక్షింపఁబడినది. ఇపుడు సుషుప్త్య వస్థ పరిశోధింపఁబడుచున్నది. సుషుప్తి చింతా ప్రస్తావమున సుప్తివిషయము లగు నీ క్రిందిశ్రుతులు గలవు. "తద్యత్రై

---

౧. ఛాం. ౮. ౬. 3. తత్ = తత్ర = నాడీస్వరూప మిట్లు నిరూపింపఁబడినది యగుచుండఁగాన్, యత్ర = ఏకాలమునను, ఏతత్ = నిద్రకలుగునట్లుగాను, సుప్తః = నిద్రించినవాఁడును, సమస్తః = ఉపసంహారింపఁబడిన బాహ్యేంద్రియవ్యాపారము కలవాఁడు కనుక నే (విషయసంపర్కము వలని కాలుష్యము లేనివాఁడై) సంప్రసన్నః = మిక్కిలి నిర్మలుఁ డగుచున్నవాఁడు కాఁబట్టి స్వప్నం = స్వప్నమును, నపశ్యతి = అనుభవింపఁడో, తదా =

తత్సుప్త స్సమస్త స్సంప్రసన్న స్స్వప్నం న విజానాత్యాసు తదా నాడీషు సృప్తో భవతి" యనునది యొకానొకచో వినం బడుచున్నది. వేఱొకచో నాడుల నుపక్రమించి "తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే" యని చెప్పంబడుచున్నది. అట్లే మఱియొక చోట నాడులనే చెప్ప నారంభించి "తాసు తదా భవతి యదా సుప్తస్స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి" యని పఠింపఁబడుచున్నది. అట్లే యింకొక చోటను "య ఏషోఽన్తరహృదయ ఆకాశ స్తస్మిం

---

అప్పుడు, ఆసు=మీఁదఁ జెప్పంబడిన, నాడీషు=(సూర్య తేజముతో నిండిన) నాడులందుఁ, సృప్తః=ప్రవేశించినవాఁడు, భవతి=అగుచున్నాఁడు. నాడీ ద్వారమున హృదయాకాశముం బొందుచున్నాఁడు.

౧. బృ. ౪. ౧. ౧౯. (ఎప్పు డాత్మఁడు నిద్రించునో యపుడు) తాభిః=(హితప్రాప్తిసాధనములగు) నాడులద్వారమున నని యర్థము. ప్రత్యవసృప్య = శరీరము నెల్ల వ్యాపించి, పురీతతి = హృదయముం జుట్టుకొన్న త్రేగునందు (=శరీరమునందని యర్థము) శేతే=నిద్రించుచున్నాఁడు.

౨. కౌ. ౪. ౧౯. సుప్తః=నిద్రించువాఁడు, యదా=ఎప్పుడు, కంచన స్వప్నం=ఏవిధమగు స్వప్నమునున్, నపశ్యతి=చూడఁడో, తదా=అపుడు, తాసు-భవతి = మీఁదఁజెప్పంబడినవాఁడు లందుండును. అథ=పిమ్మటను, అస్మిన్ ప్రాణ ఏవ = ఈపరమాత్మునందే, ఏకధా భవతి = ఏకీభవించు చున్నాఁడు.

3. బృ. ౪. ౧. ౧౭. (విజ్ఞానమయుఁడు నిద్రించునపుడు వాగాదుల విజ్ఞానమును స్వీకరించి) అంతర్హృదయే=హృదయమధ్యమునను, య ఏష ఆకాశః=ఏయీ యాకాశము (కలదో) తస్మిన్=ఆయీయాకాశమునను, శేతే=ఉండును. (ఇట నాకాశశబ్దముచేఁ బరుఁడగు పరమాత్ముఁడు చెప్పంబడెను.)

శ్చేతే" యని వినంబడుచున్నది. అట్లే వేఱొకచోటను "సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి" యని పఠింపఁబడుచున్నది. మఱొక్క చోటను "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతర"మ్మని శ్రూయమాణ మగుచున్నది. అట నాడులు మొదలగునవి యన్నియుఁ బరస్పరనిరపేక్షముగా వేఱువేఱు సుప్తిస్థానములా? లేక పరస్పరాపేక్షచే నొకటే సుప్తిస్థానమా? యను సంశయము గలదు. సంశయము కలుగఁగా నేమి ప్రాప్తించె ననిన వేఱువేఱు సుప్తిస్థానము లేయని ప్రాప్తించును. దేనివలన ననిన నేకార్థము లగుటవలన నని చెప్పంబడుచున్నది. ఏకార్థము లగు వ్రీహియవాదుల కెక్కడను బరస్పరాపేక్షత్వము చూడంబడదు గదా! సుషుప్తి యందు నాడులు మొదలగువాని కేకార్థత్వము (=పరస్పర నిర

౧. ఛాం. ౬. ౮. ౧. సోమ్య=సౌమ్యస్వభావుఁడవగు శ్వేతకేతూ! (పురుషుఁ డెప్పుడు "స్వపితి" యని చెప్పంబడునో) తదా=అప్పుడు, సతా=సచ్ఛబ్దవాచ్యమును బ్రకృతియు నగు దేవతతోడను, సంపన్నః=ఏకీభవించినవాఁడు, భవతి=అగుచున్నాఁడు. (కనుక నే) స్వం-అపీతః=తన్నుఁ బొందినవాఁడు, భవతి=అగుచున్నాఁడు.

౨. బృ. ౬. ౩. ౨౧. (లోకములో నెట్లు ప్రియురాలగు స్త్రీచే నాలింగితుఁడై బాహ్యాభ్యంతరముల నెఱుంగఁజాలఁడో యట్లే యీతఁ డెఱుంగఁడు) ప్రాజ్ఞేన-ఆత్మనా=పరమాత్మునితోడను, సంపరిష్వక్తః=ఏకీభవించినవాఁడై, బాహ్యం=వెలుపలి వస్తువునుగాని, అంతరం=లోపలి సుఖదుఃఖాదికమునుగాని, కించన=దేనిని, న వేద=తెలియఁజాలఁడు.

పేక్షమైన స్వాపాధారత్వము) "నాడీషు సృప్తో భవతి" యనియును, "పురీతతి శేతే" యనియు నటనట సప్తమీ నిర్దేశము తుల్యమగుటవలనఁ దెలియంబడుచున్నది. అయ్యా! సప్తమీనిర్దేశము "సతా సోమ్య తదా సంపన్నో భవతి" యనుచో సత్తునందుఁ జూడంబడదవిన నట సైతము "నాడ్యాదులందువలె సప్తమ్యర్థము గమ్యమాన మగుటవలన నీదోషము లేదు. "అన్యత్రాయతన మలబ్ధ్వా ప్రాణమేవోపశ్రయతే" యను వాక్యశేషమునఁ బ్రాణశబ్దముచే నట (= "సతా సోమ్య" యనుచోట)ఁ బ్రకృత మగు సత్తును గ్రహించుటవలన జీవుఁ డాయతనముం గోరుచున్నవాఁడై సత్తు నుపసర్పించుచున్నాఁడని (శ్రుతి) చెప్పుచున్నది గదా! ఆయతనశబ్దమువలన సప్తమ్యర్థము (ఆధారత్వము) తెలియంబడు చున్నది. మఱియును "సతి సంపద్య న విదుస్సతి సంపత్స్యా

౧. ఛాం. ౬. ౮. ౨. (జీవుఁడు) అన్యత్ర=తన్మయుగు సత్పదార్థము కంటె వేఱొక, ఆయతనం=విశ్రమస్థానమును, అలబ్ధ్వా=సంపాదించుకొనలేక, ప్రాణమేవ=సన్నామకుఁడగు పరదేవతనే, ఉపశ్రయతే=ఆశ్రయించుచున్నాఁడు.

౨. ఛాం. ౬. ౯. ౨. (ఓ శ్వేతకేతూ! ఇమాః ప్రజాః = ఈజీవులు నిద్రయందును మరణప్రళయములందును) సతి=సత్పదార్థమునందుఁ, సంపద్య=ఏకీభవించియు, సతిసంపత్స్యామహే, ఇతి = సత్తునందేకీభవించుచున్నామని (లేక సత్తునందేకీభవించితిమని గాని) నవిదుః = తెలియంజాలరు.

మహే" యనునట్టి వాక్యశేషమున నక్తమీనిర్దేశము నటఁ జూడంబడుచున్నది. అన్నిచోట్లను విశేష విజ్ఞానోపరమ లక్షణమగు (= ఇది ఘట మిది పట మనునిది విశేషవిజ్ఞానము. దానియుపరమము = అభావము. అది లక్షణముగాఁ గలది యగు) సుషుప్తము భేదిల్లదు. కాఁబట్టి యేకార్థము లగుటవలన నాడ్యాదులలో నొకపు డొకస్థానమును వేఱొకపు డింకొకస్థానమును స్వాపమునకు వికల్పమున జీవుఁ డాశ్రయించుచున్నాఁ డనునిది ప్రాప్తింపఁగాను "తదభావో నాడీష్వాత్మనిచ" యనుదానిం బఠించుచున్నాఁడు. తదభావః = ప్రకృతమగు స్వప్నదర్శనము యొక్క అభావః=అభావము, సుషుప్తమని యర్థము. నాడీషు - ఆత్మనిచ=నాడులందు నాత్మునందు (నగును.) జీవుఁడు నాడులు మొదలగువానిని సముచ్చయమున స్వాపమున కాశ్రయించు చున్నాఁడు కాని వికల్పమున నాశ్రయింపఁడని యర్థము. దేనివలన నంటేని, తచ్ఛ్రుతేః = దానియొక్క శ్రుతి (= అది వినంబడుట) వలన నని చెప్పుదుము. అదియే ప్రతిపాదింపఁబడుచున్నది. నాడ్యాదులగు వీనికన్నిటికి నటనట సుప్తిస్థానత్వము వినంబడుచున్నది. సముచ్చయ మయ్యేనేని యది సంగ్రహింపఁబడినది యగును. వికల్పమయ్యేనేని పక్షమునందు వీనికి బాధమే యగుచున్నది. ఎప్పుడు నాడులు సుప్తిస్థానమగునో యప్పు

దు పురీతత్తు సుప్తిస్థానముగాదని శ్రుతమగు స్థానత్వమునకు బాధమగుచున్నది; అది యుక్తముగాదని యర్థము. అయ్యా! వ్రీహియవాదులకు వలె నాడ్యాదులకు నేకార్థత్వమువలన వికల్పము చెప్పంబడెనంటేని "ప్రాసాదే శేతే పర్యంకే శేతే" యనునది (మేడయందు నిద్రించుచున్నాఁడు; శయ్యయందు నిద్రించుచున్నాఁడనునది) మొదలగుచోట్ల నానార్థత్వసముచ్చయములకు నేకవిభక్తి నిర్దేశము కాన్పించుటవలన నేకవిభక్తి నిర్దేశమాత్రముచే నేకార్థత్వము వికల్పమును బ్రసరింపదు. అట్లే యిటనును నాడులందుఁ బురీతత్తునందు బ్రహ్మమునందు నిద్రించుచున్నాఁడని సముచ్చయము యుక్తము. అట్లే "తాసు తదాభవతి యదాసుప్తస్స్వప్నం నకంచన పశ్యత్యథాస్మిన్ ప్రాణ ఏవైకధాభవతి" యను శ్రుతి నాడుఁకుఁ బ్రాణమునకు నేకవాక్యమున స్వీకరించుటవలన సుషుప్తియందు సముచ్చయమును వినిపించుచున్నది. "ప్రాణస్తథానుగమాత్" ను సూత్రముకడఁ బ్రాణమునకు బ్రహ్మత్వము నిశ్చయింపఁబడినది. "ఆసుతదా నాడీషుసృప్తోభవతి" యనునది మొదలగు నెచోట్ల నిరపేక్షములే యగునాడులు సుప్తిస్థానములని వినిపించుచున్నదో యటనైతము వేఱొకచో వినంబడిన బ్రహ్మము నిషేధింపఁబడలేదు కాఁబట్టి నాడిద్వారమున బ్రహ్మమునందే నిద్రించుచున్నాఁడని తోఁచుచున్నది. ఇట్లయి

వలనం గలిగిన సుఖదుఃఖాభావమునలన వానికిం గారణ మగు ధర్మాధర్మరూప పాప్మస్పర్శము లేదని యభిప్రాయము. వేఱొక పక్షమునను "బ్రహ్మైవ తేజ ఏవ" యను వేఱొక శ్రుతియందుఁ దేజశ్శబ్దము బ్రహ్మమునందుఁ బ్రయుక్తమగుట వలనను "తేజసా"యను నిది బ్రహ్మనిర్దేశమే. అపుడు నాడీద్వారమున బ్రహ్మముతో నేకీభవించుచున్నాఁడు గనుక నతని నేపాపము స్పృశింపదని యర్థము. "సర్వే పాప్మానోఽతో నివర్తంతేఽపహతపాప్మా హ్యేష బ్రహ్మలోక" యనునది మొదలగు శ్రుతులవలనఁ బాప్మస్పర్శాభావమున బ్రహ్మసంపత్తి హేతువని తెలియంబడినదియు. ఇట్లగుచు నుండఁగా (=నాడులు బ్రహ్మప్రాప్తిద్వారము లగుచుండఁగా)ఁ బ్రదేశాంతరమున ("=తాసు తదా భవత్యథాస్మిన్న" ను శ్రుతియందు)ఁ బ్రసిద్ధమగు సుషుప్తిస్థానమైన బ్రహ్మముతో ననుగతమైన నాడీ సముచ్చయ మాశ్రయింపంబడినది యగుచున్నది. అట్లే (=నాడులకును బ్రహ్మమునకును గుణప్రధాన భావమున సుషుప్తియందు సముచ్చయము

౧. ఛాం. ౮. ౪. ౧. సర్వేపాప్మానః = సుకృత దుష్కృతము లన్నియు వాని ఫలములును, అతః = ఆ బ్రహ్మమునుండి, నివర్తంతే = మరలుచున్నవి. బ్రహ్మమును బొందకయే మరలుచున్నవని యర్థము. ఏషః = బ్రహ్మలోకః = ఈ బ్రహ్మ మను లోకము, అపహతపాప్మా = పాపశూన్యమైనదిగదా!

వలెనే) పురీతత్తునకును బ్రహ్మప్రకరణమున సంకీర్తనము వలన దాని కనుగుణముగ సుషుప్తిస్థానత్వము తెలియంబడుచున్నది. “యఏషోऽన్తర్హృదయ ఆకాశస్తస్మిన్ శేతే” యను వాక్యమున హృదయాకాశమను సుషుప్తిస్థానము ప్రస్తావింపంబడినది యగుచు నుండగాను “పురీతతి శేతే” యనునది చెప్పంబడుచున్నది. హృదయపరివేష్టనము (=ప్రేగు) పురీతత్తని చెప్పంబడుచున్నది. దానిలోపలనున్న హృదయాకాశమున శయనించుచున్నవాఁడు పురీతత్తునందు శయనించుచున్నాఁడని చెప్పవచ్చును. ప్రాకారముచే నావృతమైన పురమున నున్నవాఁడు ప్రాకారమందున్నాఁడని చెప్పంబడుచున్నాఁడుగదా! “దహర ఉత్తరేభ్యః” యను సూత్రమునందు హృదయాకాశమునకు బ్రహ్మత్వము చెప్పంబడెను. అట్లే (=నాడులకు బ్రహ్మమునకువలెనే) నాడీపురీతద్బ్రహ్మములకును సముచ్చయము “తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే” యను నేకవాక్యముచే నుపాదానము వలనఁ దెలియంబడుచున్నది. నాడీద్వారమునఁ బురీతత్తుఁజేరి బ్రహ్మమునందు శయనించుచున్నాఁడని సముచ్చయము సిద్ధము. సత్ప్రాజ్ఞలిఙ్గములను బ్రహ్మత్వము ప్రసిద్ధమే. ఈ ప్రకారముగా మీఁదటి శ్రుతులందు నాడులు, పురీతత్తు, బ్రహ్మము నను మూఁడు సుషుప్తిస్థానములే చెప్పంబడినవి. అందును నాడులుం బురీతత్తును ద్వార (=మార్గ) మాత్రము. బ్రహ్మమొక

టిమే యనపాయి యగు సుప్తిస్థానము. (దర్శాది కర్మములకు సాధన మగు పురోడాశాది నిష్పత్తియందుఁ బరస్పరాపేక్ష లేకుండ సమర్థము లగుటవలన వ్రీహియవలకు వికల్పము యుక్తము గాని నాడులు మొదలగువానికి బ్రహ్మ నిరపేక్షముగా సుషుప్తియందు జీవున కాధార మగుటకు సామర్థ్యము సంభవింపదు గాఁబట్టి వికల్పము తగదని చెప్పుచున్నాఁడు.) మఱియును వానియందు జీవుని కరణము లున్నవి గాఁబట్టి నాడులు గాని పురీతత్తుగాని జీవుని యుపాధికే యాధార మగుచున్నవి గాని బ్రహ్మముకంటె వేఱుగాక స్వమహిమయందే నిల్చిన వాఁడు గనుక నుపాధిసంబంధము వినాగా నతనికి స్వభావముగ నాధార సిద్ధియు సంభవింపదు. సుషుప్తియందు జీవునకు బ్రహ్మాధారత్వమును నాధారాధేయ భేదాభిప్రాయమునఁ జెప్పంబడదు. అపుడెట్లు చెప్పంబడుచున్న దనిన తత్కారణము వలన (శ్రుతి) "సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి" యని చెప్పుచున్నదో యా కారణమువలనఁ దాదాత్మ్యాభిప్రాయమునవే చెప్పంబడుచున్నది. స్వశబ్దముచే నాత్మ చెప్పంబడుచున్నాఁడు. సుషుప్తుఁడు తద్రూపమును బొందుచున్నాఁడని యర్థము. మఱియును స్వరూప మనపాయి (=విడువనిది.) యగుటవలన జీవున కొకప్పుడును బ్రహ్మముతో సంపత్తి లేదనునది లేదు. కాని జాగ్రదవస్థయందును స్వప్న

గలవానికిని విశేషవిజ్ఞానాభావమునందు (ద్రష్టకుదృశ్యము కంటె) దూరమున నునికి మొదలగునది కారణము కావచ్చుననిన స్వభావమువలన జీవుండు పరిచ్ఛిన్నుండని యంగీకరింపంబడదేని ప్రవాసి యగు విష్ణుమిత్రుండు స్వగృహముం జూడండన్నట్లు బాధముగా నిదియున్ను కావచ్చును. కాని జీవున కుపాధికంటె వేఱుగాం బరిచ్ఛేదము లేదు. ఉపాధియందున్న యతి దూరాదికమే విశేష విజ్ఞానాభావమున హేతువని చెప్పంబడునేని యట్లయిన నుపాధిశాంతిల్లిన వగుటవలన సత్తునందే యేకీభవించినవాండై (విశేషముం) దెలియంజాలండనునిది యుక్తము. మఱియు వే:ము (బ్రహ్మముతో) సమముగా నాడ్యాదులకు సముచ్చయముం జెప్పదు. గుణప్రధానభావముసం జెప్పుచున్నాదని యర్థము. నాడులు గాని పురీతత్తుగాని స్వాపస్థానమును జ్ఞానముచే నెద్దియుం బ్రయోజనము లేదు. ఈ విజ్ఞానముచే బ్రాప్తించు ఫల మెద్దియు వినంబడదుగదా! మఱియు నిది ఫలవంత మగు నెద్దానికి నంగమని యుపదేశింపంబడదు. బ్రహ్మ మనపాయి యగు సుప్తిస్థానమును దీనిం బ్రతిపాదించుచున్నారము. ఆ జ్ఞానముచే జీవునకుం బ్రహ్మాత్మత్వ నిశ్చయమును స్వప్నజాగరిత వ్యవహారములనుండి విముక్తత్వావధారణమునను ప్రయోజనములుగలవు. కాబట్టి యాత్మయే సుప్తిస్థానము.

సూ. అతః ప్రబోధోఽస్మాత్. ౮

ప. అతః - ప్రబోధః - అస్మాత్.

అ. ఆత్ముఁడు సుషుప్తిస్థానము కాఁబట్టియే వానినుండి జీవునకుఁ బ్రబోధ ముపదేశింపఁబడుచున్నది.

భా. ఏకారణమువలన నాత్ముఁడే సుషుప్తిస్థానమో, అతః = ఆకారణమువలననే "కుతఏతదాగాత్"ను ప్రశ్నమునకుఁ బ్రతివచనముఁ జెప్పునపుడు "యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరం త్యేవ మేవైత స్మా దాత్మనః సర్వే ప్రాణా" యను మొదలగు దానిచేతను, "సత ఆగమ్య న విదుః సత ఆగచ్ఛామహే" యను దానిచేతను అస్మాత్ ఈ యాత్మునినుండియే, ప్రబోధః = జీవునకుఁ బ్రబోధము (=మెలఁ

---

౧. బృ. ౪. ౧. ౧౬. (ఓ గార్గ్యుఁడా! యీ విజ్ఞానమయుఁడు చేతితో నిద్రనుండి లేపక పూర్వ మెటనుండెను?) కుతః = ఎటనుండి, ఏతత్ = ఈయధికరణమును, ఆగాత్ = చేరెను? ఇట్లజాతశత్రుఁడు గార్గ్యునకు బోధింపఁదలఁచి యడిగెను.

౨. బృ. ౪. ౧. ౨౦. యథా = ఎట్లు, అగ్నేః = (ఏకరూపమగు) నిప్పునుండి, క్షుద్రాః = స్వల్ప పరిమాణము గలవియగు విస్ఫులింగాః = మిణుఁగురులు, వ్యుచ్చరంతి = వివిధముగా బయలు దేరుచున్నవో, ఏవ మేవ = ఈప్రకారముగానే, ఏతస్మా దాత్మనః = నిద్రనుండి లేవక మునుపు విజ్ఞానమయుని స్వరూప మగు నాత్మ పదార్థమునుండి, సర్వే ప్రాణాః = వాగాదు లగు సర్వ యింద్రియములును దక్కిన యెల్లపదార్థములును, వ్యుచ్చరంతి = వివిధముగా బయలు వెడలుచున్నవి.

3. ఛాం. ౬. ౧౦. ౨ (ఈ ప్రజలందఱును) సతః = సత్తునుండి, ఆగమ్య = వచ్చి, సతః = సత్తునుండి, ఆగచ్ఛామహే - ఇతి = వచ్చుచున్నార మని, న విదుః = తెలియఁజాలరు.

కువ) నిత్యముగా స్వాప ప్రకరణమున శాసింపఁబడుచున్నది. స్వాపస్థానములు వికల్పింపఁబడినవి యగుచునుండఁగా నొకపుడు నాడులనుండి మేల్కొనుచున్నాఁడు. వేఱొక కాలమునఁ బురీతత్తునుండి లేచుచున్నాఁడు; మఱియొకపు డాత్మనుండి ప్రబోధముం జెందుచున్నాఁడని శాసించును. (నాడులకుఁగాని పురీతత్తునకుఁగాని ప్రబోధాపాదానత్వ మెక్కడను జెప్పంబడలేదు.) కాఁబట్టియు నాత్మయే సుషుప్తిస్థానము. (ఇట్లు జీవున కుపాధిలయము గలుగుచుండఁగా బ్రహ్మముతో నభేదముం జెప్పుటవలన భేద మౌపాధిక మను వివేకమునుండి వాక్యార్థాభేదము సిద్ధించును.)

ఇది ద్వితీయాధికరణము

---

## కర్మానుస్మృతిశబ్ద విధ్యధికరణము. 3

సూ. స ఏవతు కర్మానుస్మృతి శబ్ద విధిభ్యః. —

ప. సః - ఏవ - తు - కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః.

అ. కర్మశేషముం జేయుటవలనను స్మరణమువలనను వైదికములగు శబ్దములవలనను విద్యావిధులవలనం గర్మవిధులవలన నెవఁడు సుషుప్తియందు బ్రహ్మముతో నేకీభవించుచున్నాఁడో యతఁడే ప్రబోధము నొందుచున్నాఁడు గాని వేఱొకఁడుగాఁడు.

భా. మీఁదఁజెప్పఁబడిన సత్సంపత్తినుండి ప్రతిబుద్ధ్యమాను (సత్తుతో నేకీభవించి మేల్కొనుచున్నవాఁ) డెవఁడు సత్తుతో నేకీభవించినవాఁడో యతఁడే యగునా? వేఱొకఁడా? యనునది చింతింపఁబడుచున్నది. అట్టి చింతయం దెవ్వఁడు సత్తుతో నేకీభవించుచున్నాఁడో వాఁడే లేచుచున్నాఁడను సిద్ధాంతము లేదని ప్రాప్తించెను. ఏకారణమువలన ననిన నెప్పుడు జలరాశియం దొక జలబిందువు చిమ్మఁబడుచున్నదో యది యపుడు సముద్రమే యగుచున్నది. మరల నుద్ధరించునపు డదియె జలబిందువు దుస్సంపాదము. అట్లే సుప్తుఁడు పరునితో నేకీభవించినవాఁడై నిర్మలుఁ డగుచున్నాఁడు. అతఁడే మరల లేవందగఁడు. కాఁబట్టి వాఁడే కాని యీశ్వరుఁడు కాని మఱియొక జీవుఁడుగాని ప్రతిబుద్ధుఁ డగుచున్నాఁ డను నిది ప్రాప్తింపఁగా నీ సూత్రముం జెప్పుచున్నాఁడు. సఏవతు = ఆ జీవుఁడే సుప్తుఁడై, స్వాస్థ్యమును బొంది మరల లేచుచున్నాఁడు గాని వేఱొకఁడుగాఁడు. ఏకారణమువలన నతఁడే లేచుచున్నాఁడంటివి, కర్మానుస్మృతిశబ్ద విధిభ్యః = కర్మములవలన నని చెప్పెదము. (ఈ) హేతువులను విభజించి కనుపఱుచుచున్నారము. కర్మ=నిన్నఁ జేయఁగా మిగిలిన కర్మముం జేయుట కాన్పించుటవలన నతఁడే లేచుచున్నాఁడు గాని వేఱొకఁడుగాఁడు. అది ప్రతిపాదింపఁ

బడుచున్నది. (ఎల్లవాఁడు) పూర్వదినమున ననుష్ఠింపంబడిన కర్మముయొక్క శేషమును రెండవదినమునఁ జేయుచుఁ జూడంబడుచున్నాఁడు. అతిప్రసంగమువలన (=ఒకయోగమునకుం బెక్కండ్రు కర్తలు ప్రసక్తింతురు కాఁబట్టి) వేఱొకనిచే సగము చేయంబడిన కర్మముయొక్క శేషమును వానికంటె నితరుఁడు చేయ నర్హుఁడు కాఁడు. కనుకఁ బూర్వదినమునఁ బరదినమున నొక కర్మమునకు నొకఁడే కర్త యని తెలియంబడుచున్నది. అనుస్మృతి = ఎక్కారణమువలన నతిక్రమించిన దినమునందు నే నిదిం జూచితినని మున్ను దా ననుభవింపంబడిన దానిం దరువాత స్మరించుట (సుప్తునికంటె వేఱొకఁడు లేచిన నుపపన్నము కానోపదు) యాకారణమువలన నతఁడే (=నిద్రించినవాఁడే) లేచుచున్నాఁడు. వేఱొకనిచేఁ జూడంబడిన దానిని వేఱొకఁడు స్మరింపంజాలఁడు గదా! "సోఽహ మస్మి" యను (నిన్నటి వాఁడనే నేనను)నట్టి యాత్మానుస్మరణము నాత్మాంతరోత్థానమున సంభవింపదు. శబ్ద = శబ్దములవలన నతనికే యుత్థానము తెలియంబడుచున్నది. శబ్దము లెట్లనినఁ జెప్పంబడుచున్నవి. "పునః ప్రతిన్యాయం

౧. బృ. ౬. 3. ౧౬. (నిద్రనుండి వచ్చిన పురుషుఁడు) పునః = మఱియొకసారి, ప్రతియోని = ఆయాయింద్రియస్థానమును, ప్రతిన్యాయం = ప్రతినియతమైన గమనము గలుగునట్లుగాను, బుద్ధాంతాయైవ = జాగ్రదవస్థకొఱకే, ఆద్రవతి = వచ్చుచున్నాఁడు.

ప్రతిష్ఠాన్యాద్భవతి బుద్ధాంతాయైవ, ఇమాస్సర్వాః ప్రజా అహరహర్గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం నవిందంతి,[1] "త ఇహ వ్యాఘ్రోవా సింహోవా యద్యద్భవంతి తత్తదాభవంతి"[2] యనునది మొదలగు స్వాపప్రబోధ ప్రకరణమునఁ బఠింపఁబడిన శబ్దము లాత్మాంతర ప్రబోధమునందు సామంజస్యముం బొందవు. విధిభ్యః = కర్మ విద్యావిధులవలన నిట్లే తెలియంబడుచున్నది. వేఱొకఁడగున య్యోనేని(=సుప్తునికంటె వేఱొక జీవుఁడు ప్రబోధముం జెందునేని) కర్మవిధులును విద్యావిధులును నిరర్థకము లగును. వేఱొకఁడు లేచునను పక్షమున సుప్తమాత్రుఁడు (బంధ) ముక్తుఁ డగునని ప్రాప్తించును. ఇట్లగునేని (=సుప్తుఁడు ముక్తుఁడగునేని) కాలాంతరమున ఫలము

---

౧. ఛాం. ౮. ౩. ౨. ఇమాస్సర్వాః ప్రజాః = ఈ జీవులందఱును, అహరహః = ప్రతిదినమును, ఏతం = ఈ హృదయాకాశ మను పేరుగల, బ్రహ్మలోకం = బ్రహ్మమను లోకమును, (నిద్రాకాలమునందు) గచ్ఛంత్యః = పొందుచున్నవారయ్యును, (అజ్ఞులు నిధిమీఁద సంచరించుచున్నను దాని నెఱుంగనియట్లు) నవిందంతి = మేము బ్రహ్మముం బొందుచున్నామని) యెఱుంగరు.

౨. ఛాం. ౬. ౯. ౩. తే = ఆసత్తుతో నేకీభవించినవారు, (తమ సద్రూపత్వము నెఱుంగక యేకీభవించినవారు కాఁబట్టి) ఇహ = ఈలోకమునను, (సత్తుతో నేకీభవింపక పూర్వము) యద్యద్భవంతి = ఏకర్మము నిమిత్తముగానే (వ్యాఘ్రాది) జన్మముం బొందిరో యాకర్మవాసన నిమిత్తముగాఁ గలవారై (సత్తుతో నేకీభవించినవారయ్యును) వ్యాఘ్రోవా - సింహోవా = వ్యాఘ్రముగాని సింహముగాని, తత్తదాభవంతి = ఆయాయి జంతువులే (మేల్కొండ్లకైనను సత్తును విడిచిన తరువాత) నగుచున్నారు.

నిచ్చు కర్మముతోఁ గాని విద్య (=ఉపాసనము) తోఁ గాని ప్రయోజనము లేకపోవును. మఱియు నన్యోత్థానపక్షమున వేఱొక శరీరమున వ్యవహరించుచున్న జీవుఁడు లేచెనేని యాశరీరమున వ్యవహార లోపప్రసంగ మగును. వేఱొకశరీరమున సుప్తుఁడు లేచునేని కల్పనానర్థక్యము ప్రసక్తించును. ఎవఁ డేశరీరమున నిద్రించుచున్నాఁడో యతఁ డాశరీరమునందు లేవఁడు; వేఱొక శరీరమున నిద్రించువాఁడు మఱియొక శరీరమునందు లేచుచున్నాఁడను నీకల్పనమునం దేమిలాభము కలుగును? ముక్తుఁడు లేచుచున్నాఁడను పక్షమున మోక్షమంతవంత మగును. నివృత్తమైన యవిద్యగలవానికిం బునరుత్థానము నుపపన్నము నగును. ఇట్లనుటచే (=ముక్తుల కుత్థానము లేదనుటచే) నిత్యనివృత్తావిద్యుఁ డగుటవలన నీశ్వరున కుత్థానము నిరాకరింపఁబడినది యగును. అన్యోత్థానపక్షమున నకృతాభ్యాగమమును కృతవిప్రణాశమును దుర్వారము లగును. కాఁబట్టి యెవఁడు సుప్తుఁడో యతఁడే లేచునుగాని వేఱొకఁడు గాఁడు. ఎట్లు సముద్రమునం బ్రక్షిప్తమగు జలబిందువు మరల నుద్ధరింప శక్యముగాదో యట్లే సత్తునం దేకీభవించిన జీవుఁడు మరల లేవంజాలఁడని యెద్ది చెప్పంబడినదో యది పరిహరింపంబడుచున్నది. అట వివేకమునకుం దగిన కారణము లేమిం జేసి సిటిబింబమువున కనుద్ధరణము యుక్తము. ఇటఁ గర్మ

మున విద్యయును వివేకకారణముకల దని వైషమ్యమున్నది. (మనబోంట్లు కళక్యమైన వివేచనము ప్రాణికర్మము నపేక్షించిన వాఁడై యీశ్వరుఁడు చేయునని తలఁచి దృష్టాంతముఁ జూపుచున్నాఁడు.) మనబోఁటివారిచే వివేచింపరానివియు నొండొంటితోఁ గలసినవియు నగు క్షీరోదకములకు వివేచనముహంసము చేయునుగదా! మఱియు నెవఁడు జలరాశినుండిజలబిందువువలె సత్తునుండి వివేచింపఁబడవలయునో యట్టిజీవుఁ డను వాఁ డొక్కఁడు పరుఁ డగు నాత్మునికంటె భిన్నుఁడు లేఁడు. సత్తే యుపాధిసంపర్కమువలన జీవుఁ డని గౌణముగాఁ జెప్పఁబడుచున్నదను నంశము పలుమాఱు ప్రపంచింపఁబడెను. ఇట్లగుచునుండఁగా నెంతవఱకు నొక యుపాధిం బొందిన బంధానువృత్తి కలదో యంతవఱకు నేకజీవవ్యవహారమును బంధానువృత్తి వేఱొక యుపాధిం బొందినది యగుచునుండఁగా జీవాంతరవ్యవహారమును సంభవించును. ఆ యుపాధియే స్వాపప్రబోధములందు బీజాంకురన్యాయమున నుండును గాఁబట్టి యా జీవుఁడే ప్రతిబోధముం బొందుచున్నాఁ డను నిది యుక్తము.

ఇది తృతీయాధికరణము.

---

## ముగ్ధాధికరణము. ౪

సూ. ముగ్ధేऽర్ధసంపత్తిః పరిశేషాత్. ౧౦.

ప. ముగ్ధే - అర్ధసంపత్తిః - పరిశేషాత్.

అ. ముగ్ధునందు =.మూర్ఛనొందినవానియందుఁ బరిశేషమువలన సగము మరణావస్థాలక్షణమును సగము సుషుప్తావస్థా లక్షణమును గలదు.

భా. లోకములో వారెవనిని మూర్ఛితుఁడని చెప్పుచున్నారో యట్టివాఁడు ముగ్ధుఁడు కలఁడు. అతఁ డేయవస్థ కలవాఁడను పరీక్ష యందుఁ జెప్పంబడుచున్నది. శరీరమునం దున్న జీవునకు జాగరితము స్వప్నము సుషుప్తము ననుమూఁ డవస్థలు ప్రసిద్ధములు. శరీరమునుండి యుత్క్రాంతి (=లేచి పోవుట) నాల్గవయవస్థ. జీవున కైదవయవస్థ యొద్దియు శ్రుతియందుఁ గాని స్మృతియందుఁ గాని ప్రసిద్ధమైనది లేదు. కాఁబట్టి మూర్ఛ నాల్గవస్థలలో నెద్దియో నొకటి కావలెనని ప్రాప్తింపఁగాఁ జెప్పుచున్నారము. ఇతఁడు (=మూర్ఛితుఁడు) విషయముల నింద్రియములచేఁ జూడంజాలఁడు కాఁబట్టి జాగ్రదవస్థ కలవాఁడు గాఁడు. ముగ్ధుఁ డిషుకారన్యాయమున జాగ్రదవస్థ కలవాఁ డనునది కావచ్చును; ఎట్లిషుకారుఁడు (=బాణములం జేయువాఁడు) జాగ్రదవస్థలో నున్నవాఁడయ్యు నిషువునం దాసక్తమైన మనము గలవాఁడగుటచే నితరములగు

విషయములం జూడఁడో యట్లే ముగ్ధుఁడు ముసలపాతాది నిమిత్తమునం బుట్టిన దుఃఖానుభవమునఁ దగిలిన మనసు కలవాఁడగుటచే నితరము లగు విషయములఁ జూడఁ డను నిది కావచ్చుననిన నచేతయమానుఁడు (=ముగ్ధుఁడు జ్ఞానము లేని వాఁడు) కాఁబట్టి యటులనరాదు. ఇషుకారుఁడు వ్యాపృతమైన మనసుకలవాఁడై నేనింతకాలము నిషువునే చూచుచున్నవాఁడ నైతినని చెప్పుచున్నాఁడు. కాని మూర్ఛనొందిన వాఁడు లబ్ధసంజ్ఞుఁడై నే నింతకాలము నంధతమమునం బడవేయం బడితిని; నాచే నేమియుం దెలియంబడలేదని చెప్పుచున్నాఁడు. జాగరావస్థలో నున్నవాని కొక్కవిషయమునం దగులుకొన్న వానికిని దేహము నిలువంబడుచున్నది. కాని మూర్ఛితుని శరీరము భూమింబడుచున్నది. కాఁబట్టి (యితఁడు) మేల్కొనుచున్న వాఁడు గాఁడు. మఱియు జ్ఞానము లేనివాఁడగుటవలన స్వప్నములం జూడఁడు. స్వప్నావస్థ కలవాఁడు గాఁడని యర్థము. ప్రాణములు సూక్ష్మముం (=శరీరమునందలి వేఁడియుం) గలవు కాఁబట్టి మృతుఁడుం గాఁడు. ప్రాణి మూర్ఛనొందినపు డితఁడు మరణించెనా? జీవించి యుండెనా? యని సంశయించుచున్నవారు నిశ్చయార్థమూష్మము కలదా? లేదా? యని హృదయదేశమును స్పృశించుచున్నారు. ప్రాణము కలదో? లేదో? యని

సంశయించువారు నిశ్చయముకొఱకు నాసికాగ్రదేశమును స్పృశించుచున్నారు. ప్రాణమును వేడియు నున్నట్లు తెలియ లేని పిమ్మట నితఁడు మృతుఁడని నిశ్చయించి దహింప నరణ్యమునకుం దీసికొని పోవుదురు. ప్రాణములుగాని యూష్మము గాని కలదని తెలియుదు రేని యితఁడు జీవించియున్నాఁడని నిశ్చయించి తెలివిని సంపాదింపఁ జికిత్సించుచున్నారు. ఇతఁడు మరల లేచుచున్నవాఁ డగుటవలన మరణము నొందినవాఁడు గాఁడు. యమునిలోకమునకుం బోయి యతని రాజ్యమునుండి మరలివచ్చువాఁ డుండఁడుగదా! అపుడు జ్ఞానము లేనివాఁ డగుటవలనను మృతుఁడుగానివాఁ డగుటవలనను సుషుప్తావస్థ గలవాఁడు గావచ్చుననిన (సుప్తికిని మూర్ఛకును గొంచెము సారూప్యమున్నను) మిక్కిలి వైలక్షణ్యము కలదు గాఁబట్టి యట్లనరాదు. మూర్ఛఁ బొందినపుడు చాలంగాల ముచ్ఛ్వసింపఁడు. ఇతని దేహము కంపించుచుండును. ఇతని ముఖము భయానకమై యుండును. కన్నులం దెఱచియుండును. నిద్రించువాఁడు ప్రసన్నవదనుఁడై యుండును. సమకాలమున మరల మరల నూపిరి విడుచుచుండును. నేత్రముల మూసికొని యుండును. ఇతని దేహము వణఁకదు. చేతితోఁ దాచుటచేత నైతము నిద్రించువానిని మేల్కొలుపుదురు. ముద్గరముతోఁ గొట్టియు మూర్ఛితుని లేపలేరు. మోహము ముసలపాతాది నిమిత్తము,

నిద్ర శ్రమ నిమిత్తము నగుటవలన మోహమునకు (=మూర్ఛకు)ను స్వాపమునకును నిమిత్తభేదముం గలదు. లోకమున మూర్ఛితుఁడు సుప్తుఁడను ప్రసిద్ధియు లేదు. పరిశేషాత్ =మీఁదటి యవస్థలలో నేనియందు నంతర్భవింపక పోవుటవలనను, ముగ్ధే = మూర్ఛితునందలి యవస్థ = మూర్ఛ, అర్ధసంపత్తిః = నిద్రావస్థా ధర్మములగు నిస్సంజ్ఞత్వము మొదలగు వాని తోడను, మరణావస్థా ధర్మములతోడను గూడినదియైన వేఱవస్థయని యని తెలిసికొనుచున్నారము. [1](సూత్రమునందు జీవునకు బ్రహ్మముతో నర్ధసంపత్తి చెప్పంబడినదని భ్రాంతి నొందినవాఁడు శంకించుచున్నాఁడు.) ఏకారణమువలన సుప్తుని గూర్చి శ్రుతిచేతను "సతా సోమ్య తదా సంపన్నో భవతి, [2]అత్ర స్తేనోఽస్తేనో భవతి, [3]నైతం సేతు మహోరాత్రే

---

౧. ఛాం. ౬. ౮. ౧. ఇది రెండవ యధికరణమున వివరింపఁబడె.

౨. బృ. ౪. 3 ౨౨. అత్ర = ఈ సుప్తికాలమునను, స్తేనః = బ్రాహ్మణుని సువర్ణము హరించినవాఁడు (దొంగ యని యర్థము.) అస్తేనః = దొంగ కానివాఁడు, భవతి=అగుచున్నాఁడు. ఏ కర్మముచే నితఁడు మహాపాతకి యగు స్తేనుఁడని చెప్పంబడునో యట్టి క్రూరకర్మముచే నిద్రాకాలమున వినిర్ముక్తుఁడై యుండునని యర్థము.

3. ఛాం. ౮. ౪. ౧. అహోరాత్రే = పగలును రాత్రియును, అహోరాత్రాదిరూపమైన కాలమని యర్థము. ఏతం సేతుం = ఈ సేతువును, వర్ణాశ్రమాది మర్యాదను నిలుపునట్టి పరమేశ్వరుని అని యర్థము. నతరతః = పరిచ్ఛేదింపంజాలవు. పరమేశ్వరుఁడు సంసారులవలెఁ గాలపరిచ్ఛేద్యుఁడు గాఁడని యర్థము. (కనుకనే) జరా = ముసలితనము గాని, మృత్యుః = మృత్యువు గాని, శోకః = దుఃఖము గాని, సుకృతం = ధర్మము గాని, దుష్కృతం = అధర్మము గాని, (పరమేశ్వరుని బ్రాపింపంజాలవు.)

తరతో నజరా నమృత్యుర్న శోకో నసుకృతం నదుష్కృత” మని చెప్పంబడుచున్నదో యాకారణమువలన నెట్లు మూర్ఛ నర్ధసంపత్తి కల దని చెప్పవచ్చును. జీవునందు సుఖత్వదుఃఖత్వజ్ఞానము నుత్పాదించుటచే సుకృతదుష్కృతముల ప్రాప్తి యగుచున్నది. సుప్తునందు సుఖత్వజ్ఞానము గాని దుఃఖత్వజ్ఞానము గాని లేదు. ముగ్ధునందు నా ప్రత్యయములు లేవనియే తెలియుదుము. కాఁబట్టి యుపాధ్యుపశమమువలన సుప్తునందువలె మూర్ఛితునందును బూర్ణసంపత్తియే కావచ్చును. కాన నర్ధసంపత్తి కాఁగూడ దనిన నిటఁ జెప్పఁబడుచున్నది. మేము మూర్ఛయందు జీవునకు బ్రహ్మముతో నర్ధసంపత్తి యగునని చెప్పము. అపుడు మఱే మని చెప్పెద రనిన ముగ్ధత్వ మర్ధభాగముచే సుషుప్తధర్మములతోఁ (=నిస్సంజ్ఞకత్వాదికములతో)ఁ గూడినది యగుచున్నది. సగముభాగము (కంపాదికము) చే నవస్థాంతర (=మరణ) పక్షమునకు సంబంధించినది యగుచున్న దని చెప్పుచున్నారము. మోహమునకు స్వాపములతో సామ్యవైషమ్యములు చూపంబడినవియును. మఱియు నిది మరణమునకు ద్వారము. ఎపుడు మూర్ఛితుని కర్మము సావశేషమో యపుడు వాఙ్మనసములు మరలి వచ్చుచున్నవి. ఎపుడు కర్మము నిరవశేషమగునో యపుడు ప్రాణోష్మములు పోవుచున్నవి. కాఁబట్టి దీనిని బ్రహ్మవిదు లర్ధసంపత్తినిగా

నిశ్చయించుచున్నారు. (అర్థసంపత్తినిగాఁ జెప్పుచున్నారని యర్థము.) ఏదవయవస్థ శ్రుతిస్మృతులందుఁ బ్రసిద్ధము కాదను నిది యీ యవస్థ యెపుడో యొకానొకపుడు సంభవించునది కాఁబట్టి దోషము కాదు. మఱియు లోకమునందు నాయుర్వేదమునందు నిది ప్రసిద్ధమునై యున్నది. అర్థసంపత్తి నంగీకరించుటవేల్లన (=ఈ యవస్థ సగము సుషుప్తిధర్మముల తోడను సగము మరణధర్మములతోడను గూడినది యని యంగీకరించుటవలన) నైదవయవస్థగా గణింపంబడదు కాఁబట్టియు ననవద్యము.

ఇది చతుర్థాధికరణము.

## ఉభయలింగాధికరణము. ౫

(అవ. త్వంపదార్థ మేయవస్థతోడను సంబంధించినది గాదని చూపించి తత్పదార్థమును నిరూపించుచు మొదట దానికి నిర్విశేషత్వముం బ్రతిపాదించుచున్నాఁడు.)

సూ. న స్థానతోఽపి పరస్యోభయలింగంసర్వత్ర హి. ౧౧

ప. న - స్థానతః - అపి - పరస్య - ఉభయలింగం - సర్వత్ర - హి.

అ. బ్రహ్మముం బ్రతిపాదించు వాక్యము లన్నిటి యందును నిరాకరింపఁబడిన యెల్లవిశేషములు గలది యగు

బ్రహ్మమే యుపదేశింపఁబడు చున్నది కాఁబట్టి యుపాధి వలన నైనను బ్రహ్మమున కుభయలింగత్వము సంభవింపదు.

భా. జీవుఁడు సుషుప్తి మొదలగువానియం దే బ్రహ్మముతో నేకీభవించుచున్నాఁడో యా బ్రహ్మముయొక్క స్వరూప మిపుడు శ్రుతివశముచే నిర్ధరింపఁబడుచున్నది. బ్రహ్మవిషయము లగు శ్రుతు లుభయలింగములు (ఉభేయం = సవిశేషత్వ నిర్విశేషత్వములు రెండును, యాభిః=ఏశ్రుతులచేతను, లింగ్యతే = ప్రకాశింపఁజేయఁబడునో యవి=ఉభయలింగములు) కలవు. "సర్వకర్మా సర్వకామ స్సర్వగంధ స్సర్వరస" యనునది మొద లగునవి సవిశేషలింగములు. (సవిశేషం = విశేషముతోఁ గూడిన = సగుణమగు - బ్రహ్మము యేనిచేతను, లింగ్యతే = ప్రకాశింపఁ జేయఁబడునో యవి సవిశేషలింగము లగు శ్రుతులు.) "అస్థూల మనణ్వహ్రస్వ మనునది మొదలగు

౧. ఛాం. ౩. ౧౪. ౨. సర్వకర్మా = (విశ్వ మంతయు నిర్మించినవాఁడు కాఁబట్టి) జగ మంతయుం గర్మము గాఁ గలవాఁడు. సర్వకామః = దోషరహితము లగు నెల్ల కామములుం గలవాఁడు. సర్వగంధః = సుఖకరము లగు నెల్లగంధములుం గలవాఁడు. సర్వరసః = పుణ్యము లగు నెల్లరసములుం గలవాఁడు (నగు నీశ్వరుఁడు జగము నెల్ల వ్యాపించియుండెను.)

౨. బృ. ౫. ౮. ౮. (ఓ గార్గి! నీవు దేనియం దాకాశ మోతప్రోతభావమున నున్నదని దేని నడిగితివో యది యక్షరము. ఆ యక్షరమును బ్రాహ్మణులు) అస్థూలం = స్థూలమైనదానికంటె భిన్నమైనదిగాను, అనణు = సూక్ష్మమైనదానికంటె వేఱొకటిగాను, అహ్రస్వం = హ్రస్వమైనదానికంటె నన్యముగాను, (వర్ణించుచున్నారు.)

సవి నిర్విశేషలింగములు. (నిర్విశేషం=నిర్గుణమగు బ్రహ్మము వేనిచేతను, లింగ్యతే = తెలియఁజేయఁబడు చున్నదో యవి నిర్విశేషలింగములు.) ఈ శ్రుతులం దుభయలింగ మగు బ్రహ్మము (ఉభయం=సవిశేషత్వమును నిర్విశేషత్వము నను రెండును, దేనియందు, లింగ్యతే=ప్రకాశింపఁ జేయఁబడునో యా బ్రహ్మ ముభయలింగము) ప్రతిపత్తవ్యమా? లేక యన్యతరలింగ మగు బ్రహ్మము ప్రతిపత్తవ్యమా? యెపు డన్యతర లింగము గ్రహింపఁబడునో యపుడు సవిశేషమా? నిర్విశేషమా? యను నిది విచారింపఁబడు చున్నది. అం దుభయలింగశ్రుత్యనుగ్రహమువలన (= రెండువిధము లగు శ్రుతుల ననుగ్రహించిన ట్లగును గాన) నుభయలింగ మగు బ్రహ్మమే గ్రాహ్య మని ప్రాప్తింపఁగా నిది చెప్పఁబడు చున్నది. (స్వతఏవ)=స్వయముగానే పరమగు బ్రహ్మమున కుభయలింగత్వ ముపపన్నము గాదు. పరస్పరవిరోధమువలన నొకటియే యగువస్తువు స్వయముగానే రూపాది విశేషములతోఁ గూడినదియు దానికి విపరీతమునని నిశ్చయింపరాదు గదా! అపుడుపాధి సంబంధమువలన బ్రహ్మమునకు నుభయ రూపత్వము కావచ్చు ననిన నదియు నుపపన్నము గాదు. పరస్య-స్థానతోఽపి = పరమగు బ్రహ్మమునకుఁ బృథివ్యాద్యు పాధి సంబంధమువలనను, ఉభయలింగం = సవిశేషత్వము

నిర్విశేషత్వము నను నుభయరూపత్వము, న=సంభవింపదు. ఉపాధిసంబంధమువలన నైన నన్యాదృశ్యమగు వస్తువున కన్యాదృశమగు స్వభావము సంభవింపదు. అస్వచ్ఛత్వబుద్ధి భ్రమమాత్రమే యగుటవలన స్ఫటికము స్వచ్ఛ మగుచు నలక్తకాద్యుపాధిసంబంధమువలన (=లత్తుక మొదలగువాని సంబంధమువలన) నస్వచ్ఛమైనది కాదు గదా! (ఇట్లుపాధి సత్యమేయైనను దానిచేఁ బ్రాప్తమగు విశేషము (ఎఱ్ఱందనము) మిథ్యయై కానంబడుచుండఁగా) బ్రహ్మానునం దుపాధులవిద్యాప్రత్యుపస్థాపితము లగుట (=మిథ్యయగుట) వలనఁ దత్కృతమైన విశేషము మిథ్యయని వేఱు చెప్పవలయును? కాఁబట్టి = విశేషమెల్లం గల్పితమగుటవలన నన్యతరలింగముం బరిగ్రహించినను సమస్తవిశేషరహితము నిర్వికల్పకము నగు బ్రహ్మమే గ్రాహ్యముగాని విపరీతము గ్రాహ్యము గాదు. మఱియును, సర్వత్ర హి = బ్రహ్మస్వరూపముం బ్రతిపాదించునట్టి "అశబ్ద మస్పర్శమరూపమవ్యయ" మనునది మొదలగు నెల్లశ్రుతులందు నిరాకరింపఁబడిన యెల్లవిశేషములు గల బ్రహ్మమే యుపదేశింపఁబడుచున్నది యగుటవలనను నిర్విశేష మగు బ్రహ్మమే గ్రాహ్యము.

---

౧. క. 3. ౧౫. అశబ్దం = శబ్దగుణము లేనిదియును, అస్పర్శం = స్పర్శగుణము లేనిదియును, అరూపం = రూపము లేనిదియును, అవ్యయం =

సూ. న భేదాదితిచే న్న ప్రత్యేక మతద్వచనాత్. ౧౨

ప. న - భేదాత్ - ఇతి - చేత్ - న - ప్రత్యేకమ్ - అతద్వచనాత్.

అ. శ్రుతులందు సవిశేష బ్రహ్మమే వినంబడిన నా యాయువిద్య (=ఉపాసన)లం దాకారవిశేషము వినంబడుట వలన బ్రహ్మము కేవలము నిర్విశేషమే యను నిది యుక్తము గాదనిన నుపాధులం దెల్ల బ్రహ్మమునకు నభేదమ్ముం బ్రతి పాదించుటచే న ట్లనరాదు.

భా. శ్రుతులకు బ్రహ్మము నిర్విశేషమే యనునది సమ్మత మైనను, న=బ్రహ్మము నిర్వికల్పకము నేకలింగమునే కాని దీని కుపాధివలనఁగాని స్వభావమునఁగాని యుభయలింగ త్వము కల దనరా దని యెద్ది చెప్పంబడినదో యది యుక్తము కాదు. ఎక్కారణమువలన నంటేని, భేదాత్=భేదము (=విశే షము) వలనను. "చతుష్పాద్బ్రహ్మ" (=బ్రహ్మము నాలుగు పాదములుగలది) యనియును, "షోడశకలం బ్రహ్మ" (=బ్రహ్మము పదియునాఱుకలలు (=భాగములు) గలది యనియును, "వామ నిత్వాదిలక్షణం బ్రహ్మ" (=బ్రహ్మము కర్మఫలములం బొందిం చు లక్షణము గలది) యనియును, "త్రైలోక్యశరీరం బ్రహ్మ"

---

నాశము లేనిదియును (కనుక మిక్కిలి సూక్ష్మమును నిత్యమును నగు నాత్మ స్వరూపమును దెలిసికొన్నవాఁడు సంసారమునుండి విడివడును.)

(=బ్రహ్మము మూఁడు లోకముల సముదాయమే శరీరముగాఁ గలది) యనియును, "వైశ్వానరశబ్దోదితం బ్రహ్మ" (=బ్రహ్మము వైశ్వానరశబ్దముచేఁ జెప్పంబడినది) యను పదియు మొదలుగాఁ గల భిన్నమ్ములగు నాకారములు వేఱువేఱు విద్యలందు బ్రహ్మమున కుపదేశింపఁబడుచున్నవి యను కారణమువలన బ్రహ్మము సవిశేష మనియు నంగీకరింపవలెను. అయ్యా! బ్రహ్మ ముభయలింగ మను నిది సంభవింప దని చెప్పంబడియె నంటేని యాకారభేద ముపాధికృతమగుటవలన నివియు విరోధము లేనిదియే యగును. భేదముం బ్రతిపాదించు శ్రుతులకుఁ బ్రామాణ్యమును నిర్వహింప నౌపాధిక భేదమును స్వీకరించుటవలనవిరోధము లే దని యర్థము. వేఱొకలాగున నయ్యేని భేదముం బ్రతిపాదించు శాస్త్రము నిర్విషయమే యగునను నిది ప్రసక్తించును. ఇతిచేత్ న = ఇట్లనినం బ్రసక్తింప దని చెప్పుచున్నారము. దేనివలన నంటేని, ప్రత్యేకం—అతద్వచనాత్ =ఉపాధివిశేషములం దెల్ల బ్రహ్మమున కభేదమునే, "యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమ

౧. బృ. ౨. ౫. ౧. అస్యాం - పృథివ్యాం = ఈ భూమియందుఁ, తేజోమయః=స్వప్రకాశుఁడును, అమృతమయః = మరణధర్మము లేనివాఁడును, యః—పురుషః=ఏ పురుషుఁడు, (కలఁడో) అధ్యాత్మం=దేహమునను, తేజోమయః - అమృతమయః = తేజోమయుఁడు నమృతమయుఁడు నగు,

యోఽమృతమయః పురుషో యశ్చాయమధ్యాత్మం శారీర స్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవస యోఽయ మాత్మా" యనునది మొదలగు శాస్త్రము వినిపించుచున్నది; కాఁబట్టి బ్రహ్మమునకు భిన్నాకారయోగము శాస్త్రీయ మని చెప్ప శక్యము గాదు. (భేద ముపాసనార్థ మగుట వలన శ్రుతికభేదమునందే తాత్పర్యము గనుక నుపాధిగతమైన రూపభేదమే బ్రహ్మమునం దుపచరించుచున్నది గాని యుపాధి సంబంధమువలన నైనను బ్రహ్మమునకు సత్యమైన రూప భేదము లేదని యర్థము.)

సూ. అపి చైవ మేకే. ౧3

ప. అపి - చ - ఏవం - ఏకే.

అ. మఱియుం గొన్ని శాఖలవారు భేదదర్శననిందా పూర్వకముగా నభేదమునే పఠించుచున్నారు కాఁబట్టియుఁ దాత్వికమైన భేదము శాస్త్రీయము గాదు.

భా. అపి చ=మఱియును, ఏకే = కొన్ని శాఖలవారు "మనసైవేదమాప్తవ్యం నేహనా నాస్తికించన మృత్యోస్స

---

యశ్చ-శారీరః పురుషః=ఏ జీవుఁడను పురుషుఁడు కలఁడో, సః=ఆ శరీరమునఁ బృథివియందు నున్న పురుషుఁడు, యోయమాత్మా = సర్వకారణభూతుఁ డని యేయాత్మయను ప్రతిజ్ఞాతుఁడో యతఁడే.

౧. క. ఠ. ౧౧. (ఏకత్వవిజ్ఞానముకంటెం బూర్వము శాస్త్రముచేత నాచార్యునిచేతను సంస్కృత మగు) మనసైవ=మనముచేత నే, ఇదం = ఈ

మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి” యనుచోటను, ఏవం = భేదనిందాపూర్వకముగా నభేదమునే పఠించు చున్నారు. అట్లే యితరులును “భోక్తా భోగ్యం ప్రేరితారం చమత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేత త్త్”ను చోట భోక్తయు (=జీవుఁడును) భోగ్యము (=శబ్దాదివిషయములును) నియంతయు (=ఈశ్వరుఁడు) నను స్వరూపము గల ప్రపంచమున కెల్ల బ్రహ్మైకస్వభావత్వముం జెప్పుచున్నారు (కాఁబట్టియు బ్రహ్మము నిర్విశేషమే యని సూత్రార్థము.)

౧౪. బ్రహ్మవిషయ మైన శ్రుతు లాకారము కలదని యుపదేశించునవియు నాకారము లేదని యుపదేశించునవియుఁ గలుగుచుండఁగా నెట్లు బ్రహ్మము నిరాకారమే కాని

---

నేకత్వజ్ఞానము, (=ఆత్మయొక్కఁడె గాని యతనికంటె వేఱొక టెద్దియు లేదను జ్ఞానము) ఆప్తవ్యం=పొందఁదగినది. (ఏకత్వజ్ఞానము పొందఁబడిన తరువాత నవిద్య నివృత్తి మగును గాఁబట్టి) ఇహ = ఈ బ్రహ్మమునందుఁ, నానా= భేదము, నాస్తి=లేదు. యః=ఎవఁ డవిద్యను విడువక, ఇహ=ఈ బ్రహ్మమునందుఁ, నానేవ = (కొంచెమైనను భేదముం గల్పించి) పెక్కురూపముల నున్నట్లు, పశ్యతి=చూచునో, సః=అతఁడు, మృత్యోః = సంసారమునుండి, మృత్యుం = సంసారమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు. జనన మరణ ప్రవాహమునుండి విడివడఁ డని యర్థము.

౧. శ్వే. ౧. ౧౨. భోక్తా=జీవుఁడును, భోగ్యం=విషయములు నను రెంటిని, ప్రేరితారం=వాని రెంటికిని నియంత యగు నీశ్వరునిని, మత్వా= విచారించి, మే-ప్రోక్తం=నాచేఁ జెప్పంబడిన, తత్సర్వం-త్రివిధం=మూఁడు విధములు గల యది యంతయును, బ్రహ్మ=బ్రహ్మమే యని తెలియునది.

సాకారము గాదని నిశ్చయింపవచ్చు ననిన నుత్తరముం బలికెడుచున్నాఁడు.

సూ. అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్. ౧౪

ప. అరూపవత్ - ఏవ - హి - తత్ప్రధానత్వాత్.

అ. అస్థూల[౧] మిత్యాదిశ్రుతులు రూపాదిహీన మగు బ్రహ్మమునే ప్రధానముగాఁ బ్రతిపాదించునవి కాఁబట్టి బ్రహ్మము రూపాదిహీనమే యని నిర్ధరింపవలెఁగాని రూపాదిమత్తని నిర్ధరింపరాదు.

భా. బ్రహ్మము, అరూపవదేవ = రూపాదిశూన్యమే యని నిర్ధరింపఁ బడఁదగినది గాని రూపాదిమత్తని నిర్ధరింపం దగినది కాదు. దేనివలన నంటేని, తత్ప్రధానత్వాత్ = "అస్థూల[౨] మనణ్వహ్రస్వ మదీర్ఘం, అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం, ఆకాశో[3] హవై నామరూపయో ర్నిర్వహితా, తే యదంతరా తద్బ్రహ్మ, దివ్యో[౪]హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరోహ్యజః, తదేతద్బ్రహ్మ[౫] పూర్వ మనపర మనంతర మబాహ్య మయమాత్మా బ్రహ్మసర్వానుభూ" రిత్యాది శ్రుతి

---

౧, ౨, దీని యర్థ మీ యధికరణమునను, 3, ప్రథమాధ్యాయ ప్రథమ పాదమున నాకాశాధికరణమునను, ౪, ప్రథమాధ్యాయ ద్వితీయపాదమున నదృశ్యత్వాధికరణమునను, ౫, ప్రథమాధ్యాయ ప్రథమపాదమున సమన్వయాధికరణమునను వ్రాయంబడెను.

వాక్యములు నిష్ప్రపంచ బ్రహ్మాత్మ స్వరూప ప్రతిపాదనమే ప్రధానముగాఁ గలవి గాని వేఱొక ధర్మమును బ్రతిపాదించుట ప్రధానముగాఁ గలవి కావను నిది సమన్వయాధికరణమునం బ్రతిపాదింపఁ బడియెఁ గాఁబట్టి యిట్టి వాక్యములందు యథాశ్రుతముగా నిరాకారమగు బ్రహ్మమే యవధారితవ్యము. ఇతరములగునవి (= బ్రహ్మము సాకార మని ప్రతిపాదించు వాక్యములు) బ్రహ్మస్వరూప ప్రతిపాదనము ప్రధానముగాఁ గలవి కాక యుపాసనావిధిప్రధానములు కాఁబట్టి వానియందు విరోధములే నిది యగుచునుండఁగా శ్రుత మగునర్థము నాదరింపవచ్చును. విరోధము గలుగుచుండఁగా బ్రహ్మస్వరూపప్రతిపాదనము ప్రధానముగాఁ గల వాక్యములు స్వరూపప్రతిపాదనప్రధానములు కాని వానికంటె బలీయసము లగును. దేనిచే నుభయ విధములగు శ్రుతులు నున్నవి యగుచునుండఁగా బ్రహ్మము నిరాకారమనియే నిర్ధరింపవలెఁ గాని సాకార మని నిర్ధరింపరాదో యట్టి యిదియే (= స్వరూపముం బ్రతిపాదించు శ్రుతులు తక్కిన వానికంటె బలవత్తరము లనుటయే) వినిగమనమున హేతువు.

అవ. బ్రహ్మ మాకారము గల దని (సగుణ మని) చెప్పుశ్రుతులకు గతి యేమనినం జెప్పుచున్నాఁడు.

సూ. ప్రకాశవచ్చావైయర్థ్యం. ౧౫.

ప. ప్రకాశవత్ - చ - అవైయర్థ్యం.

అ. సౌరాది తేజమువలె బ్రహ్మము నుపాధిసంబంధమువలన నాయాయుపాధుల యాకారముం బొందినదివలె నుండును. బ్రహ్మమునకుం గల్పిత మైనయట్టి యాకారమునుపాసనార్థము ప్రతిపాదించుటయే సాకారబ్రహ్మప్రతిపాదక వాక్యములకు గతి.

భా. ప్రకాశవత్-చ = ఎట్లాకాశమున వ్యాపించిన సౌరతేజము గాని చాంద్రమసతేజము గాని యంగుళులు మొదలగు నుపాధుల సంబంధమువలన నవి ఋజువక్రాదిభావమును బొందినవి యగుచునుండఁగాఁ దద్భావముం బొందినవివలె నుండునో యట్లే బ్రహ్మమును బృథివ్యాదు లగు నుపాధుల సంబంధమువలన వాని యాకారమును బొందినదివలె నుండును. బ్రహ్మమున కుపాసనార్థ మట్టి యాకార మాలంబనముగాఁ గల యాకారవిశేషోపదేశము విరోధింపదు. అవైయర్థ్యం=ఇట్లు బ్రహ్మమున కాకారము గలదని యుపదేశించు వాక్యములకు వైయర్థ్యాభావము = సార్థక్యము కాఁగలదు. వేదవాక్యము లన్నిటికిఁ బ్రామాణ్యము సమానమే యగుట వలన వానిలో నొకదాని కర్థము కలదు; వేఱొకదాని కర్థము లేదు నని తెలియు యుక్తము కాదు గదా! అయ్యా!

యిట్లయినను (శ్రుతులకు మీఁదఁ జెప్పినరీతిచే వ్యవస్థ యంగీకరింపఁబడినను) నుపాధిసంబంధమువలనను బ్రహ్మ ముభయలింగము కాదని మున్ను చేయంబడిన ప్రతిజ్ఞ విరోధించు ననిన నుపాధినిమిత్తమైన దానికి సత్యత్వము సిద్ధింపదు గావున నుపాధు లవిద్యాకల్పితము లగుటవలనను విరోధింప దని చెప్పుచున్నారము. (ద్వైతము మిథ్యయైయుండెనేని జ్ఞానముచే బాధింపంబడుటవలన నుపాసనాదివ్యవహారము లేకపోవు నని శంకించుకొని బాధమునకుం బూర్వమే యీ వ్యవహార మని చెప్పుచున్నాము.) మఱియు స్వాభావికమైన యవిద్య యున్నది యగుచునుండఁగనే లోకవ్యవహారమును వేదవ్యవహారము నవతరించు నని యటనటం జెప్పితిమి.

సూ. ఆహ చ తన్మాత్రం. ౧౬

ప. అహ - చ - తన్మాత్రం.

అ. ఎక్కారణమువలన శ్రుతి బ్రహ్మము కేవలచైతన్యస్వరూపమే యని చెప్పుచున్నదో యా కారణమువలనను విశేషము మిథ్యయే.

భా. "[1]స యథా సైంధవఘనోఽనంతరోఽబాహ్యః

---

౧. బృ. ౬. ౫. ౧౩ అరే=ఓమైత్రేయీ! సః-సైంధవఘనః=ప్రసిద్ధమగు నుప్పుగడ్డ, యథా=ఎట్లు, అనంతరః = లోపల వేఱు రసము లేనిదియును, అబాహ్యః= వెలుపల వేఱు రసము లేనిదియునై, కృత్స్నః=సర్వమును, రసఘనః-ఏవ=లవణైకరసమో, ఏవంవై =ఇట్లే, అయమాత్మా=ఈ

కృత్స్నో రసఘన ఏవ ఏవంవా ఆరే ఆయమాత్మాఽనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ” యను శ్రుతి బ్రహ్మమును, తన్మాత్రం = చైతన్యమాత్రముగాను, విలక్షణ మగు వేఱొకరూపము లేనిదిగాను, ఆహచ = చెప్పుచున్నది; కావున యిదియు నిర్విశేష మే. ఎట్లు సైంధవఘనమునకు (=ఉప్పుగడ్డకు) లోపలను వెలుపలను నిరంతర మగు లవణరసమే కలదు గాని రసాంతరము లేదో యట్లే యీ యాత్మునకును లోపల నైనను వెలుపల నైనను నిరంతర మగు చైతన్య మే స్వరూపము గాని చైతన్యముకంటె నితర మగు రూపము లేదను నిది (యీ శ్రుతిచే) జెప్పంబడినది యగుచున్నది.

సూ. దర్శయతి చాథో అపి స్మర్యతే. ౧౭

ప. దర్శయతి - చ - అథో - అపి - స్మర్యతే.

అ. మఱియు శ్రుతిస్మృతులందు నిషేధద్వారముననే బ్రహ్మ ముపదేశింపఁబడుటవలన నది నిర్విశేష మే.

భా. “అథాత ఆదేశో నేతి నేతి, అన్య దేవతద్విదితాదథో అవిదితాదధి, యతో[3] వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ”

---

యాత్ముఁడు లోపలను వెలుపలను వేఱు రసములు లేనివాఁడై, కృత్స్నః - ప్రజ్ఞానఘన ఏవ = కేవలచైతన్యమాత్రుఁడే.

౧. బృ. ౪. 3. ౬. అథ = ద్వైతమును నిరూపించిన తరువాతను, అతః = అది జ్ఞానహేతు వగుటవలనను, నేతి - నేతి = ఇది కా దిది కా దనునట్టి, ఆదేశః = నిషేధరూపమగు నుపదేశము (చేయంబడుచున్నది.)

యనునది మొదలగు శ్రుతి (జాతము) దర్శయతిచ = పర రూపము నిషేధించు ద్వారముననే బ్రహ్మము నుపదేశించు చున్నది కాఁబట్టియు నది నిర్విశేషమే. బాహ్వుఁడు బాష్కలిచే నడుగంబడినవాఁడై లఘువచనముచేతనే బ్రహ్మము నుపదేశించె నని "సహోవాచాధీహి భో ఇతి సతూష్ణీంబభూవ తంహ ద్వితీయేవా తృతీయేవాపచన ఉవాచ బ్రూమః ఖలు త్వంతు నవిజానాసి ఉపశాంతో యమాత్మా" యను శ్రుతి యందు వినంబడుచున్నది. అథో-స్మర్యతేపి=అట్లే "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్ఞాత్వామృతమశ్నుతే అనాదిమత్పరం బ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే" యనునది మొదలగు స్మృతి యందును బ్రహ్మము పర ప్రతిషేధద్వారముచేతనే యుపదేశింపఁబడుచున్నది. అట్లే "మాయాహ్యేషామయాసృష్టా[3]

---

౨. కే. ౩ (ఎద్ది ప్రకృతమున శ్రోత్రాదులకు శ్రోత్రమును వాని కవిషయము నని చెప్పంబడినదో) తత్ = అది (=బ్రహ్మము) విదితాత్ = తెలిసిన దానికంటెను, వ్యాకృతమైన యెల్ల ప్రపంచముకంటె నని యర్థము. అన్యత్ = వేఱొకటి, అథో = మఱియును, అవిదితాత్ = తెలియనిదానికంటెను (=వ్యాకృతబీజమగు నవిద్యకంటెను) అధి=మీఁద నున్నది. భిన్నమైన దని యర్థము. తెలిసికొనువానికంటె భిన్నమైన దెల్లను విదితము నవిదితము నని ద్వివిధము. అవి రెండును బ్రహ్మము కావని నిషేధించుటచేఁ దెలిసికొను వాని స్వరూపము బ్రహ్మ మని యాగమతాత్పర్యము.

౩. ఇది ప్రథమాధ్యాయమున నానందమయాధికరణమున వ్యాఖ్యాతము.

౧. సః=బాష్కలి, (బాహ్వంజేరి) భోః=అయ్యా! అధీహి-ఇతి= బ్రహ్మోపదేశముం జేయుమని, ఉవాచహ=ప్రశ్నించెనఁట. (తాని) సః=

యన్మాం పశ్యసి నారద సర్వభూతగుణైర్యుక్తం నైవం మాం జ్ఞాతు మర్హసి" యని, విశ్వరూపధరుఁ డగు నారాయణుఁడు నారదునితోఁ జెప్పినట్లును (ఐతిహాసికులచే) స్మరింపఁబడుచున్నది.

సూ. అత ఏవచోపమా సూర్యకాదివత్.

ప. అతః - ఏవ - చ - ఉపమా - సూర్యకాదివత్.

---

బాష్కలి, తూష్ణీంబభూవ = ఊరకుండెను. తం = మరల మరల నిర్బంధించుచున్న యతనిని, ద్వితీయే తృతీయేవా - వచనే = రెండవ ప్రశ్నమునందును మూఁడవ ప్రశ్నమునందును బాహ్వుఁడు తూష్ణీంభావమును విడిచి, అయమాత్మా = ఈయాత్ముఁడు, ఉపశాంత ఇతి = ఉపశాంతస్వరూపుఁ డని (= నిరస్తద్వైతుఁ డని) తూష్ణీంభావముననే, బ్రూమః = చెప్పుచున్నారము. కాని, త్వం = నీవు, నవిజానాసిఖలు = తెలిసికొనలేకపోయితివి కదా యని, ఉవాచ = పలికెను.

౨. భగ. అ. ౧౩. శ్లో. ౧౨ యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొని, అమృతం = మోక్షమును, అశ్నుతే = పొందుచున్నాఁడో, తత్ - జ్ఞేయం = అజ్ఞాతవ్యమగు వస్తువును, ప్రవక్ష్యామి = స్పష్టముగాఁ జెప్పుచున్నాను. అనాదిమత్ = ఆది లేని, పరం = నిరతిశయమగు, బ్రహ్మ = అంతటను వ్యాప్తమగు నాత్మవస్తువు (జ్ఞేయము.) తత్ = అది, స్వప్రకాశ మగుటవలనను) సత్ = ఇంద్రియవేద్యమని, నోచ్యతే = చెప్పంబడదు. అసత్ = పరోక్షమనియును, నోచ్యతే = చెప్పంబడదు.

౩. భార. శాం. ౩౩౯ అ. శ్లో. ౪౪. నారద = ఓ నారదుఁడా! సర్వభూతగుణైః = పృథివ్యాదులగు నెల్లభూతములయొక్క గుణములగు దివ్యగంధాదులతోడను, (ఎల్లజంతువులయొక్క ధర్మము లగు జనకత్వము పాలకత్వము మొదలగు ధర్మములతోడ ననియైన చెప్పవచ్చును.) యుక్తం = కూడిన, మాం = మూర్తిమంతుఁడ నగు నన్నును, పశ్యసీతి యత్ - ఏషా = చూచుచున్నావనునది, మయా = నాచేతను, సృష్టా = కల్పింపఁబడిన, మాయా = మాయ. (కనుకనే) మాం = నన్నుగా, ఏవం = ఈ ప్రకారముగాను, (= భగవంతుఁడు సద్వైతుఁ డని) జ్ఞాతుం-నార్హసి = తెలిసికొనందగవు. స్వభావము నద్వైతాతీతుఁడ నగుటవలన నట్లు తెలిసికొనందగ దని యర్థము.

అ. ఏకాకారణమువలన నీయాత్ముఁడు కేవల చైతన్యస్వరూపుఁడు నిర్విశేషుఁడునో యాకారణమువలననే యతని కుపాధిప్రాప్తమైన విశేషము నవలంబించి వేదాంతములందు జలగతసూర్యప్రతిబింబ మనుపమానముగా గ్రహింపఁబడుచున్నది.

భా. అతః - ఏవ=ఏకాకారణమువలనః నీ యాత్ముఁడు చైతన్యస్వరూపుఁడు నిర్విశేషుఁడు వాఙ్మనసాతీతుఁడుం బరప్రతిషేధముచే నుపదేశ్యుఁడునో యా కారణమువలననే యాతని కుపాధినిమిత్తము నపారమార్థికము నగు విశేషవత్త్వమును స్వీకరించి "యథాహ్యయం జ్యోతిరాత్మా వివస్వానపో భిన్నా బహుధైకోఽనుగచ్ఛన్నుపాధినా క్రియతే భేదరూపో దేవః క్షేత్రేష్వేవ మజోయమాత్మా; ఏక ఏవహి భూతాత్మా భూతే

---

౧. అయం=ఈ, జ్యోతిరాత్మా=తేజోమయుఁడగు, వివస్వాన్=సూర్యుఁడు, ఏకః=ఒకఁడే యయ్యును, యథా హి=ఎట్లుగాను, భిన్నాః=ఘటాదిభేదముచే భిన్నములగు, అపః=ఉదకములను, అనుగచ్ఛన్=ప్రవేశించుచున్నవాఁడగుచున్, బహుధా-క్రియతే=అనేకప్రకారములుగాఁ జేయుంబడుచున్నాఁడో, ఏవం=ఇట్లే, అజః=జన్మరహితుఁడును, దేవః=స్వప్రకాశుఁడు నగు, అయమాత్మా=ఈయాత్ముఁడును,(ఒక్కఁడే యైనను) ఉపాధినా=మాయచేతను, క్షేత్రేషు=శరీరములందున్, అనుగచ్ఛన్=ప్రవేశించుచున్నవాఁడగుచున్, భేదరూపః-క్రియతే=వేఱురూపము కలవాఁడుగాఁ జేయంబడుచున్నాఁడు.

౨. అమృతబిందు. ౧౨ భూతాత్మా=పరమేశ్వరుఁడు, ఏక ఏవ=ఒకఁడే, జలచంద్రవత్=జలములందలి చంద్రునితో సమానముగాన్,

భూతే భూతే వ్యవస్థితః ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్" అనునది మొదలగు మోక్షశాస్త్రములలోను, సూర్యకాదివత్-ఉపమా=సూర్యకాదివత్తని (జలగతమైన సూర్యప్రతిబింబముం బోలిన దని) యుపమానము గ్రహింపఁబడుచున్నది. సూర్యక యనుచోఁగ ప్రత్యయము జలమునం దున్న ప్రతిబింబాకారమున సూర్యున కాభాసత్వమును దెలుపును. (ఈ దృష్టాంతబలమువలన బ్రహ్మము నిర్విశేషమే యని సూత్రకర్త యభిప్రాయము.)

అవ. ఇట(=మీఁదటి దృష్టాంతమున)ఁ బూర్వపక్షము చేయంబడుచున్నది.

సూ. అంబువ దగ్రహణాత్తు న తథాత్వం. ౧౯

ప. అంబువత్-అగ్రహణాత్-తు-న-తథాత్వం.

అ. ఆకారము గల సూర్యునకు మూర్తమును దూరస్థమునగు నుపాధియైన జలమునకు వలె బ్రహ్మమునకు మూర్తమును దూరస్థము నగు నుపాధికి (=అంతఃకరణము మొదలగు దానికి) నుపలంభము లేదు కాఁబట్టియు నాత్మనీరూపము గనుకను జలసూర్యకాది దృష్టాంత మువపన్నము గాదు.

---

భూతేభూతే=ఎల్లజంతువులందును, వ్యవస్థితః=నిలిచియున్నవాఁడై, ఏకధా బహుధా చైవ = ఏకప్రకారముగాను ననేకప్రకారములంగాను, దృశ్యతే = చూడంబడుచున్నాఁడు.

భా. తథాత్వం = ఆత్మనందు జలగతసూర్యాదితౌల్య్వము, న=యుక్తము గాదు. అంబువత్ - అగ్రహణాత్ =మూర్తములగు సూర్యాదులకంటె భిన్నమును దూరదేశమున నున్నదియు మూర్తము నగు జలమ్మున కుపలంభము కలదు గనుక నట సూర్యాదిప్రతిబింబోదయము యుక్తము. ఆత్మయందు మూర్తి లేనివాఁడు; సర్వగతుఁడు; నన్నిటికంటె నన్యుఁడు కానివాఁడు గాఁబట్టి యాతనికంటెఁ బృథగ్భూతములు విప్రకృష్టదేశమునం దున్నవియు నగు నుపాధుల కుపలంభము లేదు కాఁబట్టి యీ దృష్టాంతము, నయు=యుక్తము కాదని (పూర్వపక్షము చేయంబడుచున్న దను వెనుకటి క్రియతో నన్వయము.)

అవ. మీఁదటి పూర్వపక్షమున కుత్తరము చెప్పంబడుచున్నది.

సూ. వృద్ధిహ్రాసభాక్త్వ మంతర్భావా దుభయసామంజస్యా దేవం. ౨౦

ప. వృద్ధిహ్రాసభాక్త్వం - అంతర్భావాత్ - ఉభయసామంజస్యాత్ - ఏవం.

అ. జలాద్యుపాధులం బ్రవేశించిన సూర్యాదులెట్లు జలగతమైన వృద్ధిక్షయాదుల నొందుట వాస్తవము కాదో యట్లే దేహాద్యుపాధులం బ్రవేశించిన బ్రహ్మమును వాని ధర్మములం బొందుట వాస్తవము కాదను నీయంశమున రెంటికి

సారూప్యము కలదు కాఁబట్టి దృష్టాంతదార్ష్టాంతికములకు విరోధము లేదు.

భా. వివక్షింపఁబడిన యంశము సంభవించుటవలన నీ దృష్టాంతము యుక్తమే. ఎక్కడనైనను దృష్టాంతదార్ష్టాంతికములకు వివక్షింపఁబడిన యొద్దియే నొక యంశమును విడిచి సర్వసారూప్య మెవ్వనిచేతను జూపింప శక్యము గాదు గదా! సర్వవిధములచే సారూప్యము గలుగుచుండఁగా దృష్టాంత దార్ష్టాంతిక భావమునకు విచ్ఛేదమే యగును. మఱియు నీ జల సూర్యకాద్యుపమానము స్వబుద్ధిచేతం గల్పింపఁబడినది కాదు. శాస్త్రముచేఁ జెప్పంబడినదీనికిఁ బ్రయోజన (=ఆత్మని యొక్క నిర్విశేషత్వజ్ఞాన మను ఫల) మాత్ర ముపన్యసింపఁ బడుచున్నది. ఇట వివక్షింపఁ బడిన సారూప్య మెద్ది యనిన నది, వృద్ధి హ్రాసభాక్త్వ మని (= వృద్ధిక్షయములం బొందుట యని) చెప్పంబడు చున్నది. జలమునందలి సూర్యప్రతిబింబము జలము వర్ధిల్లిన దగుచు నుండఁగా వర్ధిలుచున్నది. జలము తగ్గిన దగుచు నుండఁగాఁ దగ్గు చున్నది. జలము చలింపఁగాఁ జలించుచున్నది. జలభేదము గలుగుచుండఁగా భేదిల్లుచున్నది. ఇట్లే జలధర్మముల ననుస రించినది యగుచున్నది. కాని పరమార్థమున సూర్యుని కట్టి వృద్ధి హ్రాసభాక్త్వము లేదు. ఇట్లే బ్రహ్మము పరమార్థమున

నవికృతము నేకరూపము నగుచున్నను, అంతర్భావాత్ = దేహా ద్యుపాధులం బ్రవేశించుటవలన నుపాధిధర్మము లగు వృద్ధి హ్రాసాదులం బొందుచున్నదివలె నుండును. ఏవం=ఈప్రకా రముగాను, ఉభయసామంజస్యాత్ — ఉభయ = దృష్టాంత దార్ష్టాంతికములు రెంటికిని, సామంజస్యాత్ = సామంజస్యము సంభవించుటవలన విరోధము లేదు.

సూ. దర్శనా చ్చ. ౨౧

ప. దర్శనాత్ — చ.

అ. శ్రుతిపర మగు బ్రహ్మమునకే దేహాద్యుపాధుల లోఁ బ్రవేశము చూపుచున్నది కాఁబట్టియు నీ దృష్టాంతము యుక్తమే.

భా. దర్శనాత్—చ = "పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః పురస్సపక్షీభూత్వాపురః పురుష ఆవిశ త్తు"ని యును "అనేన జీవేనాత్మా నానుప్రవిశ్య" యనియు శ్రుతి పరమగు బ్రహ్మమునకే దేహాదులగు నుపాధులం దను

౧. బృ. ఉ. ౫. ౧౮ (సర్వజ్ఞుఁ డగు నీశ్వరుఁడు) ద్విపదః = రెండు పాదములుగల, పురః = శరీరములను(మనుష్యశరీరములనని యర్థము.) చక్రే = నిర్మించెను. (మఱియు నతఁడు) చతుష్పదః = నాలుగుపాదములు గల, పురః = శరీరములను, (పశుశరీరముల నని యర్థము.) చక్రే = నిర్మించెను. (ఇట్లు సృజించి) పురః = చక్షురాద్యభివ్యక్తికం బెం బూర్వము, సః = సర్వజ్ఞుఁ డగు నీశ్వరుఁడు, పక్షీభూత్వా = లింగశరీరి యై, పురః = మున్ను తాను నిర్మించిన శరీరములను, ఆవిశత్ = ప్రవేశించెను.

ప్రవేశముం జూపుచున్నది కాఁబట్టియు నీ జలసూర్యకాది దృష్టాంతము యుక్తమే. ఈ ప్రకారముగాఁ బ్రతిబింబభావమున భేదము మొదలగునది కల్పిత మగుటవలన బ్రహ్మము నిర్వికల్పకైక లింగమే కాని యుభయలింగము కాని విపరీత లింగము కాని (=సవిశేషము గాని) కాదను నిది సిద్ధము. మీఁద వ్యాఖ్యానింపంబడిన సూత్రములందుఁ గొందఱు రెం డధికరణములం గల్పించు చున్నారు. "నస్థానత" యనునది మొదలుగా మొదటి యధికరణము ప్రవృత్త మైనది. అందు బ్రహ్మము నిరాకరింపఁబడిన యెల్ల విశేషములు గలయేకాకారమా? లేక ప్రపంచము వలె ననేకాకారమా? యనునది విచారింపఁబడుచున్నది. "ప్రకాశవచ్చ" యను సూత్ర మాదిగా రెండవ యధికరణ మారంభింపఁబడినది. మొదటి యధికరణమున బ్రహ్మమునకు నిష్ప్రపంచత్వ మున్నది యగుచు నుండఁగా (బ్రహ్మ మేమి లక్షణము కలదను సందేహమున) నది సల్లక్షణమా? బోధలక్షణమా? కాక యుభయ లక్షణమా? యనునది రెండవ యధికరణమున విచారింపఁబడుచున్నది. ఇట నెల్లవిధములచేతను (సందేహమును ఫలము నున్నను) రెండవ యధికరణము నారంభించుట నిరర్థకమే యని మేము చెప్పుచున్నారము. పర మగు బ్రహ్మమున కుభయలింగత్వము (అనేకరూపత్వము) నిరాక

రింపవలయు నను కారణమున నీ ప్రయాస మనిన నది "నస్థా నత" యను పూర్వాధికరణము చేతనే నిరాకరింపఁ బడినది కాఁబట్టి "ప్రకాశవచ్చ" యను రెండవ యధికరణము వ్యర్థమే యగును. మఱియును "విజ్ఞానఘన ఏవ" యనునది మొదలగుదానికి వైయర్థ్య ప్రసంగము వలన బ్రహ్మము సల్లక్షణమే కాని బోధలక్షణము కా దని చెప్పను శక్యము కాదు. (బ్రహ్మమునకు బోధరూపత్వ నిరాసము గల్గు చుండఁగా జడత్వ ప్రాప్తివలన జీవాభేద శ్రుతులకు బాధము నగు నని చెప్పుచున్నాఁడు.) ఎట్లు నిరస్తచైతన్య మగు బ్రహ్మము చేతనుఁ డగు జీవునకు నాత్మ యని యుపదేశింపఁ బడును? "అస్తీత్యేవోపలబ్ధవ్య" యనునది మొదలగు శ్రుతులకు వైయర్థ్యప్రసంగమువలన బ్రహ్మము బోధలక్షణమే కాని సల్లక్షణము గాదనియుం జెప్పరాదు. ఎట్లు బోధము నిరస్తసత్తాక మని (=తుచ్ఛ మని) యంగీకరింపఁబడవచ్చును? వెనుకటిసిద్ధాంతమునకు (=బ్రహ్మము నిర్విశేషైకాకారమే యను సిద్ధాంతమునకు) విరోధము ప్రసక్తించుటవలన బ్రహ్మముభయలక్షణ మనియుం జెప్పనశక్యము. బ్రహ్మము సత్తాభిన్న మగు బోధముతోడను బోధభిన్న మగు సత్తతోడను

౧. క. ఉ. ౧౩. (కాఁబట్టి జగమునకు మూల మగు నాత్ముఁడు) అస్తీత్యేవ=కలఁ డనియే, ఉపలబ్ధవ్యః=తెలియందగినవాఁడు.

గూడినది యని ప్రతిజ్ఞ చేయువానికిఁ బూర్వాధికరణముచే షేధింపఁబడిన సత్ప్రపంచత్వమే బ్రహ్మమునకుఁ బ్రసక్తించును. ఒకదానికిం బెక్కు స్వభావముల కలిమి యుపపన్నము గాదు కాఁబట్టి శ్రుతులచే నట్లు చెప్పంబడుటవలన నిది దోషము కాదని చెప్పరాదు. పక్షాంతరమున సత్తయే బోధము బోధమే సత్త "క్కాని" వీనికి రెంటికిని బరస్పరభేదము లేదని చెప్పంబడునేని యట్లైనయెడ బ్రహ్మము సల్లక్షణమా? లేక బోధలక్షణమా? కాక యుభయలక్షణమా? యను నీ వికల్పము నిరాలంబమే యగును. మూఁడు సూత్రము లన్నియు నొక్క యధికరణముగానే యన్వయింపఁబడినవి. మఱియు బ్రహ్మవిషయము లగు శ్రుతు లాకారము కలది యనియు నిరాకార మనియుఁ బ్రతిపాదించుటచేఁ బరస్పరవిరుద్ధము లగుచునుండఁగా నిరాకారబ్రహ్మము పరిగ్రహింపఁబడినపు డితరశ్రుతుల కవశ్యము గతిం బ్రతిపాదింపవలెను గాఁబట్టి తాదర్థ్యమునఁ దక్కినవి "ప్రకాశవచ్చ" యనునది మొదలగు సూత్రము లర్థవత్తరము లగుచున్నవి. (రెండధికరణములం గల్పించువారు) బ్రహ్మము సాకార మని బోధించు శ్రుతులును బ్రపంచప్రవిలయద్వారమున నిరాకారబ్రహ్మప్రతిపత్త్యర్థములే కాని వేఱర్థములు కలవి కావని దేనిం జెప్పుచున్నారో యదియును సమీచీనము వలెఁ గాన్పింపదు.

ఎట్లంటేని పరవిద్యా (=నిర్గుణవిద్యా) ప్రకరణమున "యుక్తా[1] హ్యస్య హారయశ్శతాదశేత్యయం వై హారయోఽయం వై దశ చ సహస్రాణి బహూని చానంతాని చ" యనునది మొదలుగా నేకొన్ని విశేషములు చెప్పంబడుచున్నవో యవి "తదేతద్బ్రహ్మాపూర్వ మనపర మనంతర మబాహ్య" మని యుపసంహరించుటవలనఁ బ్రపంచప్రవిలయార్థములు గావచ్చును; కాని యెవ్వి కొన్ని విశేషము లుపాసనముల విధించు ప్రకరణమునను "మనోమయః ప్రాణశరీరో భారూపః" యనునది మొదలగునవి చెప్పంబడుచున్నవో యవి "స క్రతుం[3] కుర్వీత" యనునది మొదలగు ప్రకృతమైన యుపాసనవిధికోసమే సంబంధించినవి యగుటవలన వానికిఁ బ్రవిలాపనార్థత్వము న్యాయ్యము

---

౧. బృ. ౪. ౫. ౧౯. అస్య=ఈ ప్రత్యగాత్మునకు, హరయః = ఇంద్రియములు, (గుఱ్ఱములు రథమునకు వలె నాత్మునకు రథస్థానీయ మగు శరీరమునను) యుక్తాః= (వాని విషయప్రకాశమునకై) కూర్పంబడినవి. (ఈ యింద్రియములు) శతా=శతాని, దశ=ప్రాణిభేదమున ననేకము లగుచున్న వని యర్థము. అపు డింద్రియములు వేఱు పరమేశ్వరుఁడు వేఱు నని ప్రాప్తింపఁగా నిది చెప్పంబడుచున్నది. దశచ, సహస్రాణి చ-బహూని చ-అనంతాని చ హరయః=ప్రాణిభేదములవలన ననేకము లగుచున్న యింద్రియము లన్నియును నని యర్థము. అయం వై = ఈ పరమేశ్వరుఁడే. (సెకృ—లేల?) ఏతత్ = మీఁదఁ జెప్పంబడిన, యీ బ్రహ్మ = బ్రహ్మము, (ఏయాత్మము) అపూర్వం-అనపరం=వాస్తవమగు కార్యముం గారణము లేనిదియును, అనంతరం-జాత్యంతరము లేనిదియును, అబాహ్యం=వెలుపల లేనిదియునో, తత్ = అదియే. (ఆ యీ యాత్మ యెద్ది యంటేని ద్రష్టయు శ్రోతయు బోద్ధయు విజ్ఞాతయు నై సర్వము ననుభవించు ప్రత్యగాత్మయే.)

౩. ఇవి ద్వితీయాధ్యాయమున సర్వత్ర ప్రసిద్ధ్యధికరణమున వ్యాఖ్యాతములు.

కాదు. మఱియును శ్రుతిచే (=ముఖ్యవృత్తిచే) నిట్టి గుణము లుపాసనార్థము లని ప్రతిపాదింపఁబడుచుండఁగా లక్షణచేఁ బ్రవిలయార్థత్వముం గల్పింపఁబడు ననుట యాయుక్తము. మఱియు నెల్లశ్రుతులకుఁ బ్రవిల్లయార్థత్వము సాధారణ మగుచుండఁగాను "అరూపవ దేవ హి"యను వినిగమనకారణవచనము నిరర్థకము కావలెను. (కొన్ని శ్రుతు లైనను సవిశేష బ్రహ్మముం బ్రతిపాదించుచు నుపాసనాపరములు కావేని యని యుం బ్రవిలయార్థము లగుటచే బ్రహ్మప్రధానములే కాఁబట్టి యపు డివి ధ్యానప్రధానము లివి ప్రవిలయప్రధానము లని వినిగమము లేకపోవలెను. అట్లగుచునుండఁగాను "అరూపవదేవహి తత్ప్రధానత్వాత్" ను సూత్రము వ్యర్థ మగు నని తాత్పర్యము.) మఱియు నుపాసనార్థకవాక్యములకు ఫలము నుపదేశానుసారముగా నొకచో దురితక్షయమును వేఱొకచో నైశ్వర్యప్రాప్తియు మఱియొకచోఁ గ్రమముక్తియు నని వినం బడుచున్నదియే కాఁబట్టి యుపాసనవాక్యములకును బ్రహ్మ వాక్యములకును వేఱువే ఱర్థముల కలిమియే న్యాయ్యము గాని, యేకవాక్యత్వము న్యాయ్యము కాదు. ఎట్లేకవాక్యత్వ మీవాక్యముల కూహింపఁబడుచున్నదో చెప్పవలెను? బ్రహ్మ వాక్యములందు నియోగాభావమువలనఁ బ్రయాజదర్శపూర్ణ మాసవాక్యములకు వలె నేకనియోగప్రతీతివలన నేకవాక్యత

యగు ననరాదు. బ్రహ్మవాక్యములు వస్తుమాత్రముం బ్రతి పాదించునవి కాని నియోగము నుపదేశించునవి కా వనునిది "తత్తు సమన్వయాత్తు"ను సూత్రముకడ మిక్కిలి స్థిరపఱుపం బడియె. మఱియుఁ జేయుమని నియోగింపఁబడుచున్న పురుషుఁడు తన వ్యాపారమున దేనియం దైన నియోగింపఁబడు చున్నాఁడు గదా! ఇట నియోగ మేమి విషయము కల దని యభిప్రేతమో చెప్పవలసియున్నది. అయ్యా! ద్వైతప్రపంచ ప్రవిలయమే నియోగమునకు విషయము కాఁగలదు. ద్వైతప్రపంచము ప్రవిలాపితము కానిది యగుచునుండఁగా బ్రహ్మతత్త్వావబోధము కాదు కాఁబట్టి దానికిఁ బ్రతిబంధకమగు ద్వైతప్రపంచము ప్రవిలాప్యము; ఎట్లు స్వర్గముం గోరువానికి యాగమనుష్ఠాతవ్య మని యుపదేశింపఁబడుచున్నదో యట్లే యపవర్గముం గోరువానికిఁ బ్రపంచప్రవిలయ ముపదేశింపఁబడుచున్నది; మఱియు నెట్లు చీఁకటిలో నున్న ఘట స్వరూపముం దెలియంగోరువానిచే దానికిం బ్రతిబంధకమైన తమము ప్రవిలాపింపఁజేయంబడు చున్నదో యట్లే బ్రహ్మస్వరూపముం దెలియంగోరువానిచే దానికిం బ్రతిబంధకమగు ప్రపంచము ప్రవిలాపయితవ్య మని యుపదేశింపఁబడు చున్నది; ప్రపంచము బ్రహ్మస్వభావము గాని బ్రహ్మము ప్రపంచస్వభావము కాదు గాఁబట్టి నామరూపప్రపంచ

ప్రవిలాపనముచే బ్రహ్మజ్ఞానము గలుగు ననిన నిటఁ బ్రపంచ ప్రవిలయము నా నెద్ది? అగ్నిప్రతాపసంపర్కమువలన ఘృత కాఠిన్యమునకుం బ్రవిలయమువలె (సత్య మగు) ప్రపంచము నకుం బ్రవిలయము కర్తవ్యమా? లేక యొక చంద్రునకు నేత్రరోగముచేఁ జేయంబడిన యనేకచంద్రప్రపంచము వలె బ్రహ్మమునం దవిద్యాకల్పిత మైన నామరూపప్రపంచము విద్యచేఁ బ్రవిలాపయితవ్యమా? యని మే మడుగుచున్నా రము. అందు విద్యమాన మగు (=సత్యమైన) దేహాదిలక్షణ మైన యాధ్యాత్మికప్రపంచమును బృథివ్యాదిస్వరూప మగు బాహ్యప్రపంచమును బ్రవిలాపయితవ్య మని చెప్పంబడు నేని యది పురుషమాత్రునిచేఁ బ్రవిలాపింప నశక్యము గాఁబట్టి దాని ప్రవిలయోపదేశ మశక్యవిషయమే యగును= సత్యమగుప్రపంచము జ్ఞానమువలన నశింపదు గనుకను శుక లాదులచే నెల్ల ద్వైతప్రపంచమును నశింపఁజేయుట సంభవిం పదు గనుకన్నునభమును మ్రింగవలెనను విధివలెనేయీవిధియు నశక్యవిషయమే యగు నని యర్థము. మఱియు (ననాదియగు నీ ప్రపంచమున) మున్ను ముక్తుఁడైన యెవ్వనిచే నైన నొక నిచేఁ బృథివ్యాదిప్రపంచప్రవిలయము చేయంబడియే యుం డును గాఁబట్టి యిపుడు జగము పృథివ్యాదిశూన్యమే యై యుండును. పక్షాంతరమున నేకాకార మగు బ్రహ్మమునం

దవిద్యచేఁ గల్పింపఁబడిన ప్రపంచము విద్యచేఁ బ్రవిలాపింపంబడుచున్న దని చెప్పనేని యప్పు డవిద్యచే నారోపింపఁబడిన ప్రపంచమును నిరాకరించి "[1]ఏక మేవాద్వితీయం బ్రహ్మ, [2]తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి," మొదలగు వాక్యములచే బ్రహ్మమే తెలుపందగినది. బ్రహ్మము తెలుపంబడినది యగుచునుండఁగా విద్య స్వయముగానే పుట్టుచున్నది. దానిచే నవిద్య బాధింపఁబడు చున్నది. కారణముగ నవిద్యానాశము వలన దానిచేఁ గల్పింపఁబడిన నామరూప ప్రపంచము స్వప్న ప్రపంచము వలెఁ బ్రవిలీన మగుచున్నది. బ్రహ్మము తెలుపంబడనిది యగుచునుండఁగా బ్రహ్మజ్ఞానముం జేయుము; ప్రపంచ ప్రవిలయముం జేయుమని నూఱుసారులు చెప్పినను బ్రహ్మజ్ఞానము గాని ప్రపంచప్రవిలయము గాని కలుగదు. అయ్యా! తెలుపంబడిన బ్రహ్మమునందుఁ దద్విజ్ఞానవిషయము గాని ప్రపంచ ప్రవిలయ విషయము గాని నియోగము కావచ్చు ననిన నిష్ప్రపంచ బ్రహ్మస్వరూపమును దెలు

---

౧. ఛాం. ౬. ౨. ౧. (ఆసత్పదార్థ మొక్కటి యుండెను) ఏకం-ఏవ-అద్వితీయం=సజాతీయస్వగతభేదశూన్యమును, విజాతీయభేదశూన్యము నని శ్వేతకేతునకుం దండ్రి యుపదేశించెను.

౨. ఛాం. ౬. ౮. ౭. తత్ = ఏయాత్మచే నీజగ మాత్మవంతమో, యాసత్పదార్థ మను కారణమే, సత్యం=పరమార్థవస్తువు. సః = కనుక నా సత్పదార్థమే, ఆత్మా = జగమునకుం బ్రత్యక్కు, (కనుక నో శ్వేతకేతూ) త్వం=నీవు, తదసి=ఆసత్పదార్థమే యగుదువు.

పుటచేతనే రెండును సిద్ధించుటవలన నట్లనరాదు. రజ్జుస్వరూపముం దెలుపుటచేతనే రజ్జుస్వరూపజ్ఞానమును, దానియందవిద్యచేఁ గల్పింపంబడిన సర్పప్రవిలయము నగుచున్నది గదా! మఱియుఁ గృత మైనదియే మరల (విధిచేఁ) జేయంబడదు. (కనుకనును విధికి వైయర్థ్యమే.) (ఇట్లు విషయాభావమువలన విధి సంభవింప దని చెప్పి నియోజ్యుఁడు లేఁడు గనుకనును విధి సంభవింప దని చెప్పుచున్నాఁడు.) నియోజ్యుఁడైనను బ్రపంచావస్థ (=భేదావస్థ) యందు జీవుఁ డనువాఁడెవఁడు తెలియంబడుచున్నాఁడో యతఁడు ప్రపంచాంతర్భూతుఁడా? కాక బ్రహ్మమా? మొదటి వికల్పమున నిష్ప్రపంచబ్రహ్మప్రతిపాదనముచే జీవునకును బృథివ్యాదులకువలెఁ బ్రవిలాపితత్త్వము (=నాశము) సంభవించుటవలన నెవనికిఁ బ్రపంచప్రవిలయమున నియోగము చెప్పంబడును? మఱి యెవనికి నియోగనిష్ఠచే మోక్షము ప్రాప్తించును? రెండవ వికల్పమునం దైనను జీవునిస్వరూప మనియోజ్యస్వభావము గల బ్రహ్మమే కనుకను జీవత్వ మవిద్యాకల్పితము గనుకను బ్రహ్మము తెలుపంబడినది యగుచునుండఁగా నియోజ్యుఁడు లేఁడు కాఁబట్టి నియోగాభావమే యగును. పరవిద్యాప్రకరణమునఁ బఠింపఁబడిన ద్రష్టవ్యాదిశబ్దములును దత్త్వమున కభిముఖునిం జేయుటయే ప్రధానముగాఁ గలవి గాని తత్త్వావ

బోధమును విధించుట ప్రధానముగాఁ గలది కాదు. లోకము నను దీనిం జూడుము దీని వినుము మొదలగు నిర్దేశములందు జ్ఞేయమున కభిముఖులకైన నొకప్పుడు జ్ఞానము కలుగును వేఱొకప్పుడు కలుగదు నని ప్రణిధానమాత్రమును జేయు మని చెప్పంబడుచున్నది గాని సాక్షాత్తుగా జ్ఞానమునే చేయు మని చెప్పంబడదు. కాఁబట్టి=జ్ఞానము పురుషతంత్రము కాదు గనుక దానికి విధేయత్వము సిద్ధింపమివలన జ్ఞానమునందు విధి కలదని వాదించువానిచే జ్ఞానము నపేక్షించినవాని కవశ్యము జ్ఞానవిషయమే బోధింపఁదగినది. అది బోధింపంబడినది యగుచునుండఁగా విషయానుసారముగాను ప్రమాణానుసారముగాను జ్ఞానము స్వయముగానే పుట్టుచున్నది. ప్రమాణాంతరముచే వేఱొకలాగునం బ్రసిద్ధమైన వస్తువునందు వేఱొక ప్రకారము గల జ్ఞానము నియుక్తునకును గలుగదు. నియుక్తుఁడను గదా యని ప్రయత్నముచే వేఱొకలాగునం దెలిసికొనునేని యది జ్ఞానము గాదు; మానసికమైన క్రియయే యగును. పురుషయత్నమును వినాగనే వేఱొక ప్రకారమున జ్ఞానము కలిగెనేని భ్రాంతియే యగును. జ్ఞానము ప్రమాణమువలనం బుట్టినదియు యథాభూతవిషయమును. (=ఉన్నదాని నున్నట్లు తెలిసికొనునది.) అది విధిశతముచేతనైనను గావింపను నిషేధశతముచేతనైనను వారింపను నశక్యము. అది పురుషతంత్రము

గాదు. మ తేమనిన నది వస్తుతంత్రమే. కాఁబట్టియు దాని యందు విధి వ్యర్థమే. మఱియు వేదాంతమునందు విధి కల దను వాని కింకొక దోషము కలదు. ఆమ్నాయము విధినిష్ఠ చేతనే పర్యవసించునేని జీవున కేయనియోజ్యబ్రహ్మస్వరూ పత్వ మంగీకరింపఁబడినదో యది యప్రమాణక (=భ్రాంతి మూల)మే యగును. శాస్త్రమే జీవునకు ననియోజ్యబ్రహ్మాత్మ త్వముం జెప్పుచున్నది; అదియే బ్రహ్మావబోధమునందుఁ బురు షుని నియోగించుచున్నది (కాఁబట్టి రెండునుం బ్రమాణమే) యను పక్షమున నట్లనుటవలన నొకటియే యగు బ్రహ్మ శాస్త్రమునకు ద్వ్యర్థపరత్వము (చే వాక్యభేదమును) విరు ద్ధార్థప్రతిపాదనము (చే నప్రామాణ్యము)ను బ్రసక్తించును. (వేదాంతశాస్త్రమునకు) నియోగపరత్వము గల్గుచుండఁగా శ్రుతహానియు నశ్రుతకల్పనయుఁ గర్మఫలమునకు వలె మోక్ష మునకు నదృష్టఫలత్వము ననిత్యత్వము మొదలగు దోషము లెవ్వనిచేతను బరిహరింప శక్యములు గావు. కాఁబట్టి బ్రహ్మ వాక్యము లవగతినిష్ఠములే, (=అవగతిని బోధించునవియే) కాని, నియోగనిష్ఠములు (=విధిపరములు) కావు. వేదాంత ములు విధిబోధములు కావు గనుక నేకనియోగప్రతీతివలన నేకవాక్యత్వము కావచ్చు ననునిది యయుక్తము. బ్రహ్మ వాక్యమునందు విధి సద్భావ మంగీకరింపఁబడినను శబ్దాంతర

ములు(=భిన్న క్రియావాచకము లగు శబ్దములు)రూప(=సగుణ నిర్గుణ) భేదము, ప్రకరణభేదము ఫలభేదము నను ప్రమాణములచేతను నిర్గుణజ్ఞానసగుణోపాసన విధిభేదము తెలియంబడుచున్నది కాఁబట్టి సగుణవాక్యములందును నిర్గుణవాక్యములందును విధ్యైక్యము సిద్ధింపదు. ప్రయాజదర్శపూర్ణమాస వాక్యములం దొకఁడే యగు స్వర్గకామునకు సాంగప్రధానాధికారమువలన నేకవిధిత్వము యుక్తము. భారూపత్వాది గుణములు ప్రపంచప్రవిలాపనమునకుఁ గాని, ప్రపంచప్రవిలయము భారూపత్వాదులకుఁ గాని యుపకరించునవి కావు గనుకను ముక్త్యర్థము నభ్యుదయార్థము నగు విద్యలు పరస్పర విరుద్ధము లగుటవలన నంగాంగిభావము సంభవింపదు గనుకను నిట (=సగుణనిర్గుణవిద్యలందు) నేకవిధిత్వముం గలిగించు నధికారాంశ మొద్దియు లేదు. (అట్లయిన భారూపత్వాదులు విశిష్టగుణసంపత్తిం జెప్పునవియుఁ దక్కినవి యాధర్మియందే ద్వైతవిలాపనార్థములు నని యేకవాక్యత్వ మగు నని యాశంకించుకొని చెప్పుచున్నాఁడు.) ఒకధర్మియందే యెల్లప్రపంచప్రవిలాపనము నేకదేశాపేక్షణము నావేశింపంజేయ యుక్తము కాదు. కాఁబట్టి సవిశేషవాక్యములకు నిర్విశేషవాక్యములకును (సాకారవాక్యము లనిర్వాచ్యద్వైతాలంబనములు

నిర్గుణవాక్యములు స్వాభావికాద్వైతాలంబనములు నను) మూచేఁ జేయంబడిన విభాగమే సాధీయసము.

ఇది పంచమాధికరణము.

---

## ప్రకృతైతావత్త్వాధికరణము. ౬

(బ్రహ్మమునకు నిర్విశేష చిన్మాత్రత్వముం జెప్పి సర్వనిషేధములకు నవధియగుటచే సన్మాత్రత్వముం జెప్పుచున్నాఁడు.)

సూ. ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః. ౨౨

ప. ప్రకృతైతావత్త్వం-హి-ప్రతిషేధతి-తతః-బ్రవీతి-చ-భూయః.

అ. ఏకారణమువలన "నేతి నేతి" యను శ్రుతి ప్రపంచమును నిషేధించిన తరువాత మరల నప్రతిషిద్ధ మగు బ్రహ్మము కల దని చెప్పుచున్నదో యాకారణము వలనఁ బ్రస్తుతమగు నింతయను పరిమాణముగల రూపద్వయమును నిషేధించుచున్నది గాని బ్రహ్మమును నిషేధింపదు.

భా. (శ్రుతి) "ద్వే వా బ్రహ్మణో రూపే మూర్తం చైవా

---

౧. బృ. ౪. ౩. ౧. బ్రహ్మణః = బ్రహ్మమునకుఁ, మూర్తం చ-అమూర్తం చ = మూర్తము నమూర్తము నను, ద్వే వావ = రెండే, రూపే = రూప

మూర్తంచ" యని యారంభించి పంచమహాభూతములను రెండు రాసులుగా విభజించి పురుషశబ్దముచేఁ జెప్పంబడిన యమూర్తరసునకు (=సూర్యమండలము నందును గుడి కంటియందు నున్న కరణాత్మకుఁడగు హిరణ్యగర్భునకు) (వాస నామయములగు) మహారజనాది రూపములం గనుపఱిచి మరలను "అథాత ఆదేశో నేతి నేతి నహ్యేతస్మా దితి నేత్యన్య త్పరమస్తి" యని చెప్పుచున్నది. అందీ ప్రతిషేధమునకు విషయ మెద్ది యని విచారింపఁ గోరుచున్నారము. ఇం దిది యది యని నిషేధింపంబడగిన విషయ మెద్దియుఁ గాన్పింపదు. కాని సన్నిప్రయోగ మితిశబ్ద పరకమగుటవలన నితిశబ్దముచే నిషేధ్య మెద్దియో నొకటి సమర్పింపంబడుచున్నది. "ఇతిహ స్మోపాధ్యాయః కథయతి" యను నిత్యాదులం దీయితిశబ్దము సన్నిహితాలంబనము నేవం శబ్దముతో సమానమైన యర్థము

ములు. భూమ్యుదక తేజములు మూర్తరూపము వాయ్వాకాశములు రెండు నమూర్తరూపము. నీరూపమగు బ్రహ్మము దేనిచే నిరూపింపఁబడునో యవి రూపములు.

౧. బృ ౨. 3. ౬. అథ = సద సదాత్మకమైన ప్రపంచము చెప్పంబడిన తరువాతను, అతః = మీఁదఁ జెప్పంబడిన యారోపము నిషేధార్థక మగుటవలనను, ఏతస్మాత్ = ఈబ్రహ్మముకంటెను, అన్యత్ = వేఱొక టెద్దియును, నహి–ఇతి = లేదు కాఁబట్టి, నేతి నేతీతి = నేతి నేతియను నిషేధముచే నుపదేశము చేయంబడుచున్నది. (శూన్యత్వమును నిరసింపందలంచి) అన్యత్ = అప్రతిషిద్ధ మగు, పరం = పరమగు బ్రహ్మము, అస్తి = కలదని చెప్పంబడినదియని సిద్ధాంతరీతిచే నర్థము.

కలదియునై ప్రయోగింపఁబడుచున్నది. ప్రకరణ సామర్థ్యము వలన నిట బ్రహ్మముయొక్క సప్రపంచమైన రూపద్వయమును దేని కీరెండురూపములుం గలవో యా బ్రహ్మమును సన్నిహితములు. అట నీ ప్రతిషేధము రూపద్వయమును రూపవంతమగు బ్రహ్మము నను రెండిటిని నిషేధించుచున్నదా? కాక రెంటిలో నొకదాని నిషేధించుచున్నదా? రెండిటిలో నొకదానిని నిషేధించునపుడు బ్రహ్మమును నిషేధించి రూపములను మిగుల్చునా? రూపముల నిషేధించి బ్రహ్మమును మిగుల్చునా? యని మాకు సంశయము పుట్టుచున్నది. సంశయము గలుగుచుండఁగాఁ బ్రకృతత్వము సమానమే యగుటవలనను భయమును నిషేధించుచున్నదనియూ శంకించుచున్నారము. రెండుసారులు "నేతి"శబ్దప్రయోగము వలన నివి రెండునుం బ్రతిషేధములు. వానిలో నొకదానిచే బ్రహ్మముయొక్క సప్రపంచమగు రూపము నిషేధింపఁబడుచున్నది; వేరొకదానిచేత రూపవంత మగు బ్రహ్మము నిషేధింపఁబడు చున్నది యనుబుద్ధి పుట్టుచున్నది. వేఱొక పక్షమున రూపవంత మగు బ్రహ్మమే నిషేధింపఁబడుచున్నది; వాఙ్మనసాతీత మగుటవలన నూహింపరాని సద్భావము గలయది నిషేధార్హము; కాని ప్రత్యక్షాది గోచర మగుటవలన రూపప్రపంచము ప్రతిషేధార్హముగాదు. అభ్యాసమాద

రార్థము గానచ్చునను నిది ప్రాప్తింపఁగా శూన్యవాద ప్రసంగమువలన నుభయ ప్రతిషేధ ముపపన్నము కాదని చెప్పుచున్నారము. రజ్జ్వాదులందు సర్పాదులువలెనే దేనినైన నొకపరమార్థము నవలంబించి యపరమార్థము నిషేధింపఁబడుచున్నది. ఎద్దియో నొకవస్తువు మిగులుచున్నది యగుచునుండఁగా నిషేధము సంభవించుచున్నది. సర్వమునకుం బ్రతిషేధము గలుగుచుండఁగానే వస్తువు మిగులును? వేఱొక వస్తువు మిగులనిది యగుచునుండఁగా నితర మెద్ది నిషేధింప నారంభింపఁ బడుచున్నదో యదియే పరమార్థ మగుటవలన దానికిం బ్రతిషేధ ముపపన్నముగాదు. "[1]బ్రహ్మ తే బ్రవాణి" యనునది మొదలగు వాక్యోపక్రమ విరోధమువలనను "[2]అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి వేద చేత్" తనునది మొదలగు నిందా విరోధము వలనను "[3]అస్తీత్యేవోపలబ్ధవ్య" యనునది మొదలగు నవధారణ విరోధమువలనను వేదాంతముల కన్నింటికిని వ్యాకోపము ప్రసక్తించుటవలనను బ్రహ్మప్రతిషేధమును యుక్తముగాదు. బ్రహ్మమునకు వాఙ్మన

1. బృ. ౨. ౧. ౧. (దృప్తబాలాకి యజాతశత్రు వను రాజుం జేరి) తే=నీకొఱకు, బ్రహ్మ=బ్రహ్మమును, బ్రవాణి=ఉపదేశింతునని పల్కెను.

2. ప్రథమాధ్యాయమున నానందమయాధికరణమున దీని యర్థము వ్రాయంబడె.

3. వెనుకటి యధికరణమున దీనియర్థము వ్రాయంబడెను.

సాతీతత్వ మైన సభావాభిప్రాయమునఁ జెప్పంబడ లేదు. గొప్ప పరికర బంధముచే (=గొప్ప ప్రయత్నముచేత నని యర్థము.) "[1]బ్రహ్మవిదాప్నోతిపరం, సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" మొదలగువానిచే వేదాంతములందు బ్రహ్మమును బ్రతిపాదించి దానికే మరల సభావము చెప్పంబడదు. "[2]ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వర" మను (=అను సుం ద్రొక్కి కాలి గడుగుటకంటెఁ ద్రొక్కకుండుటయే మేలను) న్యాయము కలదు. "[3]యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" యను నిది ప్రతిపాదన ప్రక్రియ. బ్రహ్మము వాఙ్మనసముల కగోచరమునవిషయాంతః పాతి (=విషయములలోనిది కానిది) యుఁ బ్రత్యగాత్మ భూతము నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావము ననునిది దీనిచేఁ జెప్పంబడినది యగుచున్నది. కాఁబట్టి బ్రహ్మముయొక్క రూపమును బ్రతిపాదించు చున్నది బ్రహ్మమును బరిశేషించు చున్నది యని తెలియవలెను. "ప్రకృతైతావత్వంహి ప్రతిషేధతి" యను దానిచే

---

1. తై. 2. 1. 1. బ్రహ్మవిత్ = బ్రహ్మము నెఱింగినవాఁడు, పరం = నిరతిశయమగు బ్రహ్మమును, ఆప్నోతి = పొందుచున్నాఁడు.

2. ప్రథమాధ్యాయమున నానందమయాధికరణమున దీని యర్థము వ్రాయంబడినది.

3. ఆనందమయాధికరణమునఁ గడపటి సూత్రమున దీని కర్థము వ్రాయంబడె.

నిదియే చెప్పంబడుచున్నది. హి = ఏక్కారణమువలన నది ప్రస్తుతమును బూర్వగ్రంథమునందు నధ్యాత్మమును నధిదైవతమును బ్రపంచింపంబడినదియునో యా కారణమువలనన్ను, ప్రకృతైతావత్త్వం=ఏద్ది ప్రకృతము నింతయని పరిచ్ఛిన్నము నగు మూర్తా మూర్తలక్షణ మైన బ్రహ్మరూపము కలదో దానిని "నేతి నేతి" యను నీశబ్దము, ప్రతిషేధతి = నిరాకరించుచున్నది. మఱియు నమూర్తరస పురుషునకుఁ గన్నులకుఁ గోచరించు రూపసంబంధ ముపపన్నముకాదు గాఁబట్టి దానివలనం బుట్టినదియే యగు (=అరూపమువలనం బుట్టినదియే యగు) వాసనాలక్షణమైనదియు నమూర్త సారభూతముఁ బురుషశబ్దమునం జెప్పఁబడిన లింగాత్మయాశ్రయము గాఁగలదియు నగు వేఱొక రూపమును మాహారజనాద్యుపమలచేఁ జూపంబడినది. ఆ యీ సప్రపంచమగు బ్రహ్మముయొక్క రూపము సన్నిహిత మగు దాని బోధించు నేతిశబ్దముచే నిషేధార్హమగు నట్లను జెప్పంబడుచున్నదని తోఁచుచున్నది. పూర్వ గ్రంథమున బ్రహ్మము రూపవిశేషణముగా షష్ఠిచే నిర్దేశింపఁ బడినదిగాని స్వప్రధానముగా నిర్దేశింపఁ బడ లేదు. బ్రహ్మసంబంధ మగు రూపద్వయము ప్రపంచింపంబడినది యగుచు నుండఁగా రూపవంత మగు బ్రహ్మముయొక్క స్వరూప జిజ్ఞాసగల్గ "నేతి నేతి" యను

నిది యుపక్రమింపఁబడినది. అందుఁ గల్పితరూప నిరాకరణముచే బ్రహ్మముయొక్క స్వరూపావేదన మిదియని నిర్ణయింపఁబడుచున్నది. "నేతి నేతి" యని నిషేధింపఁబడిన కార్యజాత మెల్ల నది యాస్పదము (=ఉపాదానము) గాఁగలదిగదా!- కార్యమునకు వాచారంభణ శబ్దాదులవలన నసత్త్వము కలదు కాఁబట్టి "నేతి నేతి" యను నిషేధము యుక్తము కాని సర్వకల్పనా మూలమగుటవలన బ్రహ్మమునకు నిషేధము యుక్తముకాదు. "ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వర" మను న్యాయముకలదుగదా యెట్లు శాస్త్రము బ్రహ్మమునకు రూపద్వయమును గనుపఱిచి స్వయముగానే మరల నిషేధించుననను నాశంక నిట (=రూపద్వయ నిషేధపక్షమునఁ) జేయరాదు; ఎక్కారణమువలన నీశాస్త్రము ప్రతిపాద్యమని బ్రహ్మముయొక్క రూపద్వయమును నిర్దేశింపక లోకప్రసిద్ధమైన దానిని నిషేధ్యత్వము కొఱకును బ్రహ్మప్రతిపాదనము కొఱకుం బరామర్శించుచున్నదో యాకారణమువలనను.(నిషేధమిట్లు) యుక్తము. ఈ ప్రతిషేధములు రెండును గ్రమముగా మూర్తా మూర్తరూపముల రెంటెంటిని నిషేధించు చున్నవి. పక్షాంతరమున మొదటి ప్రతిషేధము భూతరాశిని రెండవది వాసనారాశిని బ్రతిషేధించుచున్నది. వేఱొక పక్షమునను "నేతి నేతి" యనునది వీప్సార్థకమై యెద్ది యెద్ది యూహింపఁ

బడుచున్నదో దానినెల్ల నిషేధించును. పరిగణిత నిషేధము (=బ్రహ్మము మూర్తమున మూర్తము కాదను నిషేధము) చేయంబడినది యగుచునుండఁగా మఱెద్ది బ్రహ్మ మనుజిజ్ఞాస కలుగును. వీప్సయగుచుండఁగా విషయభూతమున కెల్లం బ్రతిషేధమువలన నవిషయమగు ప్రత్యగాత్మ బ్రహ్మమని జిజ్ఞాస నివర్తిల్లును. కాఁబట్టి (యీ నిషేధము) బ్రహ్మము నందుఁ గల్పితమగు ప్రపంచమునే నిషేధించుచున్నది; బ్రహ్మ మును మిగుల్చుచున్నది యని నిర్ణయము. ఎక్కారణము వల నను (శ్రుతి) తతః=ప్రపంచ ప్రతిషేధముకంటె పరువాతను, భూయః=మరలను, బ్రవీతిచ="అన్యత్పరమస్తి"యని చెప్పు చున్నదియునో యా యీకారణమువలన నిదియె నిర్ణయము. అభావావసాన మగు నిషేధము చేయంబడినది యగుచునుం డఁగాను "అన్యత్పరమస్తి" యని దేనిం జెప్పును? ఆవాక్యమునం దక్షరయోజన మిట్లగును, (శ్రుతి) "నేతినేతి" యని బ్రహ్మ ము నాదేశించి యాయాదేశమునే మరల నిర్వచించు చున్నది. "నేతినేతి" యనుదాని కర్థమేమనఁగాను "నహ్యే తస్మాదితినేత్యన్యత్పరమస్తి". యని = నహ్యేతస్మా ద్బ్రహ్మ ణోవ్యతిరిక్త మస్తీత్యతో నేతినేతీత్యుచ్యతే నపునస్స్వయమే వనాస్తి" యని=బ్రహ్మముకంటె వ్యతిరిక్త మగున దెద్దియు లేదు కాఁబట్టి నేతి నేతి యని చెప్పంబడు చున్నది గాని

బ్రహ్మమే లేదని కాదని యర్థము. ఈ నిర్వచనము "అన్యత్పరమస్తి"యని=అప్రతిషిద్ధమగు బ్రహ్మము కలదని చూపుచున్నది. ఎపుడక్షరములు "వహ్యేతస్మా దితి. నేతి నేతీతి ప్రపంచ ప్రతిషేధ రూపాదాదేశనాదన్యన్న పరమాదేశనం బ్రహ్మణోఽస్తీతి"=ఈ ప్రపంచ ప్రతిషేధరూప మగు నాదేశముకంటె బ్రహ్మమునకు వేఱాదేశము లేదు కాఁబట్టి నేతినేతి యని చెప్పఁబడుచున్నది యని యన్వయింపఁబడునో యపుడు "తతో బ్రవీతిచ భూయ" యను దాని నామధేయవిషయముగా నన్వయింపవలెను. "అథ నామధేయం సత్యస్య సత్యమితి ప్రాణావై సత్యం తేషా మేష సత్య" మని (శ్రుతి) బ్రవీతిచ=నామధేయముం జెప్పుచున్నది గదా! అదియుఁ బ్రతిషేధము బ్రహ్మావసాన మగుచుండఁగా సమంజస మగును. ప్రతిషేధ మభావావసాన మయ్యెనేని సత్యస్య సత్య మని యెద్ది చెప్పఁబడును? కాఁబట్టి యీ ప్రతిషేధము బ్రహ్మావసానము గాని యభావావసానము గాదని నిశ్చయించుచున్నారము.

---

౧. బృ. ౪. ౩. ౬. అథ = నేతినేతి యను నిషేధము బ్రహ్మవిషయము కానిది యగుచుండఁగాను, సత్యస్య సత్యమితి = సత్యమునకు సత్యమని=నిరపేక్షమైన సత్యమని, నామధేయం=బ్రహ్మమునకు నామము. ప్రాణావై = ఇంద్రియములు (=లింగశరీరమని యర్థము.) సత్యం = స్థూలశరీరముకంటె స్థిరమైనది. తేషాం=వానికిని, (=లింగశరీరమునకును) ఏషః = ఈ బ్రహ్మము, సత్యం=శాశ్వతమైనది. వానికంటె నిది శాశ్వతమైన దని యర్థము. కాఁబట్టి యీశ్రుతి కీపేరు తగును.

సూ. తదవ్యక్త మాహహి. ౨౩

ప. తత్-అవ్యక్తం-ఆహ-హి.

అ. శ్రుతి యెక్కారణమువలన బ్రహ్మము చక్షురాదులచే గ్రాహ్యము కాదని చెప్పుచున్నదో యాకారణము వలన నది శ్రుతివ్యతిరిక్తప్రమాణగోచరము గాదు.

భా. ఎద్ది ప్రతిషిద్ధ మగు ప్రపంచజాతముకంటె భిన్నమును బరము నగు బ్రహ్మమో యది కలదేని యెక్కారణమువలనఁ గాన్పింపదం లేని, తత్=ఆ బ్రహ్మము దృశ్యముల కెల్ల సాక్షి యగుటవలనను, అవ్యక్తం=ఇంద్రియములకు గోచరింపనిది యని చెప్పంబడుచున్నది. హి=ఎక్కారణమువలనను "న చక్షుషా గృహ్యతేనాపి వాచా నాన్యై ర్దేవై స్తపసా కర్మణా వా, స ఏష నేతి నేత్యాత్మా ఽగృహ్యో నహి గృహ్యతే, యత్తదద్రేశ్య మగ్రాహ్యం, యదా హ్యేవైష ఏతస్మి న్నదృశ్యే ఽనాత్మ్యే ఽనిరుక్తే ఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విందతే" యనునది మొదలగు శ్రుతి యిట్లు, ఆహ= చెప్పుచున్నదో యా కారణమువలన బ్రహ్మమునకు నింద్రియా గ్రాహ్యత్వము సిద్ధము. "అవ్యక్తోయ మచింత్యోయ

౧. ముం. 3. ౧౮. (ఎక్కారణమువలనను బ్రహ్మము రూపము మొదలగునవి లేనిది కాఁబట్టి) చక్షుషా = నేత్రేంద్రియముచేతను, న గృహ్యతే=గ్రహింపఁబడదో, వా నాపి=వాగింద్రియము చేతనును, న = గ్రహింపఁబడదో, అన్యైః దేవైః=తక్కిన యింద్రియములచేతనును, న=

మవికార్యోయ ముచ్యతే" యనునది మొదలగు స్మృతియు నిట్లే చెప్పుచున్నది.

సూ. అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం. ౨౪

ప. అపి-సంరాధనే-ప్రత్యక్షానుమానాభ్యాం.

అ. మఱియును యోగులాత్మని సంరాధన కాలమునఁ జూచుచున్నా రని శ్రుతిస్మృతులవలనం దెలియుచున్నారము.

---

గ్రహింపఁబడదో, తపసా=తపముచేతను గాని, కర్మణా వా = వైదిక మగు నగ్నిహోత్రాది సాధనములచేతనుగాని, న= తెలియంబడదో, (యీ కారణము వలన రాగాదిదూషితము గాని జ్ఞానముచే విశుద్ధాంతఃకరణుఁడై ధ్యానించుచుఁ దెలిసికొనునది.)

౨. బృ. ౫. ౯. ౨౬. మధుకాండమందు 'నేతి నేతి' యని చెప్పఁబడిన యాత్మ యింద్రియగోచరుఁడు గాఁడని యర్థము.

3. ముం. ౧. ౧. ౬ యత్ =ఏది, అద్రేశ్యం=జ్ఞానేంద్రియములచేఁ దెలియందగినది కాదో, అగ్రాహ్యం=కర్మేంద్రియములచేఁ బట్టరానిదికదా (మఱియుం నెద్ది సర్వవిశేషములతో శూన్యమో యట్టి యక్షరపదార్థమును విద్వాంసులు జగమునకుఁ గారణముగాఁ జెప్పుచున్నారు.

౪. దీనియర్థము ప్రథమాధ్యాయమున నానందమయాధికరణమున వ్రాయఁబడె.

౫. భగ. అ ౨. శ్లో. ౨౫. (నిత్యత్వాదిలక్షణములు గల యాత్మనకేల ప్రసిద్ధి లేదనినఁ జెప్పుచున్నాఁడు.) అయం = ఈ యాత్మఁడు, అవ్యక్తః=(ఇంద్రియములకు గోచరింపనివాఁడు గనుక) స్ఫురింపనివాఁడు. కనుకనే, అచింత్యః=చింతకు (=అనుమానమునకు) విషయము గానివాఁడు. (ఎద్ది యింద్రియగోచరమో యది చింతావిషయ మగుసుగదా!) మఱియును నితఁడు, అవికార్యః=నిరవయవుఁ డగుటవలన నాతంచరాదులచే క్షీరాదులవలె దేనిచేతను వికారముం బొందింపందగినవాఁడు కాఁడని, ఉచ్యతే = చెప్పంబడుచున్నాఁడు.

(అట్లయిన బ్రహ్మ మెపుడు గ్రాహ్య మను శంక కుత్తరముగా సూత్రమును వ్యాకరించుచున్నాఁడు.)

భా. అపిచ=మఱియును యోగులు నిరసింపంబడిన యెల్ల ప్రపంచముం గలవాఁడు నింద్రియాగ్రాహ్యుఁడు నగు నాత్మునిని, సంరాధనే = సంరాధనకాలమునందుఁ జూచుచున్నారు. భక్తిప్రణిధానాద్యనుష్ఠానము సంరాధనము. మాహాత్మ్యజ్ఞానపూర్వకమైన స్నేహ మను నంతఃకరణ వృత్తివిశేషము=భక్తి. "భక్త్యావృత్తి=ధ్యానము. భక్తిధ్యానములచేఁ జిత్తమునఁ బ్రత్యగాత్మను నిలుపుట = ప్రణిధానము. ఆదిపదముచే జపనమస్కారాదులు గ్రాహ్యములు. సంరాధనకాలమున యోగు లాత్మునిఁ జూచుచున్నారని యెట్లు తెలియంబడుచున్నది యంటేని, ప్రత్యక్షానుమానాభ్యాం = శ్రుతిస్మృతులవలనం దెలియంబడు చున్నది. అట్లే "పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మా త్పరాఙ్పశ్యతి నాంత

౧. క. ఠ. ౧. స్వయంభూః = స్వతంత్రుఁ డగు పరమేశ్వరుఁడు, ఖాని=ఇంద్రియములను, పరాంచి=బాహ్యము లగు శబ్దాది విషయములను దెలియునవిగా సృజించి, వ్యతృణత్ =హింసించెను - చెడఁగొట్టెనని యర్థము. తస్మాత్ =ఆ కారణమువలనను (జనము) పరాఙ్ =అనాత్మ భూతములగు శబ్దాదులనే, పశ్యతి=చూచుచున్నది. కాని, అంతరాత్మన్ = అంతరాత్మవని యర్థము. న=చూడదు. (లోకమున నిట్టి స్వభావమే యున్నను) కశ్చిద్ధీరః=ఒకానొక బుద్ధిమంతుఁడు, అమృతత్వం = మోక్షమును, ఇచ్ఛన్ = కోరుచున్, ఆవృత్తచక్షుః = ఎల్లవిషయములనుండి మరలించిన యింద్రియ-

రాత్మాన మైక్షదావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్" "[౧]జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమాన" యనునది మొదలగు శ్రుతులును "[౨]యం వినిద్రా జితశ్వాసా స్సంతుష్టా స్సంయతేంద్రియా జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః.

---

ములు గలవాఁడై, ప్రత్యగాత్మానం = ప్రత్యగాత్మను, ఐక్షత్ = (వేదము నందుఁ గాలనియమము లేకపోవుటవలనను) జూచుచున్నాఁ డని యర్థము.

౧. ముం. ౩. ౧. ౮. బ్రహ్మ మింద్రియగ్రాహ్యము గాదు కదా దానిం దెలియు సాధన మెద్ది యనినం జెప్పుచున్నాఁడు. జ్ఞానప్రసాదేన = జ్ఞాననైర్మల్యముచేతను (=జ్ఞానము స్వభావముచేత నాత్మం దెలుప సమర్థమైనను బాహ్యవిషయరాగాదిదోషములచేఁ గలుషితమై యప్రసన్నమగుచు సన్నిహితమైన నాత్మతత్త్వమును దెలుపంజాలదు. అది యింద్రియ విషయసంపర్కమువలనం బుట్టిన రాగాదికాలుష్యాపనయనమువలన నెప్పుడు స్వచ్ఛము శాంతము నై యుండునో యప్పుడు దానికిం బ్రసాదమగును. దానిచేతను) విశుద్ధసత్త్వః = పరిశుద్ధ మగు నంతఃకరణము కలవాఁడై, తతః = పిమ్మటను బ్రహ్మదర్శనమునకు యోగ్యుఁడగుట గాఁబట్టి, తం = ఆ పరమేశ్వరుని, నిష్కలం = అవయవభేదవర్జితుఁడుగాను, (సత్యాది సాధన సామగ్రిచే నుపసంహరింపఁబడిన తన యింద్రియములు కలవాఁడై యేకాగ్రమైన మనసుతోఁ) ధ్యాయమానః = చింతించుచున్నవాఁడై, పశ్యతే = చూచుచున్నాఁడు.

౨. వినిద్రాః = నిద్ర లేనివారును, జితశ్వాసాః శ్వాసమును జయించినవారును, ప్రాణాయామనిష్ఠు లని యర్థము. సంతుష్టాః = మనోవ్యాకులత్వము నొందనివారును, సంయతేంద్రియాః = నిర్బంధింపఁబడిన యింద్రియములు గలవారును, (అగు యోగులు) యుంజానాః = ధ్యానించుచున్నవారై, యం జ్యోతిః = ఏ యాత్మను, పశ్యంతి = చూచుచున్నారో, తస్మై = అట్టి యోగాత్మనే = యోగజ్ఞానగమ్యుఁ డగు నాత్మునికొఱకు, నమః = నమస్కారము.

యోగినస్తం[౧] ప్రపశ్యంతి భగవంతం సనాతన"మనునది మొదలగు స్మృతులును బ్రతిపాదించు చున్నవి.

అవ. సంరాధ్య సంరాధకత్వ భావము నంగీకరించుట వలన జీవాత్మునకుఁ బరమాత్మునకు భేదము ప్రసక్తించు ననినఁ బ్రసక్తింప దని చెప్పంబడుచున్నది.

సూ. ప్రకాశాదివ చ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్. ౨౫

ప. ప్రకాశాదివత్ - చ - అవైశేష్యం ప్రకాశః - చ - కర్మణి - అభ్యాసాత్.

అ. అంగుళి కరకజలము మొదలగు నుపాధులందుఁ బ్రకాశము నాకాశము సవిత మొదలగునవి యెట్లు భేదము కలవివలె భాసిల్లుచున్నవో యట్లే బ్రహ్మమును బుద్ధ్యాద్యుపాధులందు భేదము కలదివలె భాసిల్లుచున్నది గాని తత్త్వమేకమే యని వేదాంతములం దఱుచుగా నుపదేశించుట వలన దానికి స్వభావమున నేకరసత్వమే కలదు.

భా. ప్రకాశాదివత్-చ = ప్రకాశము నాకాశము సవిత మొదలగునవి యెట్లు, కర్మణి=కర్మను=ఉపాధిభూతము లగు నంగుళికలశజలాద్యుపాధులందు విశేషము (=భేదము)

---

౧. యోగినః = యోగులు, సనాతనం-తం - భగవంతం = శాశ్వతుఁ డగు నా యీశ్వరునిని, ప్రపశ్యంతి = ధ్యానకాలమునం జూచుచున్నారు.

కలదివలె భాసిల్లుచున్నవి గాని స్వాభావిక మగునవి భేద స్వరూపమును విడువవో యట్లే, ప్రకాశశ్చ = చిదాత్మ యును, కర్మణి=బుద్ధ్యాద్యుపాధియందు భేదము కలదివలెఁ గాన్పించుచున్నది. ఇట్లే యాత్మభేద ముపాధినిమిత్తమే కాని, అవైశేష్యం=స్వభావమున నేకాత్మత్వమే. అట్లకదా, అభ్యా సాత్ = వేదాంతములం దఱుచుగా జీవేశ్వరుల కభేదము నుపదేశించుటవలనఁ దెలియంబడుచున్నది.

ఈ సూత్రమునకు బ్రహ్మవిద్యాభరణమున నీ క్రింది యర్థము వ్రాయఁబడెను. ప్రకాశాదివత్-చ=ప్రకాశా దులకువలెనే, బ్రహ్మమునకును, కర్మణి = ఉపాధియందున్, ప్రకాశశ్చ=ఆరోపితరూపమున నవభాసమును, అవైశేష్యం= పరమార్థమువలన నారోపితరూపవిశేషమున కభావము నుప పన్న మగుచున్నది. ఈ వ్యవస్థ, అభ్యాసాత్ = తత్త్వమస్యా ద్యభ్యాసమువలనఁ దెలియందగినది.

సూ. అతోఽనంతేన తథా హి లింగం. ౨౬

ప. అతః - అనంతేన - తథా - హి - లింగం.

అ. భేదమవిద్యచేఁ బ్రాప్తమైనది కాఁబట్టి జీవుఁడు విద్యచే దానిని నిరసించి యీశ్వరునితోఁ నైక్యమును బొందుచున్నాఁడు. "బ్రహ్మైవస" న్నిత్యాది శ్రుతు లట్లే చెప్పుచున్నవి కదా!

భా. అతః=అభేదము స్వాభావిక మగుటవలనను భేద మవిద్యాకృత మగుటవలనను జీవుఁడు విద్యచే నవిద్యను నిరసించి, అనంతేన = అంతములేని ప్రాజ్ఞాత్మునితో నేకత్వముఁ బొందుచున్నాఁడు. తథాహి=అట్లేకదా, లింగం="స[1] యోహ వైతత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, బ్రహ్మైవసన్[2] బ్రహ్మాప్యేతి" యనునది మొదలగు నపూర్వార్థమును దెలుపు శ్రుతిజాతము చెప్పుచున్నది.

సూ. ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్. ౨౭

ప. ఉభయవ్యపదేశాత్ - తు - అహికుండలవత్.

అ. శ్రుతి యొకానొకచో భేదమును వేఱొకచో నభేదమును జెప్పుచున్నవి కాఁబట్టి యహికుండలములకు వలె జీవేశ్వరులకు భేదాభేదములు రెండును బారమార్థికములే (యని కొందఱు చెప్పుచున్నారు.)

భా. స్వమతపరిశుద్ధికొఱకు మీఁదఁ జెప్పఁబడిన

---

౧. ముం. ౩. ౨. ౯. లోకమునను, సః-యః-హ-వై = ఎవఁడైన నొకానొకఁడు, తత్-పరమం బ్రహ్మ=ఆ నిరతిశయమగు బ్రహ్మమును, వేద=నేనే యని యనుభవమున నెఱుంగునో, (యతఁడు) బ్రహ్మైవభవతి= బ్రహ్మమే యగుచున్నాఁడు.

౨. బృ. ౪. ౪. ౬. (విద్వాంసుఁడు) బ్రహ్మైవసన్ = మును పును బ్రహ్మమే యగుచు, బ్రహ్మ=బ్రహ్మమును, అప్యేతి = ఇటనే పొందుచున్నాఁడు. దేహాంతరముం బొందఁడని యర్థము.

సంరాధ్యసంరాధకభావమునందు వేఱొక మతము నుపన్యసించుచున్నాఁడు. జీవునకుం బ్రాజ్ఞునకును "తతస్తుతంపశ్యతే నిష్కలంధ్యాయమాన" యనుచోట ధ్యేయధ్యాతృ భావమునను ద్రష్టృద్రష్టవ్యభావమునను "పరాత్పరం పురుషముపైతి దివ్య" మను వేఱొకచోట గంతృగంతవ్యభావముచేతనును, "యస్సర్వాణి భూతాన్యంతరోయమయతి" యను నింకొకచోట నియంతృనియంతవ్యభావముచేతనును భేదము చెప్పంబడుచున్నది. "తత్త్వమసి" యనుచోటను, "అహం బ్రహ్మాస్మి" యనుచోటను, "ఏషత ఆత్మాసర్వాంతర" యను మఱియొకచోటను, "ఏషత ఆత్మాంతర్యామ్యమృత" యను

---

౧. ముం. 3. ౨. ౮. (గంగాది ప్రవాహములు సముద్రమునఁ బ్రవేశించి నామరూపములు విడిచి యెట్లు తద్భావముం బొందునో యట్లె విద్వాంసుఁ డవిద్యాకృతనామరూపములనుండి విడివడినవాఁడై) పరాత్ = మీఁదఁ జెప్పఁబడిన యక్షరముకంటెను, పరం—దివ్యం— పురుషం = పరుఁడగు మీఁదఁ జెప్పంబడిన దివ్యపురుషునిని, ఉపైతి = పొందుచున్నాఁడు

౨. బృ. ౫. ౭. ౧౪. యః = ఎవఁడు, సర్వాణిభూతాని = ఎల్లజంతువులను, అంతః = లోపలనున్నవాఁడై, యమయతి = స్వవ్యాపారమున నియమించునో, (యతఁడే యాత్ముఁడు.)

3. బృ. ౫. ౪. ౧. ఏషః = మీఁదటి గుణము లన్నిటితోఁ గూడిన యితఁడు, తే = నీకును, (= కార్యకరణసంఘాతమునకు) సర్వాంతరః — ఆత్మా = సర్వాంతరుఁ డగు (= ఎల్లవానికి లోపల నున్నవాఁ డగు) యాత్ముఁడు.

౪. బృ. ౫. ౭. 3. (ఎవఁడు పృథివి మొదలగువానిలోపలనుండి వానిని వాని వ్యాపారమున నియమించునో) ఏషః = అట్టి నారాయణుఁడు, తే = నీకును, (నాకు నెల్ల భూతములకును) ఆత్మా = ఆత్ముఁడు, అమృతః =

శ్రుతియందు నాజీవేశ్వరుల కే యభేదము చెప్పంబడుచున్నది. జీవేశ్వరుల విషయమై రెండువిధములఁ యుపదేశము గలుగు చుండఁగా నభేద మొకటియే పరిగ్రహింపఁబడెనేని భేదవ్యపదేశము నిరాలంబ మగును. కాఁబట్టి, ఉభయవ్యపదేశాత్ = జీవేశ్వరులకు భేదాభేదముల రెంటి యుపదేశము కాన్పించుట వలనను, అహికుండలవత్ = అహికుండలములకు (=పాము, చుట్టలకు) వలె నిట (జీవపరమాత్మలకును)ఁ దత్త్వము (భేదాభేదములు) కావలెను. తుశబ్దము సిద్ధాంతవైషమ్యమును బోధించును. ఎట్లహిత్వమున నభేదమును గుండలత్వము నాభోగత్వముఁ బ్రాంశుత్వము ననువానిచే భేదమునో యట్లే యిటను (బ్రహ్మత్వమున నభేదమును, జీవత్వమున భేదమును) గావచ్చును. కడియమువలె నునికి = కుండలత్వము. చక్రాకారమున నునికి=ఆభోగత్వము. దీర్ఘదండాకారమున నునికి= ప్రాంశుత్వము.

అవ. పూర్వసూత్రమున నహికుండలన్యాయమున జీవుఁడు బ్రహ్మముయొక్క యవస్థావిశేషమని చెప్పంబడెను. ఇపు డతఁడు బ్రహ్మముయొక్క యేకదేశ మని చెప్పు చున్నాఁడు.

---

మరణధర్మము లేని (=సంసారధర్మము లెవ్వియు లేని) అంతర్యామి=విశే వడుగంబడిన యంతర్యామి యని యాజ్ఞవల్క్యుఁడు గౌతమునితోఁ జెప్పెను.)

సూ. ప్రకాశాశ్రయవద్వాతేజస్త్వాత్. ౨౮

ప. ప్రకాశాశ్రయవత్ - వా - తేజస్త్వాత్.

అ. వేఱొకపక్షమున నొకటియే యగు తేజస్త్వధర్మముచేత సూర్యుని ప్రకాశమునకున్ను సూర్యునకును ప్రమాణబలమువలన భేదాభేదములు వలె జీవేశ్వరులకు నాత్మత్వధర్మముచేతనే భేదాభేదములు శ్రుతిబలమువలన నంగీకార్యములు.

భా. అథవా = వేఱొకపక్షమునను, ప్రకాశాశ్రయవత్ = ప్రకాశమునకును దాని కాశ్రయ మగు సవితకును వలెనే బ్రహ్మమునకును జీవునకును భేదాభేదములను దెలిసికొనవలయును. తేజస్త్వాత్ =ఎట్లు సావిత్రమైన ప్రకాశమును సవితయు నను రెండు నొకటి యగు తేజస్త్వధర్మమువలన మిక్కిలి భిన్నములు కావో, కాకున్న నెట్లు భేదవ్యపదేశమును బొందుచున్నవో యట్లే జీవుడుం బరుడు నొక్కటియే యగు నాత్మత్వధర్మమువలన మిక్కిలి భిన్నులు కారు. కాకున్నను భేదవ్యపదేశముం బొందుచున్నారు.

సూ. పూర్వవద్వా. ౨౯

ప. పూర్వవత్ - వా.

అ. "ప్రకాశాదివచ్చావైశేష్యం" మను సూత్రమున భేద మౌపాధికము నభేదము పారమార్థికము నని యెద్ది చెప్పం

బడినదో యదియే సిద్ధాంతము.

భా. పూర్వవద్వా = "ప్రకాశాదివచ్చావై శేష్య" మనుచో ము న్నెట్లుపన్యసింపఁబడినదియో యది యట్లే కాఁదగును. అట్లగుచునుండఁగా బంధ మవిద్యాకృత మగుట వలన విద్యచే మోక్ష ముపపన్న మగును. పరమార్థమువలన (సత్యముగా)నే బద్ధుఁడగు నాత్మ ఁడాకాశఘటాకాశన్యాయ మునఁ బరుఁ డగు నాత్మునిసంస్థానభూతుఁడు (గఁ) గాని ప్రకా శాశ్రయన్యాయమున నేకదేశభూతుఁడు (గఁ) గాని యంగీక రింపఁబడెనేని యట్లంగీకరించుటవలనఁ బరమార్థమైన (=సత్య మైన) బంధము తిరస్కరింప నశక్య మగుటవలన మోక్షశాస్త్ర మునకు వైయర్థ్యము ప్రసక్తించును. మఱియు శ్రుతి యిట (= జీవేశ్వరులందు) భేదాభేదముల రెంటిని సమముగాఁ జెప్పదు. అభేదమునే తాత్పర్యమునం బ్రతిపాదించుచున్నది. భేదమును బూర్వసిద్ధమైన దానినే యర్థాంతరవివక్షచే నను వదించుచున్నది గాని ప్రతిపాదింపదు. కాఁబట్టి "ప్రకాశ వచ్చావై శేష్య" మనునదియే సిద్ధాంతము.

సూ. ప్రతిషేధాచ్చ. ౩౦

ప. ప్రతిషేధాత్ - చ.

అ. శాస్త్ర మెక్కారణమువలనఁ బరమాత్మునికంటె వేఱొకచేతనుని బ్రహ్మవ్యతిరిక్త మగు ప్రపంచమును నిషే

ధించుచున్నదో యాకారణమువలన నిదియే సిద్ధాంతము.

భా. ప్రతిషేధాత్-చ="నాన్యోతోఽస్తి ద్రష్టా" యను నది మొదలగు శాస్త్ర మొకారణమువలనఁ బరమాత్మని కంటె వేఱగుచేతనుని నిషేధించుచున్నదో యా యాకారణమువలన నిదియె సిద్ధాంతము. మఱియును "అథాత ఆదేశో నేతి నేతి, తదేతద్బ్రహ్మాపూర్వ మనపర మనంతర మబాహ్య" మనియును (శాస్త్రము) బ్రహ్మవ్యతిరిక్త మగు ప్రపంచమును నిరాకరించుటవలనను బ్రహ్మమును మిగుల్చుటవలనను నిదియే సిద్ధాంత మని తోఁచుచున్నది. (కాఁబట్టి చిదేకరసమును నిష్ప్రపంచముఁ దత్పదలక్ష్యము నగు బ్రహ్మము కల దను నిది సిద్ధము.)

ఇది వస్త్వాధికరణము.

---

పరాధికరణము. ౭

సూ. పర మతస్సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః. ౩౧

ప. పరం-అతః-సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః.

అ. సేత్వాదివ్యపదేశమువలన బ్రహ్మముకంటెఁ బరమైన వేఱొక తత్త్వమున్నట్లు కాన్పించుచున్నది కాఁబట్టి బ్రహ్మముకంటె నితర మగు వస్తు వెద్దియు లేదను నిది యయుక్తము.

---

౧. ౨. ఇవి పూర్వాధికరణమున విచార్యశ్రుతములు.

భా. ఏ బ్రహ్మము (నేతినేతి మొదలగు వాక్యములచే) సర్వప్రపంచవర్జిత మని నిర్ధరింపఁబడినదో దానికంటె నితరమగు తత్త్వము కలదా? లేదా? యని శ్రుతివిప్రతిపత్తి వలన సంశయము పుట్టుచున్నది. కొన్ని వాక్యములాపాతము చేతనే బ్రహ్మముకంటె వేఱగు తత్త్వముం బ్రతిపాదించుచున్నవి వలె భాసిల్లుచున్నవి. వానికిం [1]బరిహారముం జెప్పనీ యుపక్రమము చేయంబడుచున్నది. అతః = బ్రహ్మముకంటెను, పరం = వేఱొకవస్తు వుండ నర్హమగుచున్నది. ఏని వలన నంటేని, సేతూన్మానసంబంధ భేదవ్యపదేశేభ్యః = సేతువ్యపదేశమువలన నున్మానవ్యపదేశమువలనను సంబంధవ్యపదేశమువలనను, భేదవ్యపదేశమువలనను. "అథ య ఆత్మా స సేతుర్విధృతి రేషాం లోకానామసంభేదాయ" యను నీ సేతువ్యపదేశ మాత్మశబ్దమునం జెప్పంబడిన బ్రహ్మమునకు సేతుత్వముం గీర్తించుచున్నది. సేతుశబ్దము లోకములో జలప్రవా

---

౧. ఛాం. ౮. ౪. ౧. అథ = వాక్యాంతరమున స్తుతి యారంభింపఁబడుచున్నది. యః ఆత్మా = వీఁదటి లక్షణములు గల యేయాత్మయఁడు గలఁడో, సః = అతఁడు, ఏషాం-లోకానాం = కర్తృకారకాద్యక్రియవంతము లగు నీభూరాదిలోకములయొక్క, అసంభేదాయ = వినాశాభావముకొఱకు, విధృతిః = విధారకమగు, సేతుః = సేతువు (కర్తృసందగిన క్రియాది భేదవిషయము లగు నియమములచే వర్ణాశ్రమాదివ్యవస్థం జేయుచున్న యాత్మయఁడు సేతువువలె జగమునంతను నిలుపుచున్నాఁ డని యర్థము.)

ధించుచున్నదో యాకారణమువలన నిదియే సిద్ధాంతము.

భా. ప్రతిషేధాత్-చ="నాన్యోఽతోఽస్తి ద్రష్టా" యను నది మొదలగు శాస్త్ర మ్మేకారణమువలనఁ బరవస్తువుని కంటె వేఱగు చేతనుని నిషేధించుచున్నదో యాకారణమువలన నిదియె సిద్ధాంతము. మఱియును "అథాత ఆదేశో నేతినేతి, తదేతద్బ్రహ్మాపూర్వ మనపర మనంతర మబాహ్య" మనియును (శాస్త్రము) బ్రహ్మవ్యతిరిక్త మగు ప్రపంచమును నిరాకరించుటవలనను బ్రహ్మమును మిగుల్చుటవలనను నిదియే సిద్ధాంత మని తోఁచుచున్నది. (కాఁబట్టి చిదేకరసమును నిష్ప్రపంచమును దత్పదలక్ష్యము నగు బ్రహ్మము కల దను నిది సిద్ధము.)

ఇది ప్రస్తాధికరణము.

---

పరాధికరణము. ౭

సూ. పర మతస్సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః. ౩౧

ప. పరం-అతః-సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః.

అ. సేత్వాదివ్యపదేశమువలన బ్రహ్మముకంటెఁ బరమైన • వేఱొక తత్త్వ మున్నట్లు కాన్పించుచున్నది కాఁబట్టి బ్రహ్మముకంటె నితర మగు వస్తు వెద్దియు లేదను నిది యయుక్తము.

---

౧. ౨. ఇది పూర్వాధికరణమున [illegible]

భా. ఏ బ్రహ్మము (నేతినేతి మొదలగు వాక్యములచే సర్వప్రపంచవర్జిత మని నిర్ధరింపఁబడినదో దానికంటె నితరమగు తత్త్వము కలదా? లేదా? యని శ్రుతివిప్రతిపత్తివలన సంశయము పుట్టుచున్నది. కొన్ని వాక్యము లాపాతముచేతనే బ్రహ్మముకంటె వేఱగు తత్త్వముం బ్రతిపాదించుచున్నవి వలె భాసిల్లుచున్నవి. వానికిం బరిహారముం జెప్పు నీయుపక్రమము చేయంబడుచున్నది. అతః = బ్రహ్మముకంటెను, పరం=వేఱొకవస్తు వుండ నర్హమగుచున్నది. దేనివలన నంటేని, సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః=సేతువ్యపదేశమువలన నున్మానవ్యపదేశమువలనను సంబంధవ్యపదేశమువలనను, భేదవ్యపదేశమువలనను. "అథ య ఆత్మా స సేతుర్విధృతి రేషాం లోకానామసంభేదాయ" యను నీసేతువ్యపదేశమాత్రశబ్దమునం జెప్పఁబడిన బ్రహ్మమునకు సేతుత్వముం గీర్తించుచున్నది. సేతుశబ్దము లోకములో జలప్రవా

౧. ఛాం. ౮. ౪. ౧. అథ=వాక్యాంతరమున శ్రుతి యారంభింపఁబడుచున్నది. యః ఆత్మా = మీఁదటి లక్షణములు గల యేయాత్మయఁడు గలఁడో, సః=అతఁడు, ఏషాం-లోకానాం = కర్తృకారకాద్యాశ్రయము లగు నీభూరాదిలోకములయొక్క, అసంభేదాయ = వినాశాభావము కొఱకు, విధృతిః=విధారకమగు, సేతుః=సేతువు (కర్తవ్యం దగిన శ్రీయాది భేదవిషయము లగు నియమములచే వర్ణాశ్రమాదివ్యవస్థం జేయుచున్న యాత్మయఁడు సేతువువలె జగమునంతను నిలుపుచున్నాఁ డని యర్థము.)

హానమునకు నిరోధమును గావించు మృద్దారుసముదాయము నందుఁ బ్రసిద్ధము గదా! ఇట (=శ్రుతియందు) సేతు శబ్ద మాత్మనందుఁ బ్రయుక్తమైనది కాఁబట్టి లౌకికసేతువుకంటె వలె నాత్మసేతువుకంటెను వేఱొకవస్తువున కస్తిత్వమును (=కలిమిని) దెలుపుచున్నది. మఱియును "సేతుంతీర్త్వా" యనుచోటను "తరతి" శబ్దప్రయోగమువలన నెట్లు లౌకిక మగు సేతువును దాఁటి సేతుభిన్నమగు జాంగలము (=వాత భూయిష్ఠమగు ప్రదేశము) ను బొందుచున్నాఁడో యట్లే యాత్మఁ జను సేతువు నతిక్రమించి దానికంటె భిన్నమగు ననాత్మను బొందుచున్నాఁ డని తోఁచుచున్నది. "తదే తద్బ్రహ్మచతుష్పాదష్టాశఫం షోడశకల" మ్మను నున్మాన వ్యపదేశముం గలను. ఉన్మానముం జెప్పు వాక్యముం గల దని యర్థము. లోకమునం గార్షాపణాదిక (టంకము మొద

---

౧. ఛాం. ౮. ౪. ౨. (సేతువును = బ్రహ్మమును, దాఁటి యని పూర్వపక్షార్థము.) సేతుం=సేతు సదృశమగు బ్రహ్మమును, తీర్త్వా=పొంది యని సిద్ధాంతార్థము.

౨. తదేతద్బ్రహ్మ=ఈ బ్రహ్మము, చతుష్పాత్=దిక్కులు, నాల్గు నగు ప్రకాశవంతె మను పాదమును, పృథివియు నంతరిక్షము, దివియు సముద్రము నగు ననంతవంత మను పాదమును, అగ్నియుఁ జంద్రుఁడు సూర్యుఁడు విద్యుత్తు నగు జ్యోతిష్మంత మను పాదమును, చక్షువు శ్రోత్రము వాక్కు మనము నగు నాయతనవంతమను పాదము నని నాల్గుపాదములు గలది. అష్టాశఫం=పాదార్థములను ఎనిమిది డెక్కలు గలదియు, షోడశ కలం=పాదమునకు నాల్గేసి చొప్పునఁ బదియాఱు కలలు గలదియును.

లగు నాణె) పెద్ది యింతపరిమాణము కల దని యున్మితమో (=తూపంబడినదియో) దానికంటె వేఱువస్తువు కలదని ప్రసిద్ధము. అట్లే బ్రహ్మమునకు నున్మానమువలన దానికంటె వేఱొకవస్తు వుండవలసియున్నది. అట్లే "సతాసోమ్య తదా సంపన్నో భవతి" యనియును, "శారీర ఆత్మాప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో నబాహ్యం కించన వేదనాంతరః" మ్మనియును సంబంధవ్యపదేశము కలదు. (లోకములో) నరులను నగరముతోడను వలె మితములగువానికి మితములగువానితో సంబంధము గలుగుచున్నది. జీవులకును బ్రహ్మముతోడ సుషుప్తియందు సంబంధమును శ్రుతి చెప్పుచున్నది కాఁబట్టి బ్రహ్మముకంటె వేఱొకటి యమితమైనది కలదని తోఁచుచున్నది. భేదవ్యపదేశము నీయర్థమునే తెలుపుచున్నది. అది యెట్లన్నం బ్రతిపాదింపఁబడుచున్నది. (శ్రుతి) "[3]అథయ ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" యనుచోట నాదిత్యమండలమం దున్న యీశ్వరునిఁ జెప్పి "[4]అథయ ఏషో తరక్షిణి పురుషో దృశ్యతే" యనుచోటఁ గంటియందున్న యీశ్వరునంతకంటె వేఱుగా నుపదేశించుచున్నది. (ఇట నాధారము

౧, ౨, వీని రెంటికి నీ యధ్యాయద్వితీయపాదమునఁ దదభావాధికరణమున నర్థము వ్రాయంబడె.

౩, ౪, వీని యర్థము ప్రథమాధ్యాయ ప్రథమపాదమున నంతరధికరణమున వ్రాయంబడె.

వలన భేదము చెప్పంబడె.) "తస్యైతస్య తదేవరూపం యదముష్యరూపం యావముష్య గేష్ణా" యనునది గంటియందున్న యీశ్వరునకు నాదిత్యునందున్న వానితో రూపాదులం దతిదేశముం జేయుచున్నదియును. ఇట నతిదేశమువలన భేదము చెప్పంబడెను. "యేచాముష్మాత్పరాంచో లోకా స్తేషాంచేష్టే దేవకామానా" మనునది యొకనికిని (సూర్యమండలమ్ము దున్న వానికిని) "మేచామష్మాదర్వాంచో లోకా స్తేషాంచేష్టే మనుష్యకామానా" మనునది వేఱొకనికిని (అక్షియందున్న వానికిని) సావధికమైన యీశ్వరత్వము నిర్ధరించి నిది మాగధునిరాజ్య మిది వైదేహునిరాజ్య మన్నట్లు వ్యపదేశించుచున్నది. ఇట నవధివలన భేదము చెప్పంబడినది.

అవ. ఈ ప్రకారముగా మీఁదఁ జెప్పంబడిన సేత్వాది వ్యపదేశములవలన బ్రహ్మముకంటె వేఱొకటి కల దని ప్రాప్తింపఁగా నుత్తరముం జెప్పుచున్నాఁడు.

సూ. సామాన్యాత్తు. ౩౨

ప. సామాన్యాత్ - తు.

అ. లోకములో సేతువు జలములను నిలుపునట్లు బ్రహ్మము లోకములను లోకమర్యాదలను నిలుపును గాఁబట్టి

---

౧. శ్రీ ౩. ఇనియము వై యధికరణమునవే వ్యాఖ్యాతములు.

యీ కొలఁదిసామ్యమువలన సేతు వని వ్యపదేశింపఁబడెను గాని ప్రమాణాభావమువలన దానికంటె నన్య మగు వస్తు వెద్దియు లేదు.

భా. తు శబ్దముచే మీఁదఁ జెప్పంబడిన వేఱొక వస్తుప్రాప్తి నివారించుచున్నాఁడు. ప్రమాణ మెద్దియు లేక పోవుటవలన బ్రహ్మముకంటె వేఱొకవస్తు వెద్దియుఁ గల దన రాదు. (బ్రహ్మముకంటె) వేఱొకటి కల దను, సంశయమునందుఁ బ్రమాణము నెద్దానిం గనము కదా! జనించుచున్న వస్తు సముదాయమున కెల్ల జన్మస్థితిసంహారములు బ్రహ్మమువలన నగుచున్న వనునిది నిర్ధరింపఁబడెను. మఱియుఁ గార్యమునకుఁ గారణముకంటె ననన్యత్వమును సిద్ధాంతింపఁబడెను. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవా ద్వితీయ" మను నిర్ధారణము వలన బ్రహ్మముకంటె వ్యతిరిక్తమగు నజమైన వస్తు వెద్దియు సంభవింపదు. ఏకవిజ్ఞానమువలన సర్వవిజ్ఞానము కలుగు నను ప్రతిజ్ఞవలన బ్రహ్మముకంటె వేఱొక టెద్దియుఁ గలదని కల్పింపను వలను లేదు. అయ్యా! సేత్వాదివ్యపదేశములు బ్రహ్మ వ్యతిరిక్తమగు వస్తువును సూచించుచున్న వని చెప్పంబడెనని సూచింప వని చెప్పంబడుచున్నది. సేతువ్యపదేశ మాత్మ్యందు సేతు వని చెప్పుచున్నది గాని దానికంటెఁ బరమగు వస్తువు

౧. ఇది ప్రథమాధ్యాయమున నీక్షత్యధికరణమున వ్యాఖ్యాతము.

కల దని చెప్పదు. కాఁబట్టి బ్రహ్మముకంటె బాహ్యమగు వస్తువుయొక్క సద్భావముం బ్రతిపాదింపంజాలదు. వేఱొక వస్తువు లేదని బ్రహ్మమునందు సేతుత్వము సంభవింపదు కాఁబట్టి వేఱొక వస్తు వెద్దియైనం గలదని కల్పింపఁబడు నేని నది న్యాయ్యము గాదు. అప్రసిద్ధవస్తుకల్పన సాహసము గదా! మఱియు సేతువ్యపదేశమువలన నాత్మునకు లౌకికసేతు నిదర్శనముచే సేతువుకంటె బాహ్యవస్తుత్వము ప్రసక్తింపఁ జేయువానిచే (బ్రహ్మమునకు) మృద్దారుమయత్వమును బ్రసక్తింపఁజేయఁ బడఁగలదు. అజత్వాది శ్రుతి విరోధము వలన నది న్యాయ్యము గాదు. సామాన్యాత్ = సేతుసాదృశ్యమువలన సేతుశబ్ద మాత్మునందుఁ బ్రయోగింపఁబడిన దను నిది యుక్తముగా నుండును. జగమును దాని మర్యాదలను నిలుపు టాత్మునకు సేతువుతోడి సామ్యము. దానివలన సేతువుం బోలునది సేతు వని ప్రస్తుతుఁ డగు నాత్ముఁడు స్తుతియింపఁబడుచున్నాఁడు. "సేతుంతీర్త్వా" యనుచోటనును తరతిశబ్ద మతిక్రమార్థమున సంభవింపక పోవుటవలనఁ బ్రాప్త్యర్థమునందే వర్తిల్లును. ఎట్లు "వ్యాకరణం తీర్ణ" యని వ్యాకరణముం బొందినవాఁడు చెప్పంబడుచున్నాఁడు కాని వ్యాకరణము నతిక్రమించినవాఁడు చెప్పంబడఁడో యట్లే.

సూ. బుద్ధ్యర్థః పాదవత్. 33

ప. బుద్ధ్యర్థః - పాదవత్.

అ. కార్షాపణమునందు వ్యవహారార్థము పాదము లెట్లు కల్పింపఁబడెనో యట్లే బ్రహ్మమునందు నుపాసనార్థము "చతుష్పాది" త్యాద్యున్మానము చెప్పంబడెఁగాని, బ్రహ్మము కంటె వేఱొక వస్తువు కలదని ప్రతిపాదింపఁగాదు. (సూత్రమునకుఁ గల రెండవయర్థము క్రింద స్పష్టమగును.)

భా. ఉన్మానవ్యపదేశము (=పరిమాణముం జెప్పుట) వలన బ్రహ్మముకంటె నన్యమగు వస్తువు కలదని యెద్ది చెప్పంబడినదో యటఁ జెప్పంబడుచున్నది. ఉన్మానవ్యపదేశమైనను బ్రహ్మముకంటె వేఱొక వస్తువున కస్తిత్వమును దెలుపుట ప్రయోజనముగాఁ గలది కాదు. అపు డది యేమి ప్రయోజనము కలది యనెనేని, బుద్ధ్యర్థః=ఉపాసనార్థము. "చతుష్పాద్బ్రహ్మ షోడశకలమ్"ను నిట్టి యాకారము గల బుద్ధి యెట్లు బ్రహ్మమునందు స్థిరముగా నుండు నని తలఁచి వికారద్వారమున బ్రహ్మమున కున్మానకల్పన చేయంబడుచున్నది. (కాని బ్రహ్మముకంటె వేఱువస్తువు కలదని చెప్పుటకుఁగాదు.) పురుషులు మందమధ్యమోత్తమబుద్ధులు కలవా రగుటవలన నెల్లవారికి నిర్వికారము ననంతము నగు బ్రహ్మమునందు బుద్ధి నిల్ప శక్యము గాదు గదా! పాదవత్=ఎట్లధ్యాత్మము నధి

దైవతమును బ్రహ్మప్రతీకము లని చెప్పంబడిన మనసునకు నాకాశమునకును ధ్యానార్థము వాక్ప్రాణచక్షుశ్శ్రోత్రములు మనస్సంబంధు లగు పాదములును నాలుగైన వాయ్వగ్న్యాదిత్యదిశ లాకాశసంబంధము లగు పాదములుం గల్పింపఁబడుచున్నవో యట్లే (బ్రహ్మమున కున్మానము ధ్యానార్థము కల్పింపఁబడుచున్నది). లోకపక్షమునను, పాదవత్ = క్రయవిక్రయపరిమాణమునకు నియమము లేకపోవుటవలన నెల్లపుడు నెల్లజనులు పూర్ణమగు కార్షాపణముతో వ్యవహరింపలేరు కాఁబట్టి యెట్లు వ్యవహారార్థము కార్షాపణమునఁ బాదవిభాగము కల్పింపఁబడుచున్నదో యట్లే (మందబుద్ధులకు ధ్యానవ్యవహారార్థము బ్రహ్మమున కున్మానకల్పన చేయంబడుచున్నది యని యర్థము.)

సూ. స్థానవిశేషాత్ప్రకాశాదివత్. ౩౪

ప. స్థానవిశేషాత్ - ప్రకాశాదివత్.

అ. ఒకటియే యగు బ్రహ్మమునకు సౌరప్రకాశాదికమునకు వలెనే యుపాధిభేదమువలన సంబంధభేదవ్యపదేశము పపన్నము కాఁబట్టి దానివలన బ్రహ్మముకంటె నన్యము కల దనరాదు.

భా. ఈ సూత్రమున రెండు వ్యపదేశములకుం బరిహారము చెప్పంబడుచున్నది. సంబంధవ్యపదేశమువలనను

భేదవ్యపదేశమువలనను బ్రహ్మముకంటె నన్యమగు వస్తు వుండంబోలునని యెద్ది చెప్పంబడినదో యది యేకాకారణము వలన నొకదానికిని, స్థానవిశేషాత్ =స్థానము=బుద్ధి సూర్యుఁడు కన్ను మొదలగు నుపాధి; దాని భేదమువలన నీ వ్యపదేశము లుపపన్నములో యా కారణమువలన యుక్తము కాదు. సంబంధవ్యపదేశమునం దిది యర్థము. బుద్ధ్యాద్యుపాధి విశే షములోడి సంబంధమువలన నుత్పన్నమైన విశేషజ్ఞానమున కుపాధ్యుపశమము గల్గుచుండఁగా నే యుపశమము గలదో యది పరమాత్మునితో సంబంధ మని యుపాధ్యపేక్షచే గౌణముగాఁ జెప్పంబడుచున్నది కాని పరిమితత్వాపేక్షచేఁ జెప్పంబడినది కాదు. అట్లే భేదవ్యపదేశమును బ్రహ్మమున కుపాధిభేదాపేక్షచేతనే యుపచరింపఁబడు చున్నది గాని స్వరూపభేదాపేక్షచేఁ జెప్పంబడినది కాదు. 'ప్రకాశవత్తు' ను నిది యుపమానము. ఎట్లొకటియే యగు సౌరప్రకాశము నకుఁ గాని చాంద్రప్రకాశమునకుఁ గాని (యంగుళి మొదలగు నట్టి) యుపాధిసంబంధమువలనఁ గలిగిన విశేషముం బొందిన దాని కుపాధ్యుపశమము గల్గుచుండఁగా (మహాలోకాది స్వరూపముతో) సంబంధవ్యపదేశము నుపాధిభేదమువలన భేదవ్యపదేశము నగుచున్నవో యట్లు సూచీపాశాకాశాదులం దుపాధ్యపేక్షచేతనే యీ వ్యపదేశము లగుచున్నవో యట్లే

(యేక మగు బ్రహ్మమునందు నుపాధ్యపేక్షచే సంబంధభేద వ్యపదేశము లగుచున్నవి.)

సూ. ఉపపత్తేశ్చ. 3౫

ప. ఉపపత్తేః - చ.

అ. వాక్యశేషమునం జెప్పఁబడిన తన్నుఁ దాను బొందుచున్నాఁడను నిది యుపాధిచేఁ జేయంబడిన స్వరూప తిరోభావము నపేక్షించియే యుపపన్న మగుటవలన జీవ బ్రహ్మముల కిట్టి గౌణమైన సంబంధ వ్యపదేశమే యుక్తము. పెక్కు శ్రుతులచేఁ జెప్పంబడిన యేకేశ్వరత్వమునకు విరోధము ప్రసక్తించుటవలన భేదము నౌపాధికమే కాని వేఱొక విధము గలది సంభవింపదు.

భా. జీవునకు బ్రహ్మమునకు నిట్టి (= గౌణమైన) సంబంధమే యుపపన్నము గాని యన్యాదృశమైన (=ముఖ్యమైన) సంబంధ ముపపన్నము గాదు. (దేనివలననంటేని) ఉపపత్తేః చ = "స్వమపీతో భవతి" యను దీనిని స్వరూప సంబంధమునుగాఁ జెప్పటః యుపపన్న మగుటవలనను, స్వరూపము విడువనిది యగుటవలన నరనగరన్యాయమున సంబంధము ఘటిల్లదు. ఉపాధిచేఁ జేయంబడిన స్వరూప తిరోభావమువలననే "స్వమపీతో భవతి" యనునిది యుపపన్న మగుచున్నది. (జీవునకును బ్రహ్మమునకును) భేదము

నిట్టిదియే = ఔపచారికమే కాని యనేకశ్రుతిప్రసిద్ధ మగు నేకేశ్వరత్వవిరోధము ప్రసక్తించుటవలన ముఖ్యమైనది సంభవింపదు. అట్లేకదా "యోయంబహిర్ధా పురుషా దాకాశః [1]యోయ మంతః పురుష ఆకాశః యోయ మంతర్హృదయ ఆకాశ" యనుశ్రుతి యొక్కటియె యగు నాకాశమునకుపాధికృతమైన భేదము నుపపాదించుచున్నది.

సూ. తథాన్యప్రతిషేధాత్. ౩౭

ప. తథా-అన్యప్రతిషేధాత్.

అ. అట్లే యితరవస్తువుల నిషేధించుటవలనను బ్రహ్మముకంటె వేఱొకవస్తువు లేదని తెలియంబడుచున్నది.

భా. ఈ ప్రకారముగా సేత్వాదివ్యపదేశము లగు పరపక్ష హేతువుల నున్మథించి స్వపక్షమును (=బ్రహ్మ మద్వితీయ మనునది స్వపక్షము.) వేఱొక హేతువుచే దృఢపఱచుచున్నాఁడు. తథా=సేత్వాది వ్యపదేశముల నిరాసమువలన నెట్లు వేఱొక వస్తువు లేదని తెలియంబడుచున్నదియో యట్లే, అన్యప్రతిషేధాత్=బ్రహ్మముకంటె నితరమగువాని నిషేధిం

౧. ఛాం. ౩. ౧౨. ౧౭ బహిర్ధా పురుషాత్ = పురుషునికంటె వెలుపలనున్న, యః-ఆకాశః = ఏ యాకాశము చెప్పంబడినదో (యాభౌతికాకాశము) అంతః పురుషే=శరీరమునను, యోయం-ఆకాశః=ఏయాకాశ మున్నదియో, సః=అదియే, అంతర్హృదయే = హృదయమధ్యమున నుపాస్య మని చెప్పఁబడిన యః-ఆకాశః=ఏ పుండరీకాకాశము కలదో (సః=అది) అయం ఇదియే.

యస్మాత్పరంనాపర మస్తికించిత్[1], తదేతద్బ్రహ్మాపూర్వ మనపర మనంతర మబాహ్యం, మనునది మొదలగు స్వ(బ్రహ్మ)ప్రకరణములో నున్న వాక్యములు ద్వైతార్థమును బోధించునవి యని (=అర్థవాదము లని) చెప్ప నశక్యము లగుచు బ్రహ్మముకంటె నితరమగు వస్తువును వారించుచున్నవి. మఱియు సర్వాంతర శ్రుతివలనను బరమాత్మునికంటె నన్యుఁడగు నంతరాత్ముఁడు లేఁ డని నిశ్చయింపఁబడుచున్నది.

సూ. అనేన సర్వగతత్వ మాయామశబ్దాదిభ్యః. 3౭

ప. అనేన - సర్వగతత్వం - ఆయామశబ్దాదిభ్యః.

అ. సేత్వాదివ్యపదేశమును నిరాకరించుటచేతను వేఱొక వస్తువు లేదని నిషేధించుటచేతను బ్రహ్మమునకు సర్వగతత్వము సిద్ధించుచున్నది. సర్వగతత్వమును బ్రహ్మమున కాయామశబ్దాదులవలనఁ దెలియంబడుచున్నది.

భా. అనేన=సేత్వాది వ్యపదేశముల నిరాకరించుటచేత నన్యప్రతిషేధము నాశ్రయించుటచేతను, సర్వగతత్వం=ఆత్మునకు సర్వగతత్వమును సిద్ధించుచున్నది. వేఱొకలాగున నయ్యెనేని యది సిద్ధింపదు. సేత్వాదు లట్టివే, (అల్పములే)

౧. శ్వే. 3. ౯ యస్మాత్=ఎవనికంటెను, పరం=ఉత్కృష్టమైనది గాని, అపరం=నికృష్టమైనది గాని, కించిత్ = ఏపదార్థమును, న=లేదో, అట్టిపురుషునిచేత నిది యంతయుఁ బూర్ణము.

౨. దీనియర్థ మీపాదమున మొదట నధికరణమున వ్రాయఁబడె.

యగుటవలన సేత్వాది వ్యపదేశములు ముఖ్యములే యని యంగీకరింపఁబడినవి యగుచు నుండఁగా నాత్మునకుఁ బరిచ్ఛేదమే (=అల్పత్వమే) ప్రసక్తించును. ఆత్మునకు సర్వగతత్వము నాయామశబ్దాదులవలనం దెలియంబడు చున్నది. ఆయామశబ్దము నా వ్యాప్తిం జెప్పు శబ్దము. "యావాన్వా య మాకాశ స్తావానేషోంతర్హృదయ[3] ఆకాశః, ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, జ్యాయాన్[౪] దివో జ్యాయానాకాశాత్, నిత్యస్సర్వగత స్థాణురచలో౽యం సనాతన" యనునది మొదలగు శ్రుతిస్మృతిన్యాయములు లాత్మునకు సర్వగతత్వమును బోధించు చున్నవి గదా! (అధిష్ఠానముచే నధ్యస్త మగు జగము వ్యాపింపఁ బడుచున్నది అధ్యస్థ మగుటవలన రజ్జువుచే వ్యాపింపఁబడిన సర్పమువలె నను నిది న్యాయము.)

ఇది సప్తమాధికరణము.

---

### ఫలాధికరణము. ౮

సూ. ఫల మత ఉపపత్తేః. ౩౮

ప. ఫలం–అతః–ఉపపత్తేః.

---

౧. ౨. ౩ సూ॥ములు ౧ అ. ౩ పా॥ దహరాధికరణమున వ్యాఖ్యాతములు.

౪. భగ. అ. ౨. శ్లో. ౨౪. అయం=ఈయాత్మయు, నిత్యః=నాశము లేనివాఁడు సర్వగతః=ఎల్లవానిం బొందినవాఁడు (=విభువు.) కనుకనే స్థాణుః=స్థిరుఁడు. కనుకనే అచలః=కదలనివాఁడు. కనుకనే, సనాతనః=చిరంతనుఁడుగాని నూతనముగానే కారణమువలన నుత్పన్నుఁడు గాఁడు.

అ. ఈశ్వరునకే ఫలదాతృత్వ ముపపన్న మగుట వలనఁ బరమాత్మునివలననే కర్మఫలము సంభవించుచున్నది. (ఇట్లు తత్పదలక్ష్యార్థమును శోధించి వాచ్యార్థముం జెప్పుచున్నాఁడు.)

భా. వ్యావహారికి (వ్యవహారమే ప్రయోజనముగాఁ గలది) యగు నీశితృశితవ్యవిభాగావస్థయందు మీఁదఁ జెప్పంబడిన బ్రహ్మసంబంధ మైనదియే యగు వేఱొక స్వభావము (=నిర్విశేషత్వముకంటె భిన్న మైన ఫలదాతృత్వ మను స్వభావము) వర్ణింపఁబడు చున్నది. సంసారగోచరమును (= జన్మమరణప్రవాహ మాశ్రయముగాఁ గలదియును) నిష్టానిష్టవ్యామిశ్రరూపము నగు త్రివిధ మైన యే ఫలము జంతువులకుఁ బ్రసిద్ధమో యది కర్మమువలన నగుచున్నదా? కాక యీశ్వరునివలననా? యని విచారణ యగుచున్నది. అట్టి విచారణ యగుచుండఁగాను, ఫలం = కర్మఫలము, (స్వర్గాదికము) అతః=ఈశ్వరునివలన నగు నని ప్రాప్తించుచున్నది. దేనివలన ననెనేని, ఉపపత్తేః=(అతనికి ఫలదాతృత్వ ముపపన్న మగుటవలన నని చెప్పవలయును.) అతఁడు సర్వాధ్యక్షుఁడు గనుక విచిత్రము లగు సృష్టిస్థితిసంహారములు గావించుచు దేశకాలవిశేషముల నెఱిఁగినవాఁడు గనుకఁ గర్ములకుఁ గర్మానురూప మగు ఫలమును సంపాదించు

చున్నాఁడను నిది యుక్తమగుచున్నది. కాని యభావము వలన భావము పుట్టుటవలన ననుక్షణవినాశి యగు కర్మము వలనఁ గాలాంతరభావి యగు ఫలము పుట్టుచున్న దను నిది యుక్తము గాదు. కర్మము నశింపుచుఁ దా నున్నకాలముననే స్వానురూపమగు ఫలమును బుట్టించుచున్నది కర్త కాలాంతరితమగు నాఫలము ననుభవింపఁగలఁ డనునిది కావచ్చు ననిన నదియును భోక్తృసంబంధముకంటెఁ బూర్వము ఫలత్వానుపపత్తివలన శుద్ధము కాదు. ఎక్కాలమున నేసుఖముకాని దుఃఖముకాని తనచే ననుభవింపఁబడుచున్నదియో (యపుడే) దానికే లోకమున ఫలత్వము ప్రసిద్ధము. కాని తనతో సంబంధింపని సుఖమునకుఁ గాని దుఃఖమునకుఁ గాని ఫలత్వమును లౌకికు లంగీకరింపరు గదా! కర్మమునకుఁ దరువాత ఫలోత్పత్తి లేకపోవుఁగాక! కర్మమువలనఁ బుట్టిన యపూర్వమువలన ఫలోత్పత్తి కాఁగలదని చెప్పఁబడునేని కాష్ఠలోష్టసమము నచేతనము నగు నపూర్వమునకుఁ జేతనునిచేఁ బ్రేరింపఁబడని దానికిఁ బ్రవృత్తి యుపపన్నము కాకపోవుటవలన నపూర్వము కల దను నంశమునఁ బ్రమాణాభావమువలనను గర్మములచే నారాధింపఁబడిన యీశ్వరుని వలననే ఫలము సిద్ధించుటవలన నర్థాపత్తి సిద్ధింపగనుకను నదియు యుక్తము కాదు. (శీఘ్రముగ నశించుయాగ

మునకు వినంబడిన కాలాంతరభావిఫలహేతుత్వము స్థాయి వస్తువుకే గాని నుపపన్నము కానిది యగుటను నపూర్వమును గల్పింప నగు నిది యర్థాపత్తి.) (కృతాత్యయాధికరణమునం జెప్పంబడిన శ్రుతిస్మృతులచే నపూర్వము సిద్ధించు ననిన వానిచే నీశ్వరునకును ఫలదాతృత్వము గ్రాహ్య మని సూత్రకారుఁడు చెప్పుచున్నాఁడు.)

సూ. శ్రుతత్వాచ్చ. ౩౯

ప. శ్రుతత్వాత్ - చ.

అ. కేవల ముపపత్తివలనఁ గాక శ్రుతి చెప్పుటవలన నీశ్వరుఁడే ఫలదాత.

భా. కేవల ముపపత్తివలననే యీశ్వరుని ఫలహేతువుగాఁ గల్పింపము. మఱి యుపపత్తివలనను నంకుని శ్రుతత్వాచ్చ=శ్రుతియందు వినంబడుటవలన నీశ్వరుఁడు ఫలహేతువని తలంచుచున్నారము. "స వా ఏష మహానజ ఆత్మాఽన్నాదో వసుదాన"[1] యనునది మొదలగు శ్రుతి యట్లే ప్రతిపాదించుచున్నది గదా!

[1]. బృ. ౪. ౪. ౨౪. మహాన్ అజః-సః-ఏషః-ఆత్మా-వై - వ్యాపకుఁడు, జన్మాదిరహితుఁడు నగు నా యీ యాత్ముఁడే, అన్నాదః - ప్రాణులకు మిక్కిలిగా నన్నము నిచ్చువాఁడును, వసుదానః - ధనదానము సేయువాఁడును.

సూ. ధర్మం జైమిని రత ఏవ. ౪౦

ప. ధర్మ - జైమినిః - అతః - ఏవ.

అ. జైమిన్యాచార్యుఁడు శ్రుత్యుపపత్తులవలననే ధర్మమును ఫలదాతగాఁ జెప్పుచున్నాఁడు.

భా. జైమినిః=జైమిన్యాచార్యుఁడు. అతఏవ = ఆకారణమువలననే, (=శ్రుతివలన నుపపత్తివలననే) ధర్మం = కర్మమును, ఫలదాతగాఁ జెప్పుచున్నాఁడు. ఈ యర్థము "స్వర్గంకామో యజేత" యనునది మొదలగు వాక్యములందు వినంబడుచున్నది. అందు విధ్యర్థమునకు (=ప్రేరణాత్మక మగు లిఙర్థమునకు) విషయభావమును బొందుటవలన యాగము స్వర్గమున కుత్పాదక మని (= సాధన మని) తెలియంబడుచున్నది. ఇట్లు కాదేని (=యాగ మిష్టసాధనము కాదేని ప్రేరణానుపపత్తివలన) యాగ మననుష్ఠాత్రుకము (=చేయువాఁడు లేనిది) యగును. అట్లగుచునుండఁగా దీని యుపదేశమునకు వైయర్థ్యము ప్రసక్తించును. అయ్యా, యనుక్షణవినాశి యగు కర్మమువలన ఫలము పుట్టదు కాఁబట్టి యీ పక్షము విడువంబడినది యనిన శ్రుతిప్రామాణ్యమువలన నీ దోషము ప్రసక్తింపదని చెప్పెదము. శ్రుతి ప్రమాణ మయ్యెనేని శ్రుతమగు కర్మఫలసంబంధ మెట్లుపపన్నమో యట్లు కల్పింపందగినది. కర్మ మొకానొక యపూర్వముం బుట్టింపక నశిం

చుచుఁ గాలాంతరవ్యవహిత మైన ఫలము నీఁజాలదు కాఁబట్టి కర్మముయొక్క యొకానొక సూక్ష్మమైన యుత్తరావస్థ కాని ఫలముయొక్క పూర్వావస్థకాని యపూర్వ మనునది కలదని యూహింపఁబడుచున్నది. ఈ యర్థము చెప్పంబడిన ప్రకారముచే నుపపన్న మగుచున్నది. కాని యేకరూప మగు కారణమువలన ననేకరూప మగు కార్య ముపపన్నము కాదు గనుకను వైషమ్యనైర్ఘృణ్యములు ప్రసక్తించుటవలనను గర్మానుష్ఠానమునకు వైయర్థ్యము ప్రాప్తించుటవలన నీశ్వరుఁడు ఫలము నిచ్చుచున్నాఁ డను నిది యనుపపన్నము. కాఁబట్టి (మీఁదటి దోషములం బరిహరింప నపూర్వద్వారమున) ధర్మమువలననే ఫలము గలుగుచున్నది గాని యీశ్వరునివలనం గలుగదు.

సూ. పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్. ౪౧

ప. పూర్వం - తు - బాదరాయణః - హేతువ్యపదేశాత్.

అ. ఈశ్వరుఁడు ఫలమునకును ధర్మాధర్మములకును హేతువని శ్రుతులు చెప్పుటవలన బాదరాయణుఁ డీశ్వరుఁడే ఫలహేతు వని తలంచుచున్నాఁడు.

భా. బాదరాయణః = బాదరాయణాచార్యుఁడు, పూర్వం = మొదటఁ జెప్పిన యీశ్వరునినే ఫలహేతువుగాఁ

దలంచు చున్నాడు. తు శబ్దము కేవల కర్మమువలనంగాని కేవలా పూర్వమువలనం గాని ఫలము కలుగునను నీ పక్షమును వారించుచున్నది. కర్మాపేక్ష కలవానివలనం గాని యపూర్వాపేక్ష కలవానివలనం గాని యట్లైన నట్లగుం గాక. ఈశ్వరునివలన ఫలమగుచున్న దని సిద్ధాంతము. ఏ కారణమువలన నిది సిద్ధాంతమంటేని, హేతువ్యపదేశాత్ = "ఏష హ్యేవ సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష హ్యేవాసాధుకర్మ కారయతి తం యమధో నినీషతే" యను (శ్రుతి) కారయితృత్వముచే ధర్మాధర్మములకును దాతృత్వమున ఫలమునకు నీశ్వరుడు కారణ మని వ్యపదేశించుచున్నది యను కారణమువలనను. ఈ యర్థము "యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛ

౧ ద్వితీయాధ్యాయ ప్రథమపాదమున వైషమ్య నైర్ఘృణ్యాధికరణమున దీని యర్థము వ్రాయంబడె.

౨ భగ, అ ౭ శ్లో. ౨౧ యః యః = ఏయే కాముడు, యాం యాం తనుం = ఏ యే దేవతాశరీరమును, భక్తః = అనురాగము కలవాడై, శ్రద్ధయా = శ్రద్ధతోడను, అర్చితుం = పూజించుటకొఱకు, ఇచ్ఛతి = కోరుచున్నాడో, తస్య తస్య = ఆయా కాముకునకు, అచలాం = స్థిరమైన, తాం శ్రద్ధాం ఏవ = ఆ శ్రద్ధనే, విదధామి = కలిగించుచున్నాను. సః = వాడు, తయా = నాచేత స్థిరపఱుపఁబడిన - శ్రద్ధయా = శ్రద్ధతోడను, తస్య = ఆ దేవతాశరీరముయొక్క, ఆరాధనం = పూజను, ఈహతే = చేయఁగోరుచున్నాడు. తతః = ఆరాధింపఁబడిన దేవతాశరీరమువలనను, మయైవ = (కర్మఫలవిభాగము నెఱింగినవాఁడను సర్వజ్ఞుఁడను పరమేశ్వరుఁడ నగు) నాచేతనే, విహితాన్ = ఈయఁబడిన, హితాన్ = హితములగుచున్న, కామాన్ = కోరిన పదార్థములను, లభతే = పొందుచున్నాఁడు.

తి తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహం, స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే లభతే చ తతః కామా న్మయైవ విహితాన్ హి తాన్" అని భగవద్గీత లందును స్మరింపఁబడుచున్నది. వేదాంతము లన్నిటియందును సృష్టు లీశ్వరహేతుకము లనియే చెప్పఁబడుచున్నది. తమ తమ కర్మముల కనురూపులగు జనుల సృజించుచున్నాఁ డను నిదియొద్దియో యదియే యీశ్వరునకు ఫలహేతుత్వము. ఈశ్వరుఁడు ప్రాణికర్మముల నపేక్షించువాఁ డగుటవలన విచిత్ర కార్యానుపపత్త్యాదు లగు దోషములుం బ్రసక్తింపవు.

ఇది యత్నమాధికరణము.

---

ఇది శ్రీశంకర భగవత్పాదకృతి యగు
శారీరకమీమాంసాభాష్యమునఁ దృతీయాధ్యాయ
ద్వితీయపాదాంధ్రీకరణము.

---

# ఆంధ్ర సూత్ర భాష్యము

అధ్యాయము 3. పాదము 3.

---

సర్వవేదాంత ప్రత్యయాధికరణము. ౧

సూ. సర్వవేదాంతప్రత్యయం చోదనాద్య విశేషాత్. ౧

ప. సర్వవేదాంతప్రత్యయం-చోదనాద్య విశేషాత్.

అ. చోదనాదిభేదము లేకపోవుటవలన నెల్లవేదాంతములచే విధింపఁబడుచున్న విజ్ఞాన (ప్రాణాద్యుపాసన) మొక్కటియె కాని భిన్నము కాదు.

భా. పూర్వపాదమున విజ్ఞేయ మగు బ్రహ్మస్వరూపము వక్కాణింపఁబడియె. ఈ పాదమునఁ బ్రతివేదాంతమును విధింపఁబడిన విజ్ఞానములు భేదిల్లుచున్నవా? భేదిల్లవా? యను నిది విచారింపఁబడుచున్నది. అయ్యా! విజ్ఞేయ మగు బ్రహ్మము సైంధవఘనమువలె నేకరసము నెట్టి భేదములు లేనిదియు నని నిర్ధారింపబడెను. జ్ఞేయ మగు బ్రహ్మమునం దే విధమగు భేదము లేనిది యగుచునుండఁగా నెట్లు విజ్ఞానములకు భేదమా? యభేదమా? యను చింత కలుగును? వేద్య మగు బ్రహ్మ మేక మగుటవలనను నిర్ధర్మ మగుటవలనను బ్రహ్మము

నకుఁ గర్మమునకు వలె బహుత్వము వేదాంతములం బ్రతిపాదింపఁ గోరఁబడినది యనరాదు గదా! ఏకాకారమగు బ్రహ్మమునం దనేకరూపములగు విజ్ఞానములు సంభవింపవును. అర్థము (వస్తువు) వేఱొకవిధము కలదియును జ్ఞానము వేఱొక ప్రకారము గలదియు ననుట యభ్రాంతము కాదు గదా! ఏకమగు బ్రహ్మమునం దనేకములగు విజ్ఞానములు వేఱువేఱు వేదాంతములం బ్రతిపాదింపఁ గోరంబడునేని వానిలో నొకటి యభ్రాంతము తక్కినవి భ్రాంతములు గనుక వేదాంతములం దనాశ్వాసము ప్రసక్తించును. కాఁబట్టి ప్రతివేదాంతమును బ్రహ్మవిజ్ఞానమునకు భేద మాశంకింపందగదు. మఱియు బ్రహ్మవిజ్ఞానము చోదనవలనం బుట్టినది కాదు గనుక దీనికిఁ జోదనాద్యభేదమువలన నభేద మనియుం జెప్పరాదు. "తత్తు సమన్వయాత్త"ను సూత్రముకడ నాచార్యుఁడు విధిప్రధానములు కాక వస్తుమాత్రపర్యవసాయు లగు వాక్యములచే బ్రహ్మజ్ఞానము పుట్టుచున్న దని చెప్పెను. కాఁబట్టి యె ట్లీ భేదాభేదచింత నారంభించుచున్నాఁ డనిన నట నీవిజ్ఞాన (ఉపాసన) భేదాభేదచింత సగుణబ్రహ్మ విషయముం బ్రాణాది విషయముం గాన దోషము లేదని చెప్పంబడుచున్నది. ఇట (సోపాధికబ్రహ్మమునందు) గర్మమునకు వలె నుపాసనములకును భేదాభేదములు సంభవిల్లుచున్నవి. కర్మములువలె నుపా

నవములుం గొన్ని దృష్టఫలములు గొన్ని యదృష్టఫలములుం గొన్ని సమ్యగ్జ్ఞానముం బుట్టించు ద్వారమునఁ గ్రమముక్తి ఫలములును విధింపఁబడు చున్నవి. వానియందుఁ బ్రతి వేదాంతమును విజ్ఞానభేదము కలదా లేదా యను నీ విచారము సంభవించుచున్నది. (ప్రాణదహర శాండిల్య వైశ్వానరాదివిద్యలు పరస్పరము భిన్నములని "నానాశబ్దాదిభేదాత్"అను సూత్రమునం జెప్పంబడును. పరస్పరము భిన్నములగునవి ప్రతిశాఖమును భిన్నములా కావా యను నిది యిట విచారింపఁబడును.) అటఁ బూర్వపక్షహేతువు లుపన్యసింపఁబడుచున్నవి. (పూర్వతంత్రమున) నామభేదమునకుఁ గర్మభేద ప్రతిపత్తి హేతుత్వము జ్యోతిరాదులందుఁ బ్రసిద్ధము. ఈ తంత్రమునను వేఱువేఱు వేదాంతములందు విధింపఁబడిన విజ్ఞానములందుఁ దైత్తిరీయకము, వాజసనేయకము, కౌథుమకము, కౌషీతకము, శాట్యాయనకము ననునది మొదలుగా

---

౧. అథైష జ్యోతి రథైష సర్వజ్యోతిరేతేన సహస్రదక్షిణేన యజేత" యను వాక్యమున జ్యోతిశ్శబ్దముచేఁ బ్రకృతజ్యోతిష్టోమానువాదముచే సహస్రదక్షిణాఖ్య గుణవిధి నాశంకించి జ్యోతిశ్శబ్దమునకుఁ గర్మాంతరనామత్వము సంభవించుచుండఁగా జ్యోతిష్టోమలక్షకత్వము సంభవింపమివలనను, అథ యనుదానిచేఁ బ్రకరణవిచ్ఛేదము కలదను జ్యోతిష్టోమముకంటె భిన్నమైనట్టి గల వేఱొక కర్మము—జ్యోతిస్సు, సర్వజ్యోతిస్సు నను యాగములు విధింపఁబడుచున్న వని నామమునకుఁ గర్మభేదకత్వము పూర్వతంత్రమునఁ జెప్పంబడినది.

వేఱువేఱునామము కలదు. అట్లే "వైశ్వదేవ్యా మిక్షా వాజిభ్యో వాజిన" మ్మనునది మొదలగు-చోట్ల రూపభేదముం గర్మభేదమునకుం బ్రతిపాదకమై ప్రసిద్ధము. ఇట నైతము రూపభేదము కలదు. అది యెట్లనినఁ గొన్ని శాఖలవారు పంచాగ్నివిద్యయం దాఱవయగ్నిం బఠించుచున్నారు. వేఱొక శాఖవా రైదగ్నులనే పఠించుచున్నారు. అట్లే కొందఱు ప్రాణసంవాదాదులందు (శ్రేష్ఠ) న్యూనము లగు వాగాదులం బఠియించుచున్నారు. కొందఱు శ్రేష్ఠాధికము లగు వాగాదులం బఠించుచున్నారు. అట్లే శాకీర్యాదులందు ధర్మవిశేషము నైతము కర్మభేదమునకుఁ బ్రతిపాదకమని యాశంకింపఁబడినది. ఇట నైత మాథర్వణికులకు శిరోవ్రతమను ధర్మభేదము గలదు. ఇట్లు పునరుక్తి మొదలగు భేదహేతువులను యథాసంభవ

౧. "తప్తే పయసి దధ్యానయతి సా వైశ్వదేవ్యామిక్షా వాజిభ్యో వాజిన" మ్మను చోట వైశ్వదేవ్యామిక్షాయాగమున వాజిశబ్దముచే వైశ్వదేవానువాదమున వాజినగుణవిధి నాశంకించి యామిక్ష కుపసర్జనముగాఁ జెప్పంబడిన విశ్వేదేవతలకు వాజిశబ్దమున ననువాదము సంభవింపక పోవుటవలన నుత్పత్తిశిష్ట మగు నామిక్షావరుద్ధ మగు కర్మమున నాకాంక్షిత మగు వాజినద్రవ్యమునకు విధి సంభవింపక పోవుటవలనను వాజిదేవతాక మగు వాజినయాగము గర్మాంతర మని ద్రవ్యదేవతారూపభేదమువలన నిశ్చయింపఁబడినది. తప్తే పయసి = వేఁడిపాలలో, దధి = పెరుఁగును, ఆనయతి = చేర్చునేని, సా = ఘనీభవించినయది, వైశ్వదేవీ-ఆమిక్షా = విశ్వేదేవదేవతాక మగు నామిక్ష యనంబడును. అందలి ద్రవపదార్థము, వాజిభ్యః = వాజిదేవతలకొఱకు ఇచ్చునది, వాజినం = వాజిన మనంబడును.

ముగా నితరవేదాంతములందు యోజింపవలెను. కాఁబట్టి ప్రతివేదాంతమును విజ్ఞానభేదము కలదని ప్రాప్తింపఁగాను, సర్వవేదాంత ప్రత్యయమ్ = సర్వవేదాంత ప్రత్యయాని = ఎల్లవేదాంతములచే విధింపఁబడిన విజ్ఞానము లాయాయు వేదాంతములం దవియవిశేష యగుచున్నవి యని చెప్పు చున్నారము. ఏకాకారణమువలన నంటేని, చోదనాద్య విశే షాత్ = చోదనాదిభేదము లేకపోవుటవలనను, ఆదిపదముచే శాఖాంతరాధికరణసిద్ధాంతసూత్రమునం జెప్పంబడిన యభేద హేతువు లిటఁ జెప్పంబడుచున్నవి. సంయోగరూప చోద నాఖ్యాభేదము లేకపోవుటవలన నని యర్థము. (విధించు శబ్దము గాని విధింపఁబడిన ప్రయత్నము గాని చోదన యనంబడును.) ఎట్లొకటియె యగు నగ్నిహోత్రకర్మము నందు వేఱుశాఖలలోను "జుహుయాత్త"ని పురుషప్రయత్న మట్టిదియె విధింపఁబడుచున్నదో, యట్లే "యోహవై జ్యేష్ఠం

౧. బృ. ౮. ౧. ౧ యః = ఎవఁడు, (ప్రాణమును) జ్యేష్ఠంచ - శ్రేష్ఠంచ = (తక్కిన యింద్రియములకంటె) జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వ గుణము లతోఁ గూడినదానినిగాను, వేద = ఉపాసించుచున్నాఁడో, సః = అతఁడు, (ఆ యుపాసనాసామర్థ్యము వలనను) స్వానాం = తన బంధువులలోను, జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ-భవతి=జ్యేష్ఠుఁడు, శ్రేష్ఠుఁడు నగుచున్నాఁడు. వయో నిమిత్తమగు జ్యేష్ఠత్వ ముపాసకున కిచ్చుటవలన నెట్లు సంభవించుననిన శ్రోత్రాదు లగు నింద్రియములకుఁ బ్రాణకృతము లగు వశిత్వాదులవలన ప్రవృత్తిలాభము వలె బంధుజీవన మితనియధీన మగు నని జ్యేష్ఠత్వము చెప్పంబడెను. గ్రా:

చ శ్రేష్ఠంచ వేద" యని వాజసనేయులకును ఛందోగులకు నొకటియే యగు చోదన కాన్పించుచున్నది: "జ్యేష్ఠ శ్చ శ్రేష్ఠ శ్చ స్వానాం భవతి" యని ప్రయోజన సంయోగము నొక్కటియే, (ఫలసంబంధబోధకమగు వాక్యము ప్రయోజన సంయోగము.) జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వ గుణములతోఁ గూడిన ప్రాణతత్త్వ మనురూపము సైతము రెండు శాఖలందు నొక్కటియే. ఎట్లు యాగమునకు ద్రవ్యమును దేవతయు రూపమో యట్లే విజ్ఞానమునకు (ఉపాసనమునకు) విజ్ఞేయము (ఉపాస్యము) రూపము. దానిచే నది నిరూపింపఁబడుచున్నది గదా! (రెండు శాఖలందును) ప్రాణవిద్య యను సమాఖ్యయు (పేరు) నద్వయమే. కాఁబట్టి యెల్ల వేదాంతముల చేతను, విధింపఁ బడినవిజ్ఞాన మొక్కటియే. ఇట్లే పంచాగ్ని విద్య, వైశ్వానర విద్య, శాండిల్య విద్య మొదలగువాని యందు యోజింప వలెను. నామరూపానులగు నే భేద హేత్వాభాసములు దాహరింపఁ బడినవా యవి పూర్వకాండమున నే "ననామ్నా స్యా దచోదనాభిధాన

వయోనిమిత్త మగు జ్యేష్ఠత్వము కాదని యర్థము. ప్రాణము నిషేక కాలము మొదలుకొని గర్భముం బోషించును; చక్షురాదులకుఁ దరువాత వృత్తిలాభ మగును; కాఁబట్టి తక్కినవానికంటెఁ బ్రాణమునకు జ్యేష్ఠత్వమును, వక్ష్యమాణరీతిచే శ్రేష్ఠత్వమును సంభవించును.

౧. పూ. మీ. సూ. ౨. ౪. ౯. నామ్నా = కాఠకాది నామములచేతను, నస్యాత్ = అగ్నిహోత్రాది కర్మమునకు భేదము యుక్తము గాదు. (జని

శ్వాత్త్"ను సూత్రము మొదలుకొని నిరాకరింపఁ బడినవి.

అ. అపుడు 'శాఖాంతరన్యాయముచేతనే కర్మములకు వలె విద్యలకు నైక్యము సిద్ధించు చుండఁగా మరల భేద హేత్వాభాసముల నిట నేల నిరాకరింప వలెనన నొకానొక విశేషము నాశంకించుకొని సూత్రకర్త యిట వానిం బరిహరించు చున్నాఁడు. (మఱియు నిది వేఱుశాస్త్రమగుట వలనఁ గర్మ న్యాయము మానసవిద్యలందు సూత్రమును వినాగ దుర్బోధము గనుకఁ బునరుక్తి గంధమైనను లేదు.) (ఉపాసనోత్పత్తి విధియందున్న "పంచాగ్నీన్ వేద" యనునది మొదలగు పంచాగ్న్యాది రూప భేదము వలన విద్యాభేద మావశ్యక మను నిది విశేషము.)

సూ. భేదాన్నేతిచే న్నైకస్యా మపి. ౨

ప. భేదాత్-న-ఇతి-చేత్-న-ఏకస్యామ్-అపి.

అ. గుణభేదము వలన విద్యైక్య ముపపన్నము గాదని యనేక విద్యయందు నిట్టి భేద ముపపన్నము కాఁబట్టి యట్లన రాదు.

భా. అయ్యా! భేదాత్ = గుణభేదమువలన నెల్ల వేదాంతములచే విధింపఁబడిన విజ్ఞానముల కన్నిటికిని, న =

---

వలన నంటేని, అచోదనాభిధానత్వాత్ = కారకాది శబ్దములు గ్రంథనామములు గాని కర్మమును బోధించునవి గాకపోవుటవలనను, వేఱునామములు గలశాఖల గ్రంథములు వేఱైనను, వానిచే విహితమగు కర్మ మొక్కటియే.

ఐక్య ముపపన్నము గా దనుట యుక్తము. ఆ గుణభేద మెట్లు
నిన వాజసనేయులు పంచాగ్ని విద్యం బ్రస్తావించి "తస్యాగ్ని
రేవాగ్ని ర్భవతి" మొదలగు గ్రంథముచే నాఱవ యగ్నిం
బఠించుచున్నారు. ఛందోగులు దానింజెప్పరు. "అథ హాయ
ఏతానేవం పంచాగ్నీ౯ వేద" యని వారు పంచసంఖ్య
చేతనే యుపసంహరించుచున్నారు. ఎవరి కాగుణము కలదో
యెవరికి లేదో వా రుభయులయు విద్య యొకటియె యెట్లు
గును? పంచసంఖ్యా విరోధమువలన నిట గుణోపసంహా
రముం దెలియ శక్యముగాదు. అట్లే ఛందోగులు ప్రాణసం
వాదమున ముఖ్యప్రాణముకంటె నితరము లగు వాక్చక్షుశ్శోత్ర
మనములకు నాల్గు ప్రాణములం బఠించుచున్నారు. వాజస
నేయులు దానికి విలక్షణముగాను "రేతో[3] వై ప్రజాపతిః ప్రజా

---

౧. బృ. ౭. ౨. ౧౪. తస్య=మృతునియొక్క, (దహనార్థము) అగ్ని రేవ= ప్రసిద్ధాగ్నియే, అగ్నిః=భవతి=అగ్ని యగుచున్నది.

౨. ఛా. ౫. ౧౦. ౧౦. అథహ=మఱియును, యః=ఎవఁడు ఏతా౯ పంచాగ్నీ౯=ఈరొూషిదాదు లగు నైదగ్నులను, ఏవం=ఈప్రకారముగాను, వేద=ఉపాసించుచున్నాఁడో, (వాఁడు మహాపాతకము లు చేసినవాఁడయ్యు శుద్ధుఁడగును.)

3. బృ. ౭. ౧. ౬. రేతః-వై =ప్రజననేంద్రియమే, (ఈశబ్దము లక్షణచేఁ బ్రజననేంద్రియమును బోధించును.) ప్రజాపతిః=ప్రజాపతి, యః= ఎవఁడు, ఏవం=ఈప్రకారముగాను = ప్రాణమును బ్రజాపతిగాను, వేద= ఉపాసించు చున్నాఁడో, (వాఁడు) ప్రజయా = సంతానముతోడను, పశుభిః=పశువులతోడను, (సంపన్నుఁ డగుచున్నాఁడు.)

యతే ప్రజయా, పశుభిర్య ఏవం వేద" యని శ్రైవవ ప్రాణము గూడ వర్ణించుచున్నారు. ఆవాపోద్వాప భేదము వలన (వాజిశాఖవారు ప్రజనన గుణముగల రేతస్సును గ్రహించుటవలనను, ఛందోగులు దానిని విడుచుట వలనను) వేద్య భేదము సంభవించు చున్నది. వేద్య భేదమువలన, ద్రవ్య దేవతాభేదము వలన యాగమునకువలె విద్యకును భేదము గలుగును; ఇతిచేత్=ఇట్లంటేని, యెకాకారణము వలనను, ఏకస్యామపి=ఒక విద్యయందు నిట్టి గుణభేద ముపపన్నమో యాకారణము వలనను, న=ఇది దోషముకాదు. పరికింపంగా వాజివ యగ్ని కుపసంహారము సంభవింపదు; కాని ద్యుప్రభృతులగు నైదగ్నులు రెండుశాఖలందుఁ బ్రత్యభిజ్ఞాయమానము లగుటవలన విద్యాభేదము కాఁదగదు. షోడశి యను పాత్రమును గ్రహించుట వలనను గ్రహింపక పోవుట వలన నతిరాత్రక్రతువు భేదిల్లదుగదా! ఛందోగులును "తంప్రేతం దిష్ట మితోగ్నయ ఏవహరంతి" యని యాజివ యగ్నిం బఠించుచున్నారును. వాజసనేయులు సాంపాదికము లైన (కల్పితములైన) ద్యుదగ్నులందు ననువర్తించిన సమిద్ధూమాది

౧ ఛాం ౫. ౯. ౨. తం=ఇట్లు క్షీణాయువును, ప్రేతం=మరణించినవాఁడును, దిష్టం=కర్మముచేఁ బరలోకమునకుం బోవ నాజ్ఞప్తుఁడు నగు పురుషునిని, ఇతః=గ్రామమునుండి (ఋత్విజులుగాని పుత్త్రులుగాని) అగ్నయ ఏవ=అగ్నికొఱకే, (దహనముకొఱకే) హరంతి=తీసికొని పోవుచున్నారు.

కల్పనా నివృత్తికై "తస్యాగ్ని రేవాగ్ని ర్భవతి సమిత్సని" దిత్యాది వాక్యముం బఠించుచున్నారు. అది నిత్యానువాదము. అటువ యగ్నికిం గేవలానువాదమె కాని యుపాస్యత్వము లేదు గనుక రెండు శాఖలందు నైదగ్నులే యుపాస్యములు కాంబట్టి రూపభేదము సిద్ధింప దని యర్థము. వేఱొక పక్షమున నీమష్టాగ్ని వాద ముపాసనార్థమే యైన నాగుణము ఛందోగులచే నుపసంహరింప శక్యము. ఇటం బంచసంఖ్యా విరోధమూ శంకింపంబడందగినది కాదు. సాంపాదికాగ్ని శ్రీప్రాయయకు నీపంచసంఖ్య సిద్ధముగు దాని ననువదించునది కాని విధింపా సంబంధించునది కాదు కాంబట్టి దోషము లేదు. ఇట్లే ప్రాణసంవాదాదులందు నొకచో నధిక మగు గుణమునకు వేఱొకచో నుపసంహారము విరోధింపదు. వేద్యాంశమున కొన్ని దాని కామావాపోద్వాపము లున్న నధిక మగు వేద్యరాశిక భేదము కాన్పించుటవలన నావాపోద్వాపభేదమువలన వేద్య భేదమును విద్యాభేదమును నగు నని శంకింపరాదు. కాంబట్టి యెల్ల వేదాంతములం బ్రతిపాదింపంబడు ప్రాణాద్యుపాసన మొక్కటియే.

(అవ. ఇట్లు రూపభేదము విద్యా భేదమునకుం గారణము గాదని చెప్పి ధర్మ విశేషము నట్టిదే యని చెప్పుచున్నాండు.)

స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారేఽధికారా
చ్చ సవవచ్చ తన్నియమః. 3

ప. స్వాధ్యాయస్య-తథాత్వేన-హి-సమాచారే-అధి
కారాత్-చ-సవవత్-చ-తన్నియమః.

అ. ఏకారణమువలన వేద వ్రతముల నుపదేశించు గ్రంథమున శిరోవ్రతము స్వాధ్యాయధర్మ మని యాథర్వణికులు చెప్పుచున్నారో యాకారణము వలన నది ముండకవాక్యాధ్యయనమున కంగము గాని దానం జెప్పఁబడిన విద్యకంగము కాదు. సౌర్యాదులగు నిష్టులాధర్వణికులకే నియమింపఁబడిన ట్లధికారము (ప్రకరణము)వలన నది (శిరోవ్రతము) ముండకాధ్యయనము నందే నియమింపఁబడుచున్నది.

భా. ఆధర్వణికులు విద్యకొఱకు శిరోవ్రతాదుల నపేక్షించుట వలనను దక్షిణవారపేక్షింపమి వలనను విద్యలకు భేదము కలదని యెద్ది చెప్పంబడినదో యది పరిహరింపఁబడుచున్నది. ఈ శిరోవ్రత మను ధర్మము, స్వాధ్యాయస్య= వేదాధ్యయనమునకుఁ గాని, విద్యకుఁ గాదు. ఇది యెట్లు తెలియంబడుచుండెని, హి=ఏకారణము వలనను, సమాచారే= వేదవ్రతము నుపదేశించు గ్రంథమునం దాథర్వణికులు, తథాత్వేన=శిరోవ్రతము సైతము వేదాధ్యయనమున కంగ మని చెప్పంబడెనని చెప్పుచున్నారో యాకారణమువలనం దెలి

యంబడుచున్నది. అధికారాత్ - చ = "నైతదచీర్ణవ్రతో ధీతే" యని ప్రకృత విషయమ్మగు నేతచ్ఛబ్దము వలన నధ్యయన శబ్దము వలన నిది వారి యుపనిషదధ్యయన ధర్మమే యని నిర్ధారింపఁబడుచున్నది. అయ్యా! "తేషామేవైతాం బ్రహ్మవిద్యాంవదేత శిరోవ్రతం విధివద్యైస్తుచీర్ణ" మని (శిరోవ్రతమునకు) బ్రహ్మవిద్యా సంబంధము వినంబడుట వలన నెల్లశాఖలందు బ్రహ్మవిద్య నొకటియే యయ్యె నేని యీధర్మ మెల్లశాఖల సంబంధింప వలెను. సంబంధించుట లేదు కాఁబట్టి విద్యలకు భేదము కలదనిన నట్లనను "ఏతా" మనునది ప్రకృతముం బరామర్శించుట వలన నట్లనరాదు. బ్రహ్మవిద్యకుం బ్రకృతత్వము గ్రంథము నపేక్షించినదే కాఁబట్టి యీధర్మము గ్రంథవిశేషముతో సంబంధించినదే కాని విద్యతో సంబంధించినది కాదు. "సవవచ్చ తన్నియమ:" యనునది యుదాహరణ నిర్దేశము. తనిగ

౧. ముం. 3. ౨. ౧౧. అచీర్ణవ్రతః = శిరోవ్రతము నాచరింపని వాఁడు, ఏతత్ = గ్రంథరూపమగు నీవిద్యను, నాధీతే = పఠింపరాదని యర్థము.

౨. ముం. 3. ౨. ౧౦. (శ్రద్ధకలవారై యెవ్వరేక ఋషి నామము గల యగ్ని నుపాసింతురో యెవ్వరు శ్రోత్రియులును బ్రహ్మనిష్ఠులునో) యైస్తు = ఎవ్వరిచేతను, శిరోవ్రతం = శిరమునం దంగార పాత్రధారణమను వ్రతము, విధివత్ = శాస్త్రానుసారముగాను, చీర్ణం = చేయఁబడినదో, తేషామేవ = వారికే, ఏతాం = బ్రహ్మవిద్యాం = ఈ బ్రహ్మవిద్యను వదేత = ఉపదేశించునది.

యమః=శిరోవ్రతమునకు ముండకాధ్యయనమునందు నియమము కలదను చోటను సవవత్తనునది యుదాహరణ మని యర్థము. చకారము శిరోవ్రతమునకు వేఱుచోట్ల సంబంధము లేదని చెప్పును. ఎట్లు సౌరి మొదలుగాను శతౌదన మంతిముగాను గల నేడు సవములు (హోమములు) వేదాంతరములం జెప్పంబడిన త్రేతాగ్ని సంబంధము లేకపోవుట వలన నాథర్వణమునం జెప్పంబడిన యేకాగ్ని సంబంధమువలన నాథర్వణికులకే నియమింపఁబడుచున్నవో యట్లే యీశిరోవ్రతమను (శిరమున నంగారపాత్రమును ధరించుటయును) ధర్మమును స్వాధ్యాయ విశేషముతోడి సంబంధము వలన దాని యందే నియమింపఁబడుచున్నది. కాఁబట్టియు విద్యల కేకత్వ మనవద్యము.

అవ. మఱియు వేద్యైక్యోక్తియె యగుట వలన నిర్గుణ బ్రహ్మవిద్యల కైక్యమును శ్రుతి చూపుచున్నది. వాని సన్నిధిని బఠించుటవలన సగుణ విద్యలకు నైక్యము సిద్ధించునని సూత్రకారుఁడు చెప్పుచున్నాఁడు.

సూ. దర్శయతి చ. ౪

ప. దర్శయతి-చ.

అ. మఱియు వేదము విద్యల కేకత్వముం జూపుచున్నది.

భా. మఱియు వేదము "సర్వే వేదా యత్పద మామనంతి" యనియును "తం హ్యేతమేవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసంత ఏతమగ్నావధ్వర్యవ ఏతం మహావ్రతే ఛందోగా" యనియు నెల్ల వేదాంతములందు వేద్యమున కేకత్వము నుపదేశించుట వలనను, దర్శయతి చ=విద్యల కేకత్వమును జూపుచున్నది యును. అట్లే "మహద్భయం వజ్రము ద్యత" మని కాఠకమునం జెప్పంబడిన యీశ్వరగుణ మగు భయహేతుత్వమునకుం దైత్తిరీయకమున భేదజ్ఞానమును నిందించుటకై "యదా హ్యేవైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే అథతస్య

౧. కా. ౨.౧౫. సర్వేవేదాః=ఉపనిషద్వాక్యము లన్నియును, యత్ పదం=ఏస్థానిని బొందఁ దగినదిగాను, ఆమనంతి = చెప్పుచున్నవో (యది యోంకార ప్రతీకము నోంకారశబ్దవాచ్యము నగు బ్రహ్మమే.)

౨. బహ్వృచాః=ఋగ్వేదులు, తథా=అట్లే, ఏత మేవ=ఈపురుషునినే, మహతి-ఉక్థే=గొప్పదియగు నుక్థమను శస్త్రమునందు, మీమాంసంతే=ఉపాసించుచున్నారు. అధ్వర్యవః-ఏతం=ఈపురుషునినే యజుర్వేదులు, అగ్నౌ=అగ్నిష్టోమమునఁ బూజించుచున్నారు. ఛందోగాః=ఏతం= సామశాఖవారీ పురుషునినే మహావ్రతే = మహావ్రత మను క్రతువునందు ధ్యానించుచున్నారు.

3. కా. ౬. ౨. ఉద్యతం = ఎత్తంబడిన, వజ్రం = వజ్రమువలెను, భయం=భయహేతువును, మహత్ =వ్యాపకము నగు (బ్రహ్మము నెఱింగినవా రమృతు లగుదురు.)

౪. ఇది ప్రథమాధ్యాయమున మొదటిపాదమున నానందమయాధికరణమున వివృతము.

భయం భవతి తత్త్వేవభయం విదుషో మన్వానస్య" యని పరామర్శము చూడఁబడుచున్నది. అట్లే వాజసనేయకమునఁ బ్రాదేశమాత్ర సంపాదిత్వుఁడైన వైశ్వానరునకు ఛాందోగ్యమునను "యస్త్వేతమేవం ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానమువాస్తే" యని ప్రసిద్ధమైన దానికివలె గ్రహణము వైశ్వానర విద్యకైక్యముం జూపుచున్నది. (ఎట్లు సర్వశాఖలందు నిర్గుణము సగుణము నగు బ్రహ్మ మొక్కటియె యగుటవలన బ్రహ్మవిద్య భేదిల్లదో) యట్లే సర్వవేదాంతములందుఁ బ్రతీయమానము లగుటచే నొకచోఁ జెప్పంబడిన యుక్తాదులకు వేఱొకచో నుపాసన విధానార్థము స్వీకార మని తెలియం బడుచున్నది కాఁబట్టి వాని యుపాసనములకు నెల్ల వేదాంతములు ప్రమాణము లగుట వలన నేకత్వము శాఖాంతర్యమున సిద్ధించును. బ్రహ్మవిద్యైక్యము వలెనే యుక్తాది విద్యైక్యమును సిద్ధించు నని యర్థము.

ఇది ప్రథమాధికరణము.

---

## ఉపసంహారాధికరణము ౨.

(ఎల్ల శాఖలందుఁ బ్రాణాద్యుపాసన మొక్కటియె యను విచారమునకు ఫలముం జెప్పుచున్నాఁడు.)

---

౧ ప్రథమాధ్యాయము రెండవపాదమున వైశ్వానరాధికరణమున వ్యాఖ్యాతము.

సూ. ఉపసంహారోఽర్థాభేదా ద్విధిశేషవ త్సమానేచ. ౫

ప. ఉపసంహారః - అర్థాభేదాత్ - విధిశేషవత్ - సమానే-చ.

అ. అగ్నిహోత్రమంతట నొకటియై యగుట వలన దాని యంగముల కెల్ల-చోట్ల సంగ్రహ మగుచున్న ట్లన్ని శాఖల నుపాసన రూప మగు నర్థమొక్కటియె యగుట వలన సమానమగు విద్యయందొక శాఖయందుఁ జెప్పంబడిన గుణములకు వేఱొక శాఖయందు సంగ్రహ మగుచున్నది.

భా. ఇది ప్రయోజన సూత్రము. మీఁదఁ జెప్పంబడిన ప్రకారముగ నెల్ల వేదాంతముల విధింపఁబడిన విజ్ఞానమున కేకత్వము సిద్ధించినది యగుచు నుండఁగా నొక-చోఁ జెప్పంబడిన విజ్ఞాన గుణములకు వేఱొక-చో సైతము, సమానే=తుల్యమగు నుపాసనమునను, ఉపసంహారః=సంగ్రహించుట=కూర్చుట, భవతి=అగుచున్నది. తుల్యమగు నుపాసనమునం దొక శాఖయందుఁ జెప్పంబడిన గుణములను వేఱొక శాఖయందును సంగ్రహింపవలె నని యర్థము. (ఏక్కారణము వలన నట్లు సంగ్రహింపవలెనంటేని) అర్థాభేదాత్=ఆ గుణములకొక శాఖయందేవిశిష్ట విజ్ఞానోపకారమను నర్థము కలదో తక్కిన శాఖలందు నదియే యగుట వలనను. అన్ని శాఖలందు విజ్ఞాన మొకటియె కనుక గుణముల

కుపసంహారము కలదు. విధిశేష వత్తనునది ప్రధానమున నైక్యము గలప్పుడు దాని యంగముల కుపసంహారము కలదను నంశమున నుదాహరణము. విధిశేషవత్ = ఎట్లగ్నిహోత్రాది కర్మాంగముల కగ్నిహోత్రాది కర్మమన్నిచోట్ల నొకటియె యగుటవలన నుపసంహారము కలదో యట్లే యిటను నగును. విజ్ఞానము వేఱయ్యేనేని యాకారణమువలన గుణములు వేఱొక విజ్ఞానముతో సంబంధించినవి యగుట వలనను విద్యలకు (ఉపాసలములకు) బ్రకృతి వికార భావము లేకపోవుట వలనను గుణముల కుపసంహారము లేదు. విజ్ఞాన (ఉపాసన) మొకటియె యగుచుండఁగా నిట్లు కాదు. గుణోపసంహారము లేకపోదని యర్థము. ఈ ప్రయోజన సూత్రము యొక్క-యే విస్తరము "సర్వా భేదా దన్యత్రేమే" యను సూత్రము మొదలుగాఁ జెప్పంబడును.

ఇది రెండవ యధికరణము.

### అన్యథాత్వాధికరణము. 3

సూ. అన్యథాత్వం శబ్దాదితి చేన్నా విశేషాత్. ౬

ప. అన్యథాత్వం-శబ్దాత్-ఇతి-చేత్-న-అవిశేషాత్.

అ. ఛాందోగ్యమునందును వాజసనేయకమునందును జెప్పంబడిన ప్రాణవిద్యలలో నొకచోఁ బ్రాణమునకుఁ గర్తృ

వాచకశబ్దము నొకచో( గర్మవాచక శబ్దము నుండుటవలన రెంటికి నైక్యము లేదనిన స్వల్పముగు భేదమున్నను సమానమగు నంశ మధికముగా నుండుటవలన నైక్యము కలదు. (ఇది పూర్వపక్షము.)

భా. వాజసనేయకమునను "తేహ దేవా ఊచుర్హంతాసురాన్యజ్ఞ ఉద్గీథే నాత్యయామేతి, తే హ వాచ మూచుస్త్వన్న ఉద్గాయ" యని యుపక్రమించి వాగాదులగు ప్రాణముల (వాక్కు మొదలు గాఁగల ప్రాణముల యధిష్ఠాతృ దేవతల) నసురపాపముచే బాధింపఁబడినవి యని నిందించి వాని కధ్యేయత్వమును బ్రాణమున కుపాస్యత్వమును నిశ్చయించి "అథ హేమ మాసన్యం ప్రాణమూచుస్త్వన్న ఉద్గా

---

౧. బృ. 3. 3. ౧. తే = ప్రకృతము లగు వాగాదిప్రాణములు, (వాగాద్యధిష్ఠానదేవతలు), దేవాః = సాత్త్వికవృత్తి ప్రధానములై (సంక్షోభించి) హంత = మన కందఱకును సమ్మతమేని, యజ్ఞే = అగ్నిష్టోమమునను, అసురాన్ = రాజస తామస వృత్తి రూపములగు రాక్షసులను, ఉద్గీథేన = ఔద్గాత్ర కర్మము చేతను, అత్యయామేతి = అతిక్రమించి, శాస్త్ర ప్రకాశిత మగు దేవభావమును బొందుదమని ఊచుః = అన్యోన్యము పలికికొనిరి.

౨. బృ. 3. 3. ౨. (ఇట్లు సంభాషించి) తే = ఆ వాగాదులు, (మొదటను) త్వం = నీవు, ఉద్గాయేతి = ఔద్గాత్రమును నిర్వర్తింపుమని, వాచం = వాగింద్రియమును, ఊచుః = పలికెనఁట.

3. బృ. 3. 3. ౭. (ఆ దేవత లట్లుపాసించియు మృత్యువు నతిక్రమింపలేక) అథ = వాగాదులందు నైరాశ్యమును బొందిన తరువాతను, ఇమం — ఆసన్యం — ప్రాణం = ఈ ముఖబిలమునందలి ప్రాణమును, త్వం = నీవు, నః = మన

యేతి తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయత్త్" ని ముఖ్యప్రాణ పరిగ్రహము పఠింపఁబడుచున్నది. ఛాందోగ్యమునను "తద్ధ దేవా ఉద్గీథమాజహ్రురనే నైనా నభిభవిష్యామ"యని యజ్ఞ యుపక్రమించి తక్కిన ప్రాణముల నసురపాపమున బాధింపఁ బడినవి యని నిందించి "అథయ ఏవాయం ముఖ్యప్రాణస్త ముద్గీథ ముపాసాంచక్రిరే" యని ముఖ్యప్రాణ పరిగ్రహము పఠింపఁబడుచున్నది. రెండు శాఖలందును బ్రాణ ప్రశంసచేఁ బ్రాణోపాసనా విధి నిశ్చయింపఁబడుచున్నది. అందు=శాఖా ద్వయమునం జెప్పంబడిన విద్యలలో (భేదాభేదములు కాన్పించుటచే) నిటభేదము కలదా విద్యైక్యమా యను సంశయము కలుగు. సంశయముకల్గగా నేమి ప్రాప్తమయ్యె ననినఁ బూర్వా

---

కొఱకు, ఉద్గాయేతి=ఔద్గాత్రముం జేయుమని, ఊచుర్హ=చెప్పిరి. ఏష ప్రాణః=ఈముఖ్యప్రాణము, తథేతి=అట్లే చేయుదునని, తేభ్యః=శరణముం బొందిన వాగాదుల కొఱకు, ఉదగాయత్=ఔద్గాత్రముం జేసెను.

౧. ఛాం. ౧. ౨. ౧. తత్=తత్ర=(దేవతలకు నసురులకును=ఇంద్రియముల సాత్విక తామస వృత్తులకు) అన్యోన్యాభిభవ రూపమగు యుద్ధము ప్రాప్తింపఁగాను, దేవాః=సాత్వికవృత్తులు, అనేన=ఈ యౌద్గాత్ర కర్మము చేతను, ఏనాన్=ఈ రాజస తామస వృత్తు లను రాక్షసులను, అభిభవిష్యామ ఇతి=నిరాకరింపఁగలమని, ఉద్గీథం=ఉద్గీథకర్మమును, ఆజహ్రుః =సంపాదించెను. (యజ్ఞముసు జేసెనని యర్థము.)

౨. ఛాం. ౧. ౨. ౭. అథ = తరువాతను, యఏవాయం ముఖ్య ప్రాణః=ప్రసిద్ధమగు నేయీముఖమునందలి ప్రాణముగలదో, తం—ఉద్గీథం=ఉపాసాం చక్రిరే=అప్రాణము నుద్గీథముగాను (=ఉద్గీథావయవమగు నోంకారముగాను) పాసించిరి.

ధికరణ న్యాయము (ఉద్గీథవిద్య యను సంజ్ఞైక్యము) చే విద్యై
క్యమే ప్రాప్తించెను. అయ్యా! యుపక్రమభేదమువలన నీ విద్యల
నైక్యము యుక్తముకాదు. వాజసనేయులు వేఱొక లాగునను
ఛందోగు లింకొకలాగున నుపక్రమించుచున్నారు గదా! వాజ
సనేయులు "త్వన్న ఉద్గాయ" యని యుద్గీథమునకుం గర్తగాఁ
బ్రాణముం బఠించుచున్నారు. (వారికి సంపూర్ణమగు నుద్గీథ
మునకుం గర్తయగు ప్రాణ ముపాస్యము.) ఛందోగులు దీనికి
విరుద్ధముగాను "తముద్గీథ ముపాసాంచక్రిరే" యని యుద్గీథ
ముగానే ప్రాణముం బఠించుచున్నారు.(వారికి నుద్గీథావయవ
మగు నోంకారము ప్రాణదృష్టిచే నుపాస్యము.) కాఁబట్టి
విద్యల కేకత్వ మెట్లగును? శబ్దాత్=కర్తృవాచక కర్మవాచక
శబ్దముల వలనను, అన్యథాత్వం=రెండు విద్యలకును భేదమే
యగును. ఇతిచేత్=ఇంట్లులేని, న=ఇదియొక దోషము కాదు.
దేనివలన నంటేని, అవిశేషాత్=అధికమగు నంశము సమాన
మైనది వినంబడుట వలన నీకొలఁది భేదమువలన విద్యైకత్వము
తొలఁగిపోవదు కాఁబట్టి. అదియె ప్రతిపాదింపఁబడుచున్నది.
దేవాసుర సంగ్రామోపక్రమము, నసురజయార్థమైన స్తవా
దము, నుద్గీథోపన్యాసము, వాగాదుల సంకీర్తనము, వాని
నిందించిముఖ్యప్రాణము నాశ్రయించుటయునశ్మలోష్టాద్యుదా
హరణముచే దాని వీర్యమున నసురనాశనమునను నిట్టి యనే

కాంశములు రెండు శాఖలయందును సమానముగా నున్నవి. వాజసనేయకమునందును "ఏష ఉవా ఉద్గీథ"యని ప్రాణమున కుద్గీథ సామానాధికరణ్యము వినంబడుచున్నది. కనుక ఛాందోగ్యమునందును గర్తృత్వమును లక్షణావృత్తిచే గ్రహింపందగును. కాఁబట్టి విద్యల కైకత్వమే యుక్తము. (ఇది పూర్వపక్షము.)

సూ. నవా ప్రకరణ భేదా త్పరోవరీయస్త్వాదివత్. ౭

ప. న-వా-ప్రకరణభేదాత్-పరోవరీయస్త్వాదివత్.

అ. రెండు నుద్గీథోపాసనములే యైనను బరోవరీయస్త్వాది గుణములు గల యుద్గీథోపాసన మక్ష్యాదిత్యగత హిరణ్య శ్మశ్రుత్వాది గుణములు గల యుద్గీథోపాసనము కంటె భిన్నమైనట్లే ఛాందోగ్యమందు బృహదారణ్యకమునందునున్న యుద్గీథోపాస్తులకు నుపక్రమభేదమువలన భేదమే కాని యైక్యము లేదు.

భా. నవా=ఛాందోగ్య బృహదారణ్యకములలోని యుద్గీథోపాసనముల కైకత్వము న్యాయ్యము కాదు. ఇట విద్యాభేదమే న్యాయ్యము. దేనివలన నంటేని, ప్రకరణభేదాత్=ఉపక్రమ భేదము వలనను, ఉపక్రమము వేఱుగా నుం

౧. బృ. 3. 3. ౨3. (ఏ కారణమువలనఁ బ్రాణముచే జగమంతయు ధరింపఁబడినదో యా కారణము వలనను) ఉద్గీథః = ఉద్గీథము, ఏష-ఉ-వై = ఈ ప్రాణమే.

మటవలన నని యర్థము. రెండు శాఖలందు నుపక్రమ భేద మెట్లునిన వివరింపఁబడుచున్నది. ఛాందోగ్యమునను "ఓమి త్యేతదక్షర ముద్గీథ ముపాసీత" యని యుద్గీథావయవ మగు నోంకారమున కుపాస్యత్వము ప్రస్తావించి దానియందు రసతమ త్వాదిగుణముల వర్ణించి, తరువాతను "ఖల్వేతస్యైవాక్షర స్యోపవ్యాఖ్యా నం భవతి" యని మరల నాయుద్గీథావయవమగు నోంకారమునే యనువర్తించి దేవాసురాఖ్యాయికా ద్వారమునను "య ఏవాయం ముఖ్యప్రాణస్త ముద్గీథ ముపాసాంచక్రిరే" యని యుద్గీథోపాస్తిం జెప్పుచున్నది. అట నుద్గీథశబ్దముచే భక్తినంతను గ్రహించి దానికిం గర్తయగు నుద్గాతను=ఋత్విక్కును బ్రాణముగా నుపాసింప వలసినదని చెప్పంబడెనేని యోంకారోపాస్త్యుపక్రమమునకు భంగమును (గీథశబ్దమునకు దానికర్తయందు) లక్షణయుఁ బ్రసక్తించును. ఏకవాక్యమునం దుపసంహార ము (సందేహము లేనియప్పుడు) పక్రమాధీనమై యుండవలెను. కాఁబట్టి ఛాందోగ్యమునం దుద్గీథావయవమగు నోంకారమందుఁ బ్రాణదృష్టి

---

౧. ఛాం. ౧. ౧. ౧. ఉద్గీథమను సామభక్తికవయవమగు, ఓమ్= ఇతి=ఏతదక్షరం=ఓమను నీయక్షరమును, ఉపాసీత=ఉపాసించునది.

౨. ఛాం. ౧. ౧. ౧౦. యత్=ఖలు=మున్నద్ది విధింపఁబడినదియో యదియంతయును, ఏతస్యైవాక్షరస్య=ప్రకృతమగు నోంకారముయొక్కయే ఉపవ్యాఖ్యానం=భవతి = అనేక విశేషణములచే ననేక ప్రకారముల నుపాస్యమగుటవలన వివరణమగుచున్నది.

యుపదేశింపఁబడుచున్నది. వాజసనేయకమున నుద్గీథ శబ్దముచే దాని యవయవమును (ఓంకారమును) గ్రహింపఁదగిన కారణము లేకపోవుటవలన భక్తియంతయు గ్రహింపఁబడుచున్నది. "త్వాన్న ఉద్గాయ" యనియు నాభక్తికి గర్తయగు నుద్గాత యను ఋత్విజుఁడు ప్రాణముగా నిరూపింపఁబడుచున్నాఁడు కాఁబట్టి బృహదారణ్యమునఁ జెప్పఁబడిన యుపాస్తిమార్గము భిన్నము. వాజసనేయక శాఖయందుఁ బ్రాణమున కుద్గీథసామానాధికరణ్య మొద్దికలదో యదియు నుద్గాతృత్వముచేతనే చూపింపఁగోరఁబడుచున్న ప్రాణమునకు సర్వాత్మత్వముం బ్రతిపాదింపఁ జెప్పంబడుచున్నది గాన విద్యైక్యమును సంపాదింపం జాలదు. సామానాధికరణ్యము (అభేదము) ను జెప్పువాక్యముననైన నుద్గీథశబ్దము సకలభక్తి విషయమే (భక్తినంతను దెలుపునదియే) కాఁబట్టి (రెండువిద్యలకును) వైషమ్యము కలదు. ఉద్గీథభావమువలె నుద్గాతృభావము నుపాసనార్థమై యుపదేశింపఁబడుచున్నది కాఁబట్టి ప్రాణమునకు (జడమగుటవలన) నుద్గాతృభావము సంభవింప దను కారణముచే విడువంబడదు. మఱియు నుద్గాత ప్రాణబలముచేతనే యౌద్గాత్రముం జేయుచున్నాఁడు కాఁబట్టి యసంభవమును లేదు. అట్లుద్గీథప్రకరణముననే "వాచాచహ్యేవ

౧. బృ. ౩. ౩. ౨౪. (సఃఉద్గాత యగు నాంగిరసుఁడు, వాచా

వ్ప్రాణేనచోదగాయత్త్"ని వినిపింపఁబడెను గదా! మఱియు వివక్షితార్థభేదము తెలియంబడుచుండఁగాఁ గేవల వాక్యసామ్యముచే సమానార్థత్వమును నిశ్చయింప యుక్తము కాదు. వాజిశాఖలో నుద్గాత యగు ప్రాణ ముపాస్యము, ఛాందోగ్యములో నోంకార ముపాస్యమునను. ముఖ్యమైన యుపాస్య స్వరూపభేదము స్పష్ట మగుచుండఁగా నప్రధానమైన యర్థవాదసామ్యమాత్రమున నుపాసనైక్యము యుక్తము కాదని యర్థము. వాక్యసామ్యమాత్రమున నర్థైక్యము లేదనుదానికి దృష్టాంతము చెప్పఁబడుచున్నది. అభ్యుదయ వాక్యమునను బశుకామ వాక్యమునను "త్రేధా తండులా

---

చ-ప్రాణేన = ప్రాణప్రధాన మగు వాగింద్రియము చేతను, ఉదగాయత్ = ఔద్గాత్రమును నిర్వహించెను.

౧. "వి వా ఏతం ప్రజయా పశుభి రర్ధయతి, వర్ధయత్యస్య భ్రాతృవ్య" మనునది మొదలుగాఁ గలది యభ్యుదయ వాక్యము=ఏ యజమానుఁడు చతుర్దశినాఁ డమావాస్య యని భ్రాంతినొంది దర్శకర్మార్థము మొదటఁ దండుల దధిపయోరూప మగు హవిస్సును దర్శదేవతల కొఱకుఁ సంకల్పింపఁగాఁ జంద్రోదయ మగునో యా యజమాను నా హవిస్సు కాలవ్యత్యయాపరాధము వలనఁ బ్రజాపశ్వాద్యైశ్వర్యమునుండి తొలఁగించి యతనిశత్రుల వర్ధిల్లఁ జేయును. కనుక నప్పు డా యజమానుఁడు) త్రేధా = పెద్దవి చిన్నవి సాధారణముగ నున్నవి యను మూడు విధము లైన, తండులాన్ = దధ్యాదులతోఁ గూడిన తండులములను, విభజేత్ = దర్శదేవతలనుండి యాకర్షింపవలెను. (అట్లాకర్షించి దర్శదేవతలకంటె భిన్నులగు నగ్న్యాది దేవతలకు సమర్పింప వలెను.) యేమధ్యమాః-స్యుః = ఏ తండులములు నడిమి పరిమాణము గలవియో, తాన్ = వానిని, దాత్రే = దాతృత్వగుణము గల, అగ్నయే = అగ్ని

న్నిభజేద్యో మధ్యమాస్యుస్తా నగ్నయే దాత్రే పురోడాశ మష్టాకపాలం కుర్యా" దిత్యాది నిర్దేశము సమానముగా నున్న నుపక్రమము వేఱుగా నుండుటవలన నభ్యుదయ వాక్యమున దేవతాపనయము (ప్రకృత దేవతలనుండి హవిస్సును విడఁదీసి దర్శకర్మముననే వేఱుదేవతల కిచ్చుట) నిశ్చయింపఁబడినది. పసుకామ వాక్యమున యాగవిధి నిశ్చయింపఁబడినది. అక్లే యిటను నుపక్రమభేదమువలన విద్యాభేదము.

(సూత్రమునఁ జెప్పంబడిన నిదర్శనమును వివరించుచున్నాఁడు) పరోవరీయస్త్వాదివత్ = ఎట్లాకాశమందు నాది

---

కో అతుక్, అష్టాకపాలం = ఎనిమిది కపాలములందు సంస్కరింపఁ బడిన, పురోడాశం = పురోడాశమును, కుర్యాత్ = చేయవలెను. (ఎవ్వి మిక్కిలి పెద్దవియో వాని చరువును దధియందును, మిక్కిలి సన్నము లగు తండులముల చరువును క్షీరమునందు నునిచి క్రమముగా దాతృత్వగుణము గల యింద్రునకును విష్ణునికో అతును సమర్పింపవలెను. ఇట నిది దర్శకర్మమునకం టె భిన్న మగు ప్రాయశ్చిత్త రూపమైన కర్మమని ప్రాప్తింపఁగాఁ బూర్వతంత్రమున దర్శకర్మమునందే హవిస్సును దర్శదేవతలనుండి యపనయించి వేఱు దేవతలకు సమర్పించుటను విధించుచున్నది గాని వేఱు కర్మము గాదని నిశ్చయింపఁబడినది. "యః పశుకామస్స్యాత్ సోऽమావాస్యాయా మిష్ట్వా వత్సానపాకుర్యా" త్తనునది పశుకామవాక్యము. = ఎవఁడు మిక్కిలి పశువులం గోరునో వాఁడు నిత్య మగు దర్శకర్మమును సమాప్తి చేసి మరల దోహార్థమై దూడల నావు లున్నచోటినుండి వేఱొకచోఁ గట్టవలయును. ఇట వత్సాపాకరణ విధ్యుపక్రమమువలన యాగాంతరవిధి నిశ్చయింపఁ బడుచున్నది.

త్యాద్యములందుఁ బరమాత్మదృష్టి నారోపించుటవలన నుద్గీథో పాస్తి సామ్య మున్నను. “ఆకాశో హ్యేవైభ్యో జ్యాయా నాకాశః పరాయణం, సఏష. పరోవరీయా నుద్గీథ స్సఏషో నంత” యని విధింపఁబడిన పరోవరీయస్త్వాది గుణవిశిష్ట మగు నుద్గీథోపాసన మక్ష్యాదిత్య గతమైన హిరణ్య శ్మశ్రుత్వాది గుణములు గల యుద్గీథోపాసనముకంటె భిన్నమో మఱియు నా యుపాసనములు రెండు నొక్క శాఖలోనివే యైనను బరస్పర గుణోపసంహారము లేదో యట్లే వేర్వేఱు శాఖలం దున్న యిట్టి యుపాసనములందు నగును. కాఁబట్టి యీ రెండు శాఖలందలి విద్యలకును భేదమే కాని యైక్యము లేదు.

సూ. సంజ్ఞాతశ్చే త్తదుక్త మస్తితు తదపి. ౮

ప. సంజ్ఞాతః-చేత్-తత్-ఉక్తం-అస్తి-తు-తత్-అపి.

అ. రెండు శాఖలందు నుద్గీథవిద్య యను పే రొక్కటియె యగుటవలన రెండు విద్యల కేకత్వము న్యాయ్య మనినఁ బూర్వ సూత్రమున సంజ్ఞైక్య మున్నను విద్యైక్యము

౧. ఛాం. ౧. ౯. ౧. అ ౧. పా ౧. న నాకాశాధికరణమున వ్యాఖ్యాతము.

౨. ఛాం. ౧. ౯. ౨. స ఏషః-ఉద్గీథః = ఆ యీ యుద్గీథావయవ మగు నోంకారము, పరమాత్మదృష్టి కాలంబన మగుటవలనను, పరోవరీయాన్ = శ్రేష్ఠమైనదానికంటెను శ్రేష్ఠతరము. (పరమాత్మ దృష్ట్యాలంబన మగుటవలననే) స ఏషః = ఆ యీ యుద్గీథము, అనంతశ్చ = అంతము లేనిదియును.

లేదని చెప్పంబడె. ప్రసిద్ధ భేవము గల విద్యలందును సంజ్ఞైక్యము గలదు కాఁబట్టి యది విద్యైక్యమును సాధింపఁజాలదు గదా.

భా. సంజ్ఞాతః - చేత్ = రెండు శాఖలందు నుద్గీథ విద్య యను పేరొక్కటియె యగుటవలన రెండు శాఖల నున్న విద్యల కైక్యము న్యాయ్య మంటేని, తత్ -(న)=అది న్యాయ్యము గాదని, ఉక్తం = "నవాప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్"ను పూర్వ సూత్రమునఁ జెప్పంబడెఁ గదా! విద్యాభేదము శ్రుత్యక్షరముల ననుసరించినది గావున బలవత్తరమును = శ్రుత్యక్షర బాహ్యమైన సంజ్ఞైక్య ముద్గీథ శబ్ద మాత్ర ప్రయోగమువలన లౌకికులచే వ్యవహరింపఁబడుచున్నది కాఁబట్టి దుర్బలము. తదపి=ఉద్గీథవిద్య యను సంజ్ఞైకత్వమును బ్రసిద్ధభేదము గల పరోవరీయస్త్వాద్యుపాసనములందును, అస్తి = కలదు. (అపి శబ్దముచే గ్రహింపఁబడిన వేఱొక యుదాహరణముం జూపుచున్నాఁడు.) అట్లే ప్రసిద్ధ భేదము గల యగ్నిహోత్ర దర్శ పూర్ణమాసాది కర్మములకుఁ గాఠక గ్రంథ మొకటనే పఠింపఁబడినవానికిఁ గాఠకసంజ్ఞ యొక్కటియే చూడంబడుచున్నది. అట్లే యిటనుం గావచ్చును. (తు శబ్దముచే సూచింపఁబడిన యర్థముం జెప్పుచున్నాఁడు.) ఎక్కడ నిట్టి విద్యాభేదకారణ మగు ప్రక్రమభేదము గాని

దానికిఁ దుల్యమగు మఱియొకటి గాని లేదో యట=సంవర్గ విద్యా పంచాగ్ని విద్యాదుల్లందు వే రొక్కటియె యగుట వలన విద్యైక్యము గావచ్చును.

ఇది తృతీయాధికరణము.

వ్యాప్త్యధికరణము. ౪

సూ. వ్యాప్తేశ్చసమంజసం. ౯

ప. వ్యాప్తేః-చ-సమంజసం.

అ. "ఓమిత్యే తదక్షరముద్గీథ ముపాసీత" యను-నో సామానాధికరణ్యమున ననేక పక్షములు భాసిల్లుచున్న నోంకార మెల్ల వేదముల వ్యాపించినది యగుటవలనఁ దక్కిన వాని నిరసించి యుద్గీథావయవమగు నోంకార ముపాస్యమని తెలుప నుద్గీథ శబ్ద మోంకారమునకు విశేషణమను పక్షమే నిరవద్యము. తక్కినవి దుష్టములు.

భా. "ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత" యను వాక్యమున నోంకార మను నక్షరమునకు నుద్గీథశబ్దమునకు సామానాధికరణ్యము వినంబడుచున్నది యగుచు నుండఁగా నధ్యాసము, నపవాదము, నేకత్వము, విశేషణము నను నాల్గు పక్షములు భాసిల్లుటవలన నేపక్షము న్యాయ్యమగు

నను విచారము చేయఁబడుచున్నది. వానిలో నధ్యాసము నా రెండు వస్తువులం దొక్కదానికంటె నొకటి వేఱను బుద్ధి నివర్తింపకున్న నొకదానియందు వేఱొక వస్తుబుద్ధి నారోపించుట; బుద్ధిపూర్వకమైనయభేదారోప మధ్యాసమని యర్థము. దేనియం దితర బుద్ధి యధ్యసింప (కల్పింప)ఁ బడుచున్నదో దానియం దధ్యస్తమైన యితరబుద్ధియున్న నావస్తుబుద్ధి యనువర్తించుచునేయుండును. ఎట్లనిన నామమునందు బ్రహ్మబుద్ధి యధ్యసింపఁబడిన నామబుద్ధి యనువర్తించుచునే యుండును గాని బ్రహ్మబుద్ధిచే నది నివారింపఁబడదు. మఱియుఁ బ్రతిమాదులందు విష్ణుబుద్ధి యారోపింపఁబడినఁ బ్రతిమాది బుద్ధి నివర్తిల్లదు. అట్లే యిట నోంకారమునం దుద్గీథబుద్ధిగాని యుద్గీథమునం దోంకారబుద్ధిగాని యధ్యసింపఁబడుచున్నదా? యనునదొక పక్షము. అపవాదమునా, నెద్దియే నొకవస్తువునందు మొదటఁ గలిగిన మిథ్యాబుద్ధి నిశ్చయింపఁబడినదియగుచు నుండఁగాఁ దరువాతఁగలిగిన యథార్థబుద్ధి మునుపుగలిగిన మిథ్యాబుద్ధి నివారించునది యగుచున్నది; ఎట్లనిన దేహేంద్రియసముదాయమందుఁ గలిగిన యాత్మబుద్ధి తరువాత నాత్మయందుఁ గలిగిన "తత్త్వమసీ"త్యాది యథార్థబుద్ధిచే బాధింపఁబడుచున్నది; మఱియు దిగ్భ్రాంతిబుద్ధి దిగ్యాథార్థ్యబుద్ధిచే వారింపఁబడుచున్నది; ఇట్లిక్కడ నోంకారబుద్ధిచే నుద్గీథబుద్ధి

గాని, యుద్గీథబుద్ధిచే నోంకారబుద్ధిగాని బాధింపఁ బడుచున్నదా యనునది (రెండవ, పక్షము.) ఏకత్వము నానభేదము. ఎట్లనిన బ్రాహ్మణుఁడు, ద్విజోత్తముఁడు, భూదేవుఁడు నన్నట్లు. (అట్లేయిటను) నక్షరోద్గీథముల కభేదమా యనునదొక పక్షము. విశేషణమునా విశేష్యమును సమానజాతివస్తువులనుండి భేదిల్లంజేయునది. ఎట్లనిన నెర్రి నల్లని యుత్పలమో దాని గ్రహింపవలసినదన్నట్లు. ఇట్లిట నెల్ల వేదముల వ్యాపించిన యోంకారమునకు (ధ్యేయత్వమున) గ్రహణము ప్రసక్తింపఁగా నుద్గీథావయవమగు నే యోంకారముకలదో దాని నుపాసించునది యని యుద్గాత్రు విషయమైన యోంకారమును సమర్పించుటా ? యనునది నాల్గవపక్షము. ఇట్లే సామానాధికరణ్య వాక్యము విమర్శింపఁబడినది యగుచు నుండఁగా నీపక్షములు కాన్పించుచున్నవి. వీనిలో నొక పక్షమును నిర్ధారింపం దగిన కారణము లేకపోవుటవలన నేపక్షమైనం గావచ్చు నను ననియమమును ప్రాప్తింపఁగా నీ సూత్రము చెప్పంబడుచున్నది. తు శబ్దమునకు బదులుగా (సూత్రమున) నున్న చశబ్దము పరపక్షవ్యావృత్త్యర్థము. కాఁబట్టి సామానాధికరణ్య వాక్యమున భాసిల్లుచున్న నాల్గుపక్షములలో మూఁడు పక్షములు దుష్టము లని నిషేధింపఁబడుచున్నవి. విశేషణపక్షమొకటియే నిరవద్యమని గ్రహింపఁబడుచున్నది. ఆ నాల్గిం

టిలో నధ్యాస పక్షమునందు దేనిబుద్ధి వేఱొకట నారోపింపఁ బడుచున్నదో యా శబ్దమునకు దాన లక్షణావృత్తిత్వము ప్రసక్తించును; ఫలమును గల్పింపవలసియుండును. "ఆపయితా హా వై కామానాం భవతి" యనునది మొదలగు ఫలమువినంబడు చునే యున్నది యనిన నది వేఱొకదాని ఫలము గాన నట్లన రాదు. అది యోఙ్కారాదిదృష్టి ఫలముగాని యధ్యాసఫలము గాదుగదా! అపవాద పక్షమునను ఫలాభావము సమానమే. మిథ్యాజ్ఞాననివృత్తి ఫలమనిన దానివలనఁబురుషార్థమున కుప యోగము కాన్పింపదు కాఁబట్టి యట్లనరాదు. మఱియు (నిట భ్రాంతిలేదు కనుక) నోంకారమువలన నోంకారబుద్ధిగాని యు ద్గీథమునుండి యుద్గీథబుద్ధిగాని యెుకా నొకపుడును నివర్తిల్లదు. మఱియు నీవాక్య ముపాసనమును విధించునది యగుట వలన వస్తుయాథార్థ్యముం బ్రతిపాదించునది కాదు. ఏకత్వ పక్ష మును సంగతముకాదు. అపుడొక శబ్దము నుచ్చరించుట చేతనే వివక్షితార్థము సంభవించుటవలన శబ్దద్వయోచ్చార ణము వ్యర్థమగునుగదా! మఱియు నెట్టి ప్రసిద్ధి యుండు టచే నివి రెండుం బర్యాయములగునో యట్టి ప్రసిద్ధి విష

౧. ఛాం. ౧. ౧. ౭. (ఎవఁడాప్తి గుణముగల యుద్గీథము నుపా సించునో) సః=ఆయుపాసకుఁడు, కామానాం=యజమానుని కోర్కెలను, ఆపయితా హా వై=సంపాదించువాఁడే, భవతి=అగును. హా వై యనునిపాత ములు నిశ్చయార్థకములు.

యము నాధ్వర్యవ విషయమునైన (ఋగ్వేదమునను యజు ర్వేదమున నున్న) యోంకారాక్షరశబ్ద వాచ్యమగు నక్షరము (ప్రణవము)నం దుద్గీథశబ్ద ప్రసిద్ధిగాని యుద్గీథశబ్ద వాచ్య మగు సామద్వితీయ భక్తియం దంతట నోంకారశబ్ద ప్రసిద్ధి గాని లేదు. (కాఁబట్టి యీరెండును ఘటకుంభశబ్దములు వలెఁ బర్యాయములు కావు.) పరిశేషమువలన విశేషణపక్షము పరిగ్రహింపఁబడు చున్నది. వ్యాప్తేః = ఓంకారము సర్వవేద సాధారణమైన దగుటవలనను, "ఓమిత్యేతదక్షరముద్గీథముపా సీత" యనుచోట నెల్లవేదములనున్న యోంకారముపాసనము నందుఁ బ్రసక్తింపక పోవలెనని యుద్గీథశబ్దముచే నోంకా రము విశేషణ యుక్తముగాఁ జేయంబడు చున్నది యనునిది, సమంజసం=నిరవద్యమైన పక్షము. అయ్యా! యీపక్షము నందు నుద్గీథశబ్దమున కవయవమున లక్షణ ప్రసక్తించుట వలన నెట్లుద్గీథావయవమగు నోంకారము పరిగ్రహింపఁ బడ వచ్చుననిన నది సత్యమే. కాని లక్షణయందును సన్నికర్ష విప్రకర్షములు సంభవించుచునే యుండును. అధ్యాస పక్ష మున వేఱొక వస్తుబుద్ధి మఱియొక వస్తువునం దారోపింపఁ బడుచున్నది కాఁబట్టి లక్షణ విప్రకృష్ట. విశేషణ పక్షమున నవయవిం జెప్పు శబ్ద మవయవముం జెప్పుచున్నది కాఁబట్టి లక్షణ సన్నికృష్ట. (పటము దగ్ధమైనది గ్రామము దగ్ధమైనది

మొదలగుచోట్ల) సముదాయమునఁ బ్రవర్తిల్లు పటగ్రామాది శబ్దము లవయవములందుఁ బ్రవర్తిల్లుచున్నవి యై కానంబడుచున్నవి. కనుక నోంకారము సర్వవేదములయం దున్నది యగుటవలన దాని కుద్గీథశబ్దము విశేషణ మను పక్షము సమంజసము. ఈపక్షము నిరవద్య మని యర్థము.

ఇది చతుర్థాధికరణము.

## సర్వాభేదాధికరణము. ౫

సూ. సర్వాభేదా దన్య త్రేమే. ౧౦

ప. సర్వాభేదాత్ - అన్యత్ర - ఇమే.

అ. ప్రాణోపాసన మెల్ల శాఖలయందు నొకటియె యగుటవలన వాజసనేయ శాఖయందు ఛందోగశాఖయందుఁ జెప్పఁబడిన వసిష్ఠత్వాది గుణములను గౌషీతకి మొదలగువారి శాఖలందును సంగ్రహింపవలెను.

భా. వాజసనేయులయు ఛందోగులయుఁ బ్రాణసంవాదమున శ్రైష్ఠ్యగుణముతోఁ గూడిన ప్రాణమున కుపాస్యత్వము చెప్పంబడినది. అట వాగాది ప్రాణములును వసిష్ఠత్వాది గుణములు గలవిగాఁ జెప్పంబడియె. "యో దహాం

౧. బృ. ౬. ౧. ౧౪. (ఇంద్రియములు తమ శ్రైష్ఠ్యము కొఱకు వివదించి ప్రాణమందు శ్రైష్ఠ్యమును నిశ్చయించిన తరువాత వాగింద్రియము)

వసిష్ఠోస్మి త్వం త ద్వసిష్ఠోసి" మొదలగు గ్రంథముచే వాసిష్ఠత్వాది గుణములు ప్రాణమునందర్శింపఁబడినవి. "అథాతో నిశ్శ్రేయసాదాన మేతాహవై దేవతా అహం శ్రేయసే వివదమానా" యనునది మొదలగు కౌషీతకి మొదలైన వారి ప్రాణసంవాదమునందుఁ బ్రాణమునకు శ్రైష్ఠ్యము చెప్పఁబడినది కాని యీవసిష్ఠత్వాది గుణములు చెప్పఁబడవు. వాజసనేయి ఛందోగశాఖలలోఁ జెప్పఁబడిన యీవసిష్ఠత్వాది గుణములు కౌషీతకి మొదలగు వారి శాఖలలో సంగ్రహింపఁబడుచున్నవా? సంగ్రహింపఁబడవా? యని వాని విషయము సంశయము కలదు. సంశయము కల్గఁగా సంగ్రహింపఁబడవని ప్రాప్తించెను. దేనివలన నంటేని "ఏవం" శబ్దసంబంధము వలనను. "అథోయఏవంవిద్వాన్ ప్రాణేనిశ్శ్రేయసంవిదిత్వా"

---

అహం=నేను, వసిష్ఠోస్మి=వసిష్ఠత్వగుణము కలదానను. యద్వై = నా కే వసిష్ఠత్వగుణము కలదో, తత్ -ఆ వసిష్ఠత్వ గుణముచేతను, త్వం = నీవు, వసిష్ఠః - అసి = వసిష్ఠత్వగుణము కలదానవగుచున్నా (వని ప్రాణముతోఁ జెప్పెను.) మధురముగా మాట్లాడు నేర్పు గలవానికి సుఖవాసము సంభవించును గాన వాక్కునకు వసిష్ఠత్వగుణము కలదు.

౧. కౌ. ౨. ౯. అథ=పిమ్మటను, అతః=శ్రైష్ఠ్యనిర్ధారణమునువిహాగ నుపాసనము సంభవింపదు కాఁబట్టి, నిశ్శ్రేయసాదానం = శ్రైష్ఠ్యనిర్ధారణము, (ప్రస్తావింపఁబడుచున్నది.) ఏతాః-హవై-దేవతాః = ఈ యింద్రియాభిమాని దేవతలు, అహంశ్రేయసే = తన తన శ్రైష్ఠ్యముకొఱకు, వివదమానాః=కలహించుచున్నవారై, (దేహమునుండి వెడలిపోయిరి.)

౧. (ఎట్లు ప్రాణము వాగాదులకంటె శ్రేష్ఠమో) అథో = ఆ ప్రకారముగాను, ఏవం=ప్రాణము శ్రేష్ఠగుణాన్వితమని, విద్వాన్ = తెలిసి

యని యట నటను " ఏవం " శబ్దముచే వేద్యమైన వస్తువు (ఉపాసింపం దగిన పదార్థము) తెలుపంబడుచున్నది గదా ! ఏవం శబ్దము సన్నిహితము లగు గుణములం జెప్పునది కాని వేఱు శాఖం బఠింపఁబడిన వసిష్ఠత్వాది గుణసముదాయముం దెలుపనేఁజాలదు. ఆకారణము వలన (విద్యకు)ఁ దన ప్రకరణముననున్న గుణములచేతనే నిరాకాంక్షత్వము(శాఖాంతరములం దున్న గుణముల యాకాంక్ష లేమి) ప్రాప్తింపఁగా నిరాకరించుచున్నాఁడు. ఇమే=వాజసనేయి శాఖయందును ఛందోగ శాఖయందును జెప్పంబడిన వసిష్ఠత్వాదిగుణములను, అన్యత్ర= కౌషీతకి మొదలగువారి శాఖలలో నున్న ప్రాణవిద్యయందు నుపసంహరించునది. దేనివలన నంటేని, సర్వాభేదాత్ =ప్రాణసంవాదాది సారూప్యము వలన నెల్లశాఖలందు నది యొకటియె యగు ప్రాణోపాసనము భేదము లేనిదియై ప్రత్యభిజ్ఞాత మగుచున్నది యగుటవలనను. విజ్ఞానమునకు భేదము లేనియపు డొకచోఁ జెప్పంబడిన యీ గుణములు వేఱొకచో నెట్లుపసంహరింపఁబడవు ? అయ్యా ! " ఏవం " శబ్ద మూయాయి విద్యాప్రకరణమున వెవ్వేఱుగాఁ బఠింపఁబడిన గుణ

---

కొన్నవాఁడై, యః = ఎవఁ డుపాసించునో వాఁడు, ప్రాణే = ప్రాణమందుఁ, నిశ్శ్రేయసం = శ్రేష్ఠ్యమును, విదిత్వా = ఉపాసించి, (శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు.)

సముదాయము నుపాసనము కొఱకు సమర్పించుచున్న దని చెప్పంబడియె ననినఁ బరికింపఁగాఁ, గౌషీతకి బ్రాహ్మణమున నున్న "ఏవం" శబ్దముచే వాజసనేయి బ్రాహ్మణమునం దున్న గుణజాతము సన్నిహితము కాకపోవుట వలనఁ జెప్పంబడదు. కాని యీ విజ్ఞానముననే వాజసనేయి బ్రాహ్మణమునం దున్న "ఏవం" శబ్దముచే నా గుణసముదాయము చెప్పంబడినది కాఁబట్టి యొక విజ్ఞానమునకు సంబంధించిన గుణజాతము పరశాఖయం దున్నది యైనను స్వశాఖాగత మైనదానికంటె భేదిల్ల దని యిటఁ జెప్పంబడు చున్నది. ఇట్లగుచు నుండఁగా నొక శాఖయందు శ్రుత మైన గుణములును గుణికి భేదము లేకపోవుటవలన నన్ని శాఖ లందును వినంబడినవియె యగుచు నున్నవి కాఁబట్టి శ్రుతహాని గాని యశ్రుతకల్పన గాని సంభవింపదు. స్వదేశమందు శౌర్యాది గుణములు గలవాఁడని ప్రసిద్ధుఁ డైన దేవదత్తుఁడు వేఱొక దేశమునకుం బోయినవాఁ డగుచు నా దేశమున నున్న వారిచేఁ దెలియంబడని శౌర్యాదిగుణములు కలవాఁ డయ్యు నా గుణములు లేనివాఁడు కాఁడు గదా! మఱియు నె ట్లాతని పరిచయాధిక్యము వలన దేశాంతరమునందు నతని గుణములు తెలియంబడుచున్నవో యట్లే యభియోగా (అనుసంధానా)తిశయము వలన శాఖాంతరమున నుపాస్యము లైన

గుణములును వేఱొక శాఖయందును దెలియంబడుచున్నవి. కాంబట్టి యొక ధర్మిని సంబంధించిన ధర్మము లొకచోం జెప్పంబడినవి యయ్యు నెల్లచోట్ల నుపసంహరింపం దగినవియే యగును.

ఇది పంచమాధికరణము.

ఆనందాద్యధికరణము. ౬

సూ. ఆనందాదయః ప్రధానస్య. ౧౧

ప. ఆనందాదయః - ప్రధానస్య.

అ. జ్ఞేయ మగు బ్రహ్మమునకు ధర్మము లగు నానందాదు లన్నియు బ్రహ్మ మంతటను నొక్కటియె యగుట వలన నన్ని శాఖలయందు నుపసంహర్తవ్యములు.

భా. బ్రహ్మస్వరూపముం బ్రతిపాదించు శ్రుతులందు నానందరూపత్వము విజ్ఞానఘనత్వము సర్వగతత్వము సర్వాత్మత్వము మొదలగు బ్రహ్మధర్మము లొక్కొక శాఖయందుం గొన్ని కొన్ని వినంబడుచున్నవి. ఆనందాదు లగు బ్రహ్మధర్మము లెట నెన్ని వినంబడుచున్నవో యట నన్నియె తెలిసికొనం దగినవా ? యన్నియు నన్ని శాఖల నుపసంహర్తవ్యములా ? యని (బ్రహ్మ మొక్కటియె యగుట వలనను నిర్గుణ మగుటవలనను) వానియందు సంశయము

కలదు. అట్టిసంశయము కలుగఁగా శ్రుతివిభాగానుసారముగా ధర్మములం దెలియవలయునన్ని(పూర్వపక్షము) ప్రాప్తింప విధి చెప్పంబడుచున్నది. ప్రధానస్య = ప్రధాన (విశేష్య) మగు బ్రహ్మముయొక్క, ఆనందాదయః = ఆనందము మొదలగు ధర్మము లన్నియు నన్ని శాఖలందు నుపసంహరింపంబడగినవి. (ఆనందత్వము సత్యత్వము మొదలగునవి సామాన్యముగా బ్రహ్మన కందుఁ గల్పితము లగుధర్మములు. వాని కుపసంహారము నా క నింజెప్పు నానందాదిపదముల నేకవాక్యముగా నుచ్చరించుట.) ఎక్కాఁరణముచేవలన బ్రహ్మధర్మము లన్నియు నన్నిచోట్లం బ్రతిపత్తవ్యము లం టేని, సర్వాభేదా దేవ=అన్ని శాఖలందు నదియొకటియే ప్రధానము (విశేష్యమగు) బ్రహ్మము భేదిల్లదు కాఁబట్టి. బ్రహ్మధర్మములకుఁ బూర్వాధికరణమునఁ జెప్పంబడిన దేవదత్తశౌర్యాది నిదర్శనము చేతనే యన్నిశాఖలందు ను (భ్రాంతి నిరాసార్థము) పసంహార మావశ్యకమగుచున్నది. (సత్యానందాదు లన్యోన్యము విశేషణములు విశేష్యములు నగుచు విరుద్ధమైన యనృత జడాది భ్రాంతిని వారించుచున్నవియై సర్వాధిష్ఠాన మగు నొక యఖండవ్యక్తిని లక్షణచేఁ బ్రతిపాదించును. ఒక్కపదమును బ్రయోగించునపుడు విరోధము కాన్పింపదు కాఁబట్టి లక్షణ ప్రాప్తింపదు. చే నిట్టి లక్ష్యబ్రహ్మము సిద్ధింపదు గనుక వేఱొ

కపదము ప్రయోగింపవలసినది యగుచు నుండఁగా నూహింపంబడిన సమస్తభ్రాంతిని నిరసింపఁదగిన పదజాతము ప్రయోక్తవ్యము కాఁబట్టి యారోపింపంబడిన భ్రాంతి నివృత్తికై పరశాఖయందలి పదబృందము నుపసంహరింపందగినది యని భావము.)

అవ. అయ్యా! బ్రహ్మ మొకటియే యగుటవలన సచ్చిదానందత్వాది ధర్మముల కన్ని శాఖలందుఁ బ్రాప్తి యగునేని తైత్తిరీయకమున నానందమయాత్మ నుపక్రమించి "తస్య ప్రియమేవ శిరః మోదో దక్షిణః పక్షః ప్రమోద ఉత్తరః పక్షః ఆనంద ఆత్మా బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యని చెప్పంబడిన ప్రియశిరస్త్వాదులగు నన్ని ధర్మములు నన్నిచోట్ల సంక్రమింపవలసియుండు ననఁగా నుత్తరముం బలికెంచు చున్నాఁడు.

సూ. ప్రియ శిరస్త్వాద్యప్రాప్తి రుపచయాపచయౌ హి భేదే.౧౨

ప. ప్రియశిరస్త్వాద్యప్రాప్తిః - ఉపచయాపచయౌ - హి - భేదే

అ. జ్ఞేయమగు బ్రహ్మము నిర్భేదము గనుకను, దారతమ్యముగల ధర్మములు భేదముకలపుడే సంభవించుచున్నవి

---

౧. అ. పా. ౧. ఆనందమయాధికరణమున దీని యర్థము వ్రాయంబడినది.

గనుకను తైత్తిరీయకమునందలి ప్రియశిరస్త్వాదిధర్మముల కితర శాఖలం దుపసంహారము లేదు.

భా. హి=ఎక్కారణమువలనఁ బ్రియము మోదము ప్రమోదము నానందము ననునివి యొండొంటి నపేక్షించియు వేఱు వేఱు భోక్తల నపేక్షించియుఁ దారతమ్యము కలవిగా నామ్నాయించుచున్నవో యాకారణమువలనను, ప్రియశిరస్త్వాద్యప్రాప్తిః=తైత్తిరీయకమునఁ జెప్పఁబడిన ప్రియశిరస్త్వాది ధర్మముల కితరశాఖలందుఁ బ్రాప్తి (ఉపసంహారము) లేదు. మఱియును, ఉపచయాపచయౌ = వృద్ధిక్షయములు=నానా విధము లగు ధర్మములని యర్థము. భేదే = (ధర్మియందు) భేదము =(సప్రపంచత్వము) గల్గుచుండఁగనే సంభవించుచున్నవి. "ఏకమేవా ద్వితీయ" మిత్యాదిశ్రుతులవలన బ్రహ్మము నిర్భేద మని తెలియంబడుచున్నది. కాఁబట్టి యెటనెట బ్రహ్మము ప్రతిపాద్యమో యటనటఁ బ్రియశిరస్త్వాదులకుఁ బ్రాప్తిలేదు. మఱియుఁ బ్రియశిరస్త్వాదులు కోశధర్మములు గాని బ్రహ్మధర్మములు గావని యానందమయాధికరణమున మాంచే నుపదేశింపఁబడినది. మఱియుఁ బరమగు బ్రహ్మము నందుఁ జిత్తమును బ్రవేశింపంజేయ నుపాయమాత్రముగా నివి కల్పింపఁబడుచున్నవి కాని ద్రష్టవ్యములుగాఁ గావు. బ్రహ్మమునందుఁ జిత్తమును జేర్పు సాధనములయ్యు జ్ఞేయములు కావు

కాఁబట్టి వీనికితరశాఖలయందుఁ బ్రాప్తి బొత్తిగ లేదు. అట్లైన నీసూత్ర మేలయంటేని ప్రియశిరస్త్వాదులను బ్రహ్మధర్మములని తలఁచి (కృత్వాచింతచేసి) యాచార్యుఁడు ప్రియశిరస్త్వాదులకుఁ బ్రాప్తి లేదను నీన్యాయమును గనుపఱచెను.(బ్రహ్మధర్మములు కానివానిని బ్రహ్మధర్మములుగాఁ దలఁచి విచారించుటయే కృత్వాచింత యనంబడును.)ఆన్యాయము (జ్ఞేయమగు బ్రహ్మమునందు బాహ్యధర్మము లగు ప్రియశిరస్త్వాదుల కుపయోగాభావమువలనఁ బ్రాప్తి లేదనున్యాయము) పాసనకొఱ కుపదేశింపఁబడు చున్నవియు నిశ్చితము లైన బ్రహ్మధర్మములునగు సంయద్వామత్వాదులందును సత్యకామత్వాదులందును కూర్పందగినది. ప్రియశిరస్త్వాదుల కనుపయోగమువలనఁ బ్రాప్తిలే దను న్యాయమువలన సంయద్వామత్వాదులకుఁ బ్రాప్తిలేదని సూత్రము వ్యాఖ్యేయమని యర్థము. (అవి జ్ఞానమున కుపయోగింపకున్నను ధ్యానమున కుపయోగించును గాఁబట్టి యుపాస్యబ్రహ్మ మంతటను నొకటియె యగుటవలన నొకవిద్యయందుఁ జెప్పంబడిన గుణములకు వేఱొకచోఁ బ్రాప్తికావచ్చు ననిన) నాఁడియందుపాస్యబ్రహ్మ మొకటియే యైన నుపక్రమభేదమువలన నుపాసనభేదము గలుగుచుండఁగా నొక యుపాసనయందలి ధర్మములకు వేఱొకచోఁ బ్రాప్తిలేదు. ఎట్లనిన నొకశాఖ

నిద్దఱు స్త్రీలొకతె ఛత్రధారణముచేతను వేఱొకతె చామరముచేతను సేవించుచున్నారు. అపుడుపాస్యుఁడొకఁడైన నుపాసనభేదమును ధర్మవ్యవస్థయుఁ గలదు. అట్లే యిటను గావచ్చును. ధ్యానవిధికి లోఁబడిన ధర్మములకు విధివలన వ్యవస్థగల దని యర్థము. (సగుణమునందువలె నిర్గుణమునందును బ్రహ్మ మొక్కటియె యగుటవలన గుణోపసంహారానుపసంహారవ్యవస్థ యేల చేయరా దనిన) వృద్ధిక్షయములుగల (తారతమ్యముగల) ధర్మములు, భేదే = భేదవ్యవహారము గలుగుచుండఁగా సగుణబ్రహ్మమునం దుపపన్నములుగాని నిర్గుణపరబ్రహ్మమునం దుపపన్నములు కావు కాఁబట్టి చేయరాదు. కనుక సత్యకామత్వాదిధర్మముల కొకశాఖయందు వినంబడినవానికి వేఱొకశాఖయందుఁ బ్రాప్తి లేదని యర్థము.

సూ. ఇతరే త్వర్థ సామాన్యాత్. ౧౩

ప. ఇతరే - తు - అర్థసామాన్యాత్.

అ. తక్కిన యానందాదిధర్మములు ప్రతిపాద్యమగు బ్రహ్మ మొక్కటియె యగుటవలన నన్నిచోట్లను బ్రతిపత్తవ్యములు.

భా. ఇతరేతు = బ్రహ్మస్వరూపప్రతిపాదనముకొఱకై చెప్పంబడినవి యగు నానందాదిధర్మములు (సత్యత్వ జ్ఞానత్వానందత్వాత్మత్వ పూర్ణత్వము లైదును) ప్రతిపత్తిమా

త్రము ప్రయోజనము గాఁగలవి యగుటను అర్థసామా న్యాత్ = ప్రతిపాద్య మగు బ్రహ్మమును ధర్మిమొక్కటియె యగుటవలన నన్నియు నన్నిశాఖలందు నుపసంహర్తవ్యము లను నీ వైషమ్యము గలదు.

ఇది షష్ఠాధికరణము.

## ఆధ్యానాధికరణము. ౭

సూ. ఆధ్యానాయ ప్రయోజనాభావాత్. ౧౪

ప. ఆధ్యానాయ - ప్రయోజనాభావాత్.

అ. "ఇంద్రియేభ్యః పరాహ్యర్థా" యనునది మొదలగు కాఠకవాక్యమునందు దీనికంటె నిదియు దీనికంటె నిదియుఁ బర మని ప్రతిపాదించుటచేఁ బ్రయోజనము లేదు కాఁబట్టి పురుషుఁడే యన్నిటికంటెం బరుఁడని ధ్యానపూర్వకమైన సమ్యగ్దర్శనము[1] కొఱకుఁ బ్రతిపాదింపఁబడును.

భా. ఇంద్రియేభ్యః పరాహ్యర్థా హ్యర్థేభ్యశ్చ పరం మనః మనసశ్చ పరాబుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః మహతః పరమవ్యక్తమవ్యక్తా త్పురుషః పరః పురుషాన్న పరం కించిత్సాకాష్ఠా సా పరాగతి" యనువాక్యము కాఠకమునఁ బఠింపఁబడుచున్నది. ఇం దర్థాదులగు నివియన్నియు దానికంటె

౧. అ. ౧. పా. ౪. నానుమానికాధికరణమున వ్యాఖ్యాతము.

దానికంటెంబరములని ప్రతిపాదింపఁబడుచున్నవా? లేక యివి యన్నిటికంటెం బురుషుఁ డొకఁడె పరుఁ డని ప్రతిపాదింపఁబడుచున్నదా? యను సంశయము కలదు. సంశయము గలుగుచుండఁగా వీనికన్నిటికిం బరత్వమునం బ్రతిపాదన మని బుద్ధి పుట్టుచున్నది. అట్లేకదా "ఇద మస్మాత్పర మిద మస్మాత్పర" మని (ఇది దీనికంటెం బరమిది దీనికంటెం బరమని) వినంబడుచున్నది. అయ్యా! పెక్కులగు నర్థము లొకదానికంటె నొకటి పరమని ప్రతిపాదింపఁ గోరఁబడినవి యగుచు నుండఁగా వాక్యభేదము గలుగు ననిన వాక్యబాహుల్యముపపన్న మగుటవలన నిది దోషము కాదు. పెక్కులేయగు నివాక్యములు పరత్వముతోఁగూడిన పెక్కులగు నర్థములను బ్రతిపాదింప సమర్థములగుచున్నవిగదా! ఆ కారణమువలనఁ బ్రత్యేకముగా వీనికిఁ బరత్వప్రతిపాదన మనునది ప్రాప్తింపఁగాఁ బురుషుఁడే యెల్లవానికంటెం బరుఁడుగాఁ బ్రతిపాదింపఁబడుచున్నాఁడుగాని ప్రత్యేకముగా వీనికిఁ బరత్వప్రతిపాదనము లేదని చెప్పుచున్నారము. దేనివలన నంటేని, ప్రయోజనాభావాత్ = ప్రయోజనము (ఫలము) యొక్క-యభావము (లేకపోవుట) వలనను, అర్థాదు లిది దీనికంటె నిది దీనికంటెఁ బరమని ప్రతిపాదింపఁగోరఁబడినవి యగుచు నుండఁగాఁ బ్రయోజన సిద్ధియుఁ జూడఁబడదు; వినంబడదు,

దీనికి విలక్షణముగా ననర్థముల నన్నింటి నతిక్రమించిన పురుషుఁ డింద్రియాదు లగు నెల్లవానికంటెఁ బరుఁ డని తెలియంబడినవాఁ డగుచునుండఁగా మోక్షసిద్ధి యను ప్రయోజనము చూడంబడుచున్నది. "నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే" యని శ్రుతియు నట్లే చెప్పుచున్నది. మఱియును (వేదము) పురుషునికంటెం బరమైన దెద్దియు లేదని నిషేధించుటచేతను, కాష్ఠాదిశబ్దముచేతను (బాధావధియని చెప్పుటచేతను) బురుషునం దాదరముం జూపుచుఁ బూర్వపూర్వముదానికంటెఁ దరువాతిది దరువాతిది పరమనునట్టి వాక్ప్రవాహము పురుషప్రతిపత్త్యర్థమేయని తెలుపుచున్నది. (అర్థాద్యుక్తి స్వయముగాఁ బ్రయోజనము లేనిది గనుకను) ఆధ్యానాయ = తత్త్వపరిత్వ ధ్యానపూర్వకముగాఁ బురుషదర్శనముకొఱకే యని యర్థము. ఇట నాధ్యానము సమ్యగ్దర్శనముకొఱకే యుపదేశింపఁబడుచున్నది గాని స్వప్రధానముగాఁ గాదు.

సూ. ఆత్మశబ్దాచ్చ. ౧౫

ప. ఆత్మశబ్దాత్-చ.

అ. ప్రకృతుఁడగు పురుషునం దాత్మశబ్దప్రయోగము

---

౧. క. 3. ౧౫. తం = మీఁదఁ జెప్పంబడిన బ్రహ్మమును, నిచాయ్య = తానుగాఁ దెలిసికొని, మృత్యుముఖాత్ = అవిద్యాదిలక్షణ మగు సంసారముఖమునుండి, ప్రముచ్యతే = విడివడుచున్నాఁడని యర్థము.

వలన నింద్రియాదులం జెప్పుట పురుషునిం దెలియుకొఱకే యగును.

భా. ఆత్మశబ్దాచ్చ=“ఏష సర్వేషు భూతేషు గూఢో త్మాన ప్రకాశతే దృశ్యతే త్వగ్ర్యయాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభి” యని శ్రుతిప్రకృతుఁడగు పురుషుఁడాత్మయని యెక్కారణమువలనం జెప్పుచున్నదియో యాయీకారణము వలన నింద్రియాదిప్రవాహోక్తి పురుష ప్రతిపత్త్యర్థమె. ఆత్మశబ్దమువలన (పురుషునం దాత్మశబ్దమును బ్రయోగించుటవలనఁ) బురుషునికంటె నితరము లగువానికనాత్మత్వము తెలియంబడుచున్నది. మఱియుం బురుషునకే దుర్విజ్ఞానత్వమును (సమాధి) సంస్కృతబుద్ధిగమ్యత్వమును జూపుచున్నది. పురుషుని దెలియుకొఱకే “యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞ” యనునది మొదలగు ధ్యానమును సయితము విధించుచున్నది. ఇది ధ్యానమును విధించుచున్న దనునది యానుమానికాధికరణమున (మాచే) వక్కాణింపఁబడెను.

ఇట్లు శ్రుతికిఁ బురుషునం దనేకప్రకారమగు నాదరాతిశయము చూడఁబడుచున్నది. (ఉపక్రమోపసంహారము లొక్కరూపున నుండుటవలనను గ్రంథసందర్భము పురుష

---

౧. క. 3. ౧౨. ౨. క. 3. ౧3. అ. ౧. పా. ४. న నానుమానికాధికరణమున వ్యాఖ్యాతములు.

పరమె యని చెప్పుచున్నారము.) మఱియును, "సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమంపద"మని చెప్పంబడినది యగుచునుండఁగా నధ్వమునకుఁ బారమగు నావిష్ణుని పరమపద మెద్ది యను నాకాంక్షయం దింద్రియాదులను పరుసగాఁ జెప్పుటవలన నీయామ్నానము పురుష ప్రతిపత్త్యర్థమె యని నిశ్చయింపఁబడుచున్నది.

ఇది సప్తమాధికరణము.

---

ఆత్మగృహీత్యధికరణము. ౮

(ఈ యధికరణమునఁ బూర్వపక్షమున వాక్యము సూత్రాత్మోపాసనపర మగుటవలన బ్రహ్మధర్మములగు నానందాదుల కుపసంహారము లేదు. సిద్ధాంతమున నుపసంహారము కలదు.)

సూ. ఆత్మగృహీతి రితరవ దుత్తరాత్. ౧౬

ప. ఆత్మగృహీతిః - ఇతరవత్ - ఉత్తరాత్.

అ. "ఆత్మన ఆకాశస్సంభూత" యిత్యాది వాక్యములందువలెనే "ఆత్మావై" ఇత్యాదివాక్యమునందు నాత్మశబ్ద

---

౧. క. 3. ౯. సః = మనసును వశపఱిచికొన్న విద్వాంసుఁడు, అధ్వనః = సంసారమార్గముయొక్క, పారం = ప్రాప్తవ్యమైన యవతలి యొడ్డును, అప్నోతి = పొందుచున్నాఁడు. సంసారబంధము లన్నిటినుండి విడివడుచున్నాఁ డని యర్థము. తత్ = అది, విష్ణోః = వ్యాపనశీలుఁ డగు బ్రహ్మముయొక్క, పరమం = ప్రకృష్టమగు, పదం = స్థానము = తత్త్వము.

ముచేఁ బరమాత్మగ్రహణమే యుక్తము. తరువాతనున్న "స ఈక్షత" మొదలగు విశేషణములవలన నదియేన్యాయ్యము.

భా. "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్య త్కించన మిషత్, స ఈక్షత లోకాన్ను సృజా ఇతి, స ఇమాఁ లోకానసృజతాం భోమరీచీర్మరమాప" యనునది మొదలగు వాక్య మైతరేయమున వినంబడుచున్నది. (ఆత్మశబ్దమునకు బ్రహ్మమునందును హిరణ్యగర్భునందును బ్రయోగము కాన్పించుటవలన) నట నాత్మశబ్దముచేఁ బరమాత్ముఁడు చెప్పంబడుచున్నాఁడా వేఱొకఁడా యను సంశయము కలదు. సంశయము కలుగఁగా నేనిప్రాప్త మయ్యె ననిన నిట నాత్మశబ్దముచేఁ బరమాత్ముఁ డఖిలప్పుఁడుగా నర్థుఁడుగాఁ డని ప్రాప్తించెను. దేనివలననం టేని వాక్యమునకుఁ బ్రజాపతి

౧. ఐ. ౧. ౧. ఇదం = ఇప్పుడు నామరూపాదులచే భిన్న మగు నీ జగము, అగ్రే = సృష్టికింబూర్వము, ఆత్మావై = సజాతీయాదిభేదము లేని యాత్ముఁడేయై, ఆసీత్ = ఉండెను. అన్యత్ – కించన = మఱొక టెద్దియును, నమిషత్ = లేదు. సః = అతఁడు, (సర్వజ్ఞుఁడగుటవలనను) లోకాన్ = ప్రాణులకు ఫలోపభోగస్థానములను, సృజై–ను = సృజింతు నాయని, ఈక్షత = సంకల్పించెను. ను శబ్దము వితర్కార్థకము. సః = అతఁడు, (సంకల్పించి యాకాశాదిక్రమమున నండమును సృజించి) అంభః = స్వర్గము, మరీచిః = అంతరిక్షము, మరం = భూలోకము, ఆపః = పాతాళమునను, ఇమాన్– లోకాన్ = ఈలోకములను, అసృజత = సృష్టించెను. (ఇటనంభశ్శబ్దముచే ద్యులోకముకంటె మీఁదనున్న మహాదిలోకములు నంభోలోకమున కాధారమగు ద్యులోకమును గ్రహింపఁబడుచున్నవి.)

యందుఁ దాత్పర్యము కాన్పించుటవలనను. అయ్యా! సృష్టికిం బూర్వమాత్మైకత్వమును నిశ్చయించుటవలన నీక్షణపూర్వకమైన స్రష్టృత్వముం జెప్పుటవలనను వాక్యతాత్పర్యము మిక్కిలిగాఁ బరమాత్మవిషయమే యై చూడంబడుచున్నది యంటేని లోకసృష్టిం జెప్పుటవలన నట్లు చూడంబడదని చెప్పంబడుచున్నది. స్రష్ట పరమాత్ముఁడుగా గ్రహింపఁబడుచుండఁగా మొదట మహాభూతసృష్టిం జెప్పవలెనుగదా! ఇట మొదట లోకసృష్టి చెప్పంబడుచున్నది. లోకములనునవి మహాభూతసన్నివేశ విశేషములు. (వేదము) "[1]అదోంభః పరేణ దివ" మిత్యాదిగ్రంథముచే నంభః ప్రభృతులను లోకములుగా నిర్వచించుచున్నది. లోకసృష్టి పరమేశ్వరునిచే నధిష్ఠింపఁబడిన (= ప్రేరింపఁబడిన) వాఁడు నీశ్వరుఁడు నగు నొకానొకపరునిచేఁ జేయంబడుచున్నది యని శ్రుతిస్మృతులందుఁ జూడంబడుచున్నది. "[2]ఆత్మై వేదమగ్ర ఆసీత్పురుష

౧. ఐ. ౧. ౨. ఈ యంభశ్శబ్దవాచ్యమగు లోకము ద్యులోకముకంటె మీఁదనున్నది.

౨. బృ. ౩. ౪. ౧. అగ్రే = వేఱుశరీరములు పుట్టకమునుపు, ఇదం = ఇపుడు వేఱువేఱుగానున్న శరీరజాతము, ఆత్మైవ = ప్రజాపతియే యై ఆసీత్ = ఉండెను. సః = అతఁడు, పురుషవిధః = శిరఃపాణ్యాదులుగల విరాట్టే. అతఁడు నరాకారుఁ డనియేని యర్థము. (అతఁ డన్నిటిని సృజించెను.)

విధ" ఇత్యాదిశ్రుతియును, "సవై శరీరీ ప్రథమ స్సవై పురుష ఉచ్యతే। ఆదికర్తా సభూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత" యను స్మృతియు నట్లే ప్రతిపాదించుచున్నవి. ఐతరేయులును "అథాతో రేతస స్సృష్టిః ప్రజాపతే రేతో దేవాః" యనుచోఁ బూర్వప్రకరణమునను ప్రజాపతికర్తృకమైన విచిత్రసృష్టిం బఠించుచున్నారు. "ఆత్మైవేదమగ్ర ఆసీత్పురుషవిధః" యనుచో నతనియం దాత్మశబ్దమును బ్రయోగింపఁబడుచున్నదియై చూపఁబడినది. సృష్టికిం బూర్వము స్వవికారాపేక్షమైన యేకత్వావధారణము నతనియందు నుపపన్నమగుచున్నది. అతనికిఁ జేతనత్వ మంగీకరించుటవలన నీక్షణ ముపపన్నము. శ్రుతియును "తాభ్యో[3]

౧. సః వై = ఆహిరణ్యగర్భుఁడే, ప్రథమః-శరీరీ = మొదటిదేహి. సవై = అతఁడే, పురుషః - ఉచ్యతే = పురుషుఁడని చెప్పంబడుచున్నాఁడు. భూతానాం = లోకములకు, ఆదికర్తా = మొదటి స్రష్టయగు, సః బ్రహ్మా = ఆచతుర్ముఖుఁడు, అగ్రే = లోకసృష్టికింబూర్వము, సమవర్తత = ఉండెను.

౨. ఐ. ఆ. అథ = నియమ్యముల సృజించినతరువాతను, అతః = నియమించువాఁడు లేనియెడల నియమింపఁదగినవాని సృష్టి వ్యర్థమగుటవలనను, రేతసః = వీర్యముయొక్క, సృష్టిః = నిర్మాణము (చెప్పంబడుచున్నది.) దేవాః = దేవతలు, ప్రజాపతేః = హిరణ్యగర్భునియొక్క, రేతః = వీర్యము. (వీర్యమువలన జన్మించినవారని యర్థము.)

3. ఐ. ౧. ౨. ౨. (ఆ యగ్న్యాదిదేవతలు సృజింపఁబడినవారై మేము జీవించుచుండి యన్నమును భుజింతుమో యట్టి వ్యష్టిదేహము మాకు దయచేయుమని ప్రార్థింపఁగా హిరణ్యగర్భుఁడు) తాభ్యః = ఆదేవతలు

మానయత్తాభ్యో ఒశ్వమాన యత్తాభ్యః పురుషమానయత్తా అబ్రువ "న్ననునిట్టి యధికమగు వ్యాపార విశేషము లౌకికులు విశేషవంతులు నగు నాత్మలందుఁ బ్రసిద్ధ మగునది ఘ్ఘో యిట (స్రష్ట యగు నాత్మయందు) ననుగమింపఁబడుచున్నది. కాఁబట్టి విశేషవంతుఁడే యగు నొకానొకఁడిట నాత్మఁడు కావచ్చునని ప్రాప్తింపఁగాఁ బరుఁడగు నాత్మఁడే యిట నాత్మశబ్దముచే గ్రహింపఁబడుచున్నాఁడని చెప్పఁనము. ఇతరవత్ = ఎట్లు "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూత" యనునది మొదలగు నితర సృష్టివాక్యములం దాత్మశబ్దముచేఁ బరుఁడగు నాత్మనకు గ్రహణమో మఱియు నెట్లితర మగు = లౌకికమైన యాత్మశబ్ద ప్రయోగమునందు నాత్మశబ్దముచేఁ బ్రత్యగాత్మఁడే ముఖ్యార్థముగా గ్రహింపఁబడుచున్నాఁడో యట్లే యీ వాక్యమునందును ఆత్మగృహీతిః = ఆత్మగ్రహణము కాఁదగును. "ఆత్మైవేద మగ్ర ఆసీ" దిత్యాదులందు నెచటను "పురుషవిధ" యనునది మొదలగు

---

వసించుకొఱకని యర్థము. గాం = గోశరీరమును, అనయత్ = (మునుపటి భూతములనుండియే సృజించి) చూపెను. (వారు దాని నొల్లరైరి. తరువాత నతఁడు) తాభ్యః = ఆదేవతలకొఱకు, అశ్వం = అశ్వశరీరమును, అనయత్ = (మునుపవలె సృజించి) చూపెను. (వారు దాని నంగీకరింపమిచేత నతఁడు) తాభ్యః = వారికొఱకు, పురుషం = పురుషశరీరమును, అనయత్ = కనుపఱచెను. తాః = ఆదేవతలు, అబ్రువన్ = (ఇది మంచి యధిష్ఠానమని) చెప్పిరి.

నితర విశేషణము వినంబడుచున్నదో యట విశేషవంతుఁ డగు
నాత్మనకు గ్రహణము యుక్తము. కాని యిటను, ఉత్త
ర్యాత్ = "స ఈక్షత లోకాన్ను సృజై" యనునదియును,
"స ఇమాఀ లోకా న సృజత" యనునది మొదలగునట్టి
రమాత్మున కనుగుణ మైన మీఁది విశేషణము కాన్పిం
టవలనఁ బరమాత్మునకే గ్రహణము న్యాయ్యము.

గా. అన్వయా దితి చేత్స్యా దవధారణాత్. ౧౭

ప. అన్వయాత్ - ఇతి - చేత్ - స్యాత్ - అవధార
ణాత్.

అ. వాక్యతాత్పర్యము ప్రజాపతియందుఁ గాన్పించు
వలన నాత్మశబ్దముచేఁ బరమాత్మగ్రహణ మిటు న్యాయ్య
గా దనిన సృష్టికిం బూర్వ మేకత్వమును నిశ్చయించుటవలన
న్యాయ్యమె యగునని చెప్పంబడుచున్నది.

భా. వాక్యాన్వయము సూత్రాత్మునియందుఁ గాన్పిం
వలనఁ బరమాత్మగ్రహణము యుక్తము గాదని యెద్ది
ఐనదో యది పరిహరింపఁబడుచున్నది. అన్వయాత్ =
త్పర్యము ప్రజాపతియందుఁ గాన్పించుటవలన నిచ్చ
గ్రహణము యుక్తముగాదు. ఇతి చేత్ = ఇట్లం టేని
రాత్మగ్రహణ ముపపన్నము, స్యాత్ = అగునని
ది. లేనివలననం టేని, అవధారణాత్ = పర

